- ప గ మా ప పా || నీ సా సా ||
- క ను గొ న బో || తే నం దు ||

- ప ని సా - గ రి స || సా రి ని సా స స ||
- క ళ లిం - - తే - || వు - - డీ న వి ||

స గ మ ప మ గ రి స || సా రి ని సా సా ||
వె ను కొ - ని - కాం - || త - - లె ల్ల ||

ప ని స రి స రి ని స ని ద పా || మ ప మ గ మ గ ప మ గ రి సా ||
వే - - - లు - కా - - - - || డే - - - - - రా - - - - || ||నీకేల||

**అవతారిక :**

ఇదంలి నాయక రూప గర్వీత, మానవతి, స్వాధీనరతిక, ఈమెనాధుడు తనకు వలచి దాసుడై యున్నాడని బిగువులు పోవుచుండగా చూచి చెలులు "పంతములు నీకు మంటలోనే కలుగుచున్నవి నీ చింతలు చేతిలో గల చెక్కులయందే యున్నవి. దోసములాడిన వింతలు నీ నివ్వెరగులలోనే యున్నవి. మాటలు మాని నవ్వులు లేక యున్న నీ పెదవులపై బిగువులు తెలియుచున్నవి. ఎట్టి పనులకైనను తెగువరివని నీ కన్నులు తెలుపుచున్నవి. నీ అగడము లన్నియు పొలయలుకలే చెప్పుచున్నవి. ఇక ఎకసెక్కెము లాడక నీ నాధుడు సంతసించునట్లు ఆనందముగా నుండవే, నిన్ను వలచుట ఆతని దోసమా" అని మందలించు చున్నారు.

ధన్యాసి—రూపకం

వలచులే దోసమా వనిత నీ కాతడు
నలువంక మరియేటి నవ్వులు నవ్వవే ॥పల్లవి॥

పంతమెల్ల నీ మాటపట్టు లోననే వున్నది
చింతలెల్ల నీ చెక్కు చేత నున్నవి
వింత లిన్నియును నీ నివ్వెరుగులతో నున్నవి
యెంత కెంత పతినింకా యేటికి దూరేవే ॥వలచులే॥

బిగువెల్ల నిపుడు నీ పెదవులపై నున్నది
తెగువలు నీ కన్నుల తేట నున్నవి
అగడింతా నీ పొలయలుకలలో నున్నది
యెగసక్కె లాతని నేటికి నాడేవే ॥వలచులే॥

గబ్బి తనమెల్లాను నీ కౌగిటిలోనే వున్నది
నిబ్బరము నీ వుండేటి నీటులో నున్నది
అబ్బురమై శ్రీ వేంకటాధీశుడు నిన్ను గూడె
వుబ్బున నీతనికెంత వోరటులు చూపేవే ॥వలచులే॥

రేకు : 27–183

ప. ప ని సా స ని రి స ని ద || ప ని సా - - ||
వ ల చు ఛే - దో - - - || - స మా - - ||

- ప ని స రి స ని సా ని ద ప మ || గ రి స ని సా స గ మా ||
- వ - ని - త - - సీ - - - || కా - త - డు - - - ||

స మ మా ప మ గ మా || ప ని ని స ని ద పా ||
న లు వం - - - క || మ రి యే - - - టి ||

ప ని స మ గ రి స || సా రి ని సా - - ||
న - వ్వు లు - న - || వ్వే - - వే - - || ||వలచుఛే||

చ. - స రి స నీ - ద ప || ద మ పా ప || - గ మ ప ని స రి ని స ||
- వం - త మె - - ల్ల || నీ - మా ట || - వ ట్టు లో - - - న - ||

ని ద పా నీ స స || - ప ని సా ని || రి స ని ద ప మ పా ||
నే - - పు న్న ది || - చిం త లె ల్ల || నీ - - - చె - క్కు ||

ప మ గ గ ప మ గ రి రీ || సా - - - - ||
చే - - త ను - - - న్న || వి - - - - ||

- ప ని స స గ మ మ || పా ని ప ప మ గా - - ||
- విం - త లి - - న్ని || యు - - ను - సి - - ||

- స గ మా ప ని స ని ద || పా ప మ పా - ||
- ని - వ్వె ర గు - ల - || ను న్న - ది - ||

- స గ మా పా ప || ని ని స ని ద పా పా ||
- యెం - త కెం త || ప లి - నిం - - కా ||

- గ మా ప నీ స ని గా || గ రి రీ సా - - ||
- యే - టి కి దూ - - || రే - - వే - - || ||వలచుఛే||

**అవతారిక :**

సహజ సౌందర్యవతి యగు నాయిక స్వాధీన పతిక. ఈమె సౌందర్యమును చమత్కార ముగా వర్ణించుచు "అలంకారములతో పని యేమని, అందముగా తయారైన ముత్యమునకు మెరుగు పెట్టుట యేల? ఘనమగు నీ కొప్పునకు చేమంతులేల? అద్దము వంటి నీ చెక్కులకు అరవిరి పూతలేల? చంద్రుని వంటి నీ మోమునకు కస్తూరి యేల? అనుకూలుడగు నాయకుడైన శ్రీ వేంకటాధీశుని కౌగిలి యందు నీ యందమును నీనే చూచుకొన వచ్చును. అద్ద మెందులకే;" యని చెలులు చెప్పు చున్నట్లు అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

**రాగలక్షణము :**

ఆహిరి రాగము అతి ప్రాచీనము. వెంకటమఖి సంప్రదాయమున నారీ రీతి గౌళ జన్యముగాను, భాషాంగముగాను, ప్రతి మధ్యమము తప్ప తక్కిన స్వరములన్నియు పలుకునది గాను వివరించి యున్నారు. కాని యిప్పటి వాడుక ప్రకారము వకుళాభరణము జన్యముగా నుండి 'ని ద ని స' అను సందర్భమున చతుశ్శృతి ధైవతమును, 'స గ స' అనునప్పుడు సాధారణ గాంధారమును పలుకుచు భాషాంగముగా యీ రాగము ఒప్పు చున్నది. దీనిని పూర్వాచార్యులు 8వ మేళముగా చెప్పి యున్నారు. ఇందలి గమక వరికాదులు గురు ముఖమున అభ్యసించి పాడు కొనవలెను. ఇందు గల స్వరముల యందు నొక్కు, జారు, కంపితము పలుకువిధము కొంచెము కష్ట సాధ్యము. 'ని ద ని స' అనునప్పుడు మాత్రమే చతు శృతి ధైవతము పలుకును. 'ద ని ద ప' అనునప్పుడు శుద్ధ ధైవతమే పలుకును. 'స గ మ ప' అను ప్రయోగము తరచు వచ్చును. స గ స ని అనునప్పుడు సాధారణ గాంధారము ఛాయా మాత్రముగా తోచును.

**ఆహిరి — ఆది**

మూసిన ముత్యానికేల మెరంగులు
ఆసల చిత్తానికేల అల వోకలు ॥పల్లవి॥

కందులేని మోముకేల కస్తూరి
చిందని కొప్పున కేల శీమంతులు
మందయాన కేల మట్టిల మోత
గంధ మేలె పై పై కమ్మని నీమేనికి ॥మూసిన॥

ఖారపు గుబ్బల కేలపయ్యా దాని
ఓరపు జూపుల కేల పెడమోము
జీరల బుజాల కేల చెమట లూని
గోరంట గోళ్ల కేల కాన వాళ్లు                                   ॥మూసిన॥

ముద్దుల మాటల కేల ముదము లూని
యద్దంపు జెక్కుల కేల
అర విరి వొద్దిక మాటల కేల వూర్పులు నీకు
నడ్డ మేల తిరు వేంకటాద్రీశుంగూడి                                   ॥మూసిన॥

శృం : 3-73

ప. పా ప ద ని సా ని । ద ని స రి । స ని ద ప ॥
మూ సి న ము త్యా ని । కే - లే - । మె రు గు లు ॥

స గ మ ప ద నీ ద । ప మ గ మ । గ స రి స ॥
ఆ - స లు చి త్తా ని । కే లె య ల । వో - క లు ॥                                   ॥మూసిన॥

చ. సా - రి స ని ద ని స స । స ని ని ప । ద ప ప మ ॥
కం - దు లే ని మో - - ము । కే - లే - । క - స్తు రి ॥

పా - ద ని సా ని ద ప । ప మ గ మ । మ గ సా రి స ॥
చిం - ద ని కొ ప్పు కే - । లే - చే - । మం - - తు లు ॥




పా - ద ని స స స స ని । ద ని స రి । స ని ద ప ॥
మం - ద యా న ము న కే లె । మ - ప్పై ల । మో - - త ॥

పా - ద ప మ గ మ గ రి । స గ మ ప । ప మ గ మ ॥
గం - ధ మే లె పై - పై ని । క - మ్మ ని । మే - ని కి ॥

ప ద ని స స సా ని । ద ని స రి స రి । ని సా - ॥
మూ - సి న ము త్యా ని । కే - - - - - । లే - - ॥                                   ॥మూసిన॥

**అవతారిక :**

ఇందలి నాయిక రూప గర్విత, ప్రౌఢ, స్వాధీనపతిక, ఈమెకు నాథుని వలపిం వెంట వెంట త్రిప్పుకొనుట తెలియును, తనపై వలపు గల ప్రియుని విరహార్తునిగా చే వ్యాపారము లొలికించుచు మురిపించుట ఈమెకు వేడుక, ఆమె చేతలకు చెలులు వెరగు పడు 'ఇట్టి పనుల వలన నీకేమి వొరిగినదే చంద్రవంకా!' యని మందలించు చున్నారని అయ్యవా చెప్పుచున్నారు.

ఇందు అయ్యవారు వాడిన పదముల సొగసు, అనుభవైక వేద్యము. ఆహిరి రాగ అందములు ఆ పదముల కలయికలో పూవులకు తావులవలె సుందరముగ అమరుట గమనార్హమ

ఆహిరి — ఝంపె

విరహాన బడలెను విభుడు యిందా కాను
పురుషార్థ మిందు వంక బొందే దేమే ॥పల్లవి॥

కంతుని దీపమవై ఘనుని భ్రమ యించేవు
యెంత నిందు వంక నేమి పుణ్యమే నీకు
వంత మున వలపించి పలుమారు నలిగేవు
యెంత లాభము గలిగె నిందు వంక నీకు ॥విర॥

చెఱకు సింగిణివై చెలువుని నే చేవు
గుఱిగా నెంత ధనము గూడెనే నీకు
వెఱగు వడుచు నీవు వెంట వెంట దిప్పేవు
నెఱ దొరతన మెంత నేర్చితివె నీవు ॥విర॥

పూవుల గాలమవై పురుషుని దగిలేవు
వేవే యెంత రాజ్యమేలితిదె నీవు
యీ వల శ్రీవేంకటేశు డితడిట్టె నిన్ను గూడె
కైవశమై యెంత కొడిగట్టి తివె నీవు ॥విర॥

శృం : 20—83

ప. పదనీసఁ | నిపదపా || మగమాపాద దపమ | గమాగసరిస ||
1. విరహాన | వెడలెను || వి - భు డు యిం - - - | దా - - క ను - ||

2. పదనీసఁ | రిఁ రిఁ సఁ ని ద ని సఁ రిఁ సఁ ని ||
విరహాన | వె - డ - లె - ను - - - ||

నిపదా పమ గ మపద | ప మ గ మ గ స రి స ||
వి - భు డు - యిం - - - | దా - - - క - ను - ||

స ప ప ప మ గ మా | గ మ ప ద నీ ప || ద ని సాఁ ని | ని ప దా పా - ||
పు రు షా - - - ర్థ | మిం దు వం - - క || పొం - దే - | దే - - మే - ||
||విరహాన||

చ. పా ద ప మ | గ మ ప మ గ || స గ మ ప ద | ని ప ద ప ప ||
పూ పు ల - | గా - ల మై - || పు రు షు ని - | త గి లే - వు ||

ప ద ని సాఁ | ని ప ద ప మ || గా మ ప ప | ద ని దా పా - ||
వే - వే - | ఎం త రా - జ్య || మే లి తి వి | నీ - - వు - ||

ని ద ని సఁ సఁ | సాఁ రిఁ సఁ నీ ని || సఁ మఁ గఁ సఁ రిఁ సఁ | రిఁ ని సాఁ సఁ ||
ఈ - వ ల శ్రీ | వేం క - టే శు || డి త - డి - టై | ని న్ను గూ డె ||

సాఁ రిఁ సఁ ని ని ప | ద ప ప ప మ ||
కై - - వ శ - | మై - ఎం - త ||

1. గ మ గ రి స | గ మ పా మ ||
కొ డి గ - ట్టి | తి వె నీ వు ||

2. గ మ ప ద ప మ గ మ ప ద | ప మ గ రి స గ మ ప ||
కొ - డి - గ - - - ట్టి - | తి - వె - నీ - - వు ||

**అవతారిక :**

ఇందు నాయిక విరహోత్కంఠిత. పారవశ్యమున నాయకుడు శ్రీ వేంకటేశ్వరు సన్నిధికి రాగా "నీ మనసెట్టున్నదో, నేను నీకై పరితపించి నీరాకకై వేచి యున్న దానః నిన్ను చూచినంతనే పరవశనౌదును. నీతో రహస్యములు ముచ్చటించుకొను వరకు వే పాటును అణచుకొనజాలని దానను. నీవు నన్ను కవ్వించి కౌగిట చేర్చువరకు కరగి ఆర పడుచుందును. నీ మేను సోకినంతనే పులకించి పోవుదును. నిన్ను విడువ జాలకున్నాను స్వా ఏమి సేయుదును" అని తన నాథునితో చెప్పుకొను చున్నది.

**రాగలక్షణము :**

నాగవరాళి 8వ మేళమగు హనుమతోడి జన్యమని లక్షణ కారులు చెప్పి యున్నా ఇది మంద్రధైవతము నుండి, మధ్యస్థాయి నిషాదము వరకు సంచారములు కలిగి యుం రాగమని కొందరి మతము. తారస్థాయి సంచారములు ఉండినట్లు కొందరి మతము. గ తారస్థాయి సంచారములు సందర్భాను సారముగ అన్నమయ్య వారి పదములు స్వరపరచుట చేర్చడమైనది. విలంబ కాలమున స్వరములను నియతస్థానముల యందు తగు మాత్రపు గ వరి కాదులతో పట్టునపుడు రాగస్వరూపము వ్యక్తమగు చున్నది. స రి గ మ ప మ ద ని స ని ద మ ప గ రి స ఆరోహణావరోహణములు.

**నాగవరాళి—రూపకం**

ఎట్టున్నదో నీ మనసు యేమి సేతురా
యెట్ట నెదుట బాయలే నేమి సేతురా ॥పల్లవి॥

చూచు దాకా వేగిరింత సొంపుగా విభుడ నీతో
దాచి మాటాడిన దాక దమకింతును
చే చేత దమకింతు చేరువ దాకా నిట్లనె
యేచి తమకమే నిండె నేమి సేతురా ॥ఎట్టు॥

అట్టె నీ చెనకులకు నాసగింతు దనివోక
ముట్టి యాసగింతు నీ మోవి తేనెకు
గట్టిగా నంతటి మీద కౌగిటికి నాసగింతు
యెట్లైనా నాసలే నిండె నేమి సేతురా ॥ఎట్టు॥

ఆదన నీమే నంటి అట్టె పరవశ మవ్వుదు
వదలక కూడి పరవశ మవ్వుదును
పొదలి శ్రీ వేంకటేశ పొందితివి నన్ను నిట్టె
యెదిరించె బరవశా లేమి సేతురా ॥ఎట్టు॥

శ్రృం : 17–185

ప. - స రి గా గ రి రీ ॥ సా రి ని సా ॥
- ఎ - ట్టు న్న - దో ॥ నీ మ న సు ॥

- ప ద ని స ని ద మా ॥ ప గ మా - - ॥
- ఏ - మి - - - సే ॥ - తు రా - - ॥

- ప మ ద ని స స ॥ స రి గ రి సా ని స రి స నీ ॥
- ఎ - ట్ట నె దు ట ॥ చా - - - య లే - - - ను ॥

ద ని స ని దా మ ప గ ॥ మా - గ రి సా ॥
ఏ - - - మి సే - తు ॥ రా - - - - ॥ ॥ఎట్టు॥

చ. - గ గ గా గ ॥ గ రి రీ గ గ రి రీ స ॥
- చూ చు దా క ॥ వే - - గి రిం - - త ॥

- ద ని సా సా రి స ని ద నీ ॥ స రి గా మా ॥
- సొం - పు గా - - - - వి ॥ ఖు డ నీ తో ॥

- ప ప ప పా ॥ ద ని ద మ ప గ మా ॥
- దా చి మా టా ॥ డి - న - దా - కా ॥

- స రి గ రి గ మ ॥ పా - - - - ॥
- త మ కిం - - తు ॥ ను - - - - ॥







ద ని సా స ని ద మ || ప గ మ ని దా ||
చే చే త - - - || త మ కిం - తు ||

- ద ని స స స రి గ మ || గా గ రి రీ స స ||
- చే - రు వ దా - - - || కా ని - - ట్ల నె ||

- ప మ ద ని స స || స రి గ రి సా ని స రి స నీ ||
- యే - చి త మ క || మే - - - - నిం - - - డె ||

ద ని స ని దా మ ప గ || మా - గ రి సా ||
నే - - - మి సే - తు || రా - - - - ||

||ఎట్టు||

**అవతారిక :**

ఈ పదమునందు ముగ్ధ వలె నటించుచున్న జాణయగు ప్రౌఢ నాయిక ఏమియు నెరుగని దాని వలె నన్నియు తెలిసిన ఈమె నాయకుని "నీ విప్పుడు నవ్వుచు నవ్వుచు నవ్వుట మాని జడియుచున్నావు. మాటలు చెప్పుచు చెప్పుచు మానుచున్నావు. నన్ను ముట్టి ముట్టి చూచు చున్నావు ఏల? జవ్వని యెవ్వతెయైన సన్నలు చేసి తన సౌందర్యమును చూపి నిన్ను మైమరువ జేసినదా? ఆనలు బెట్టి అడ్డులు బెట్టి భయపడుచున్నావేల? మన మిద్దరమే కదా యిక్కడ నున్నది'' అని లాలించి యడుగుచున్నది.

**రాగలక్షణము :**

హెజ్జజ్జి ప్రాచీన రాగములలో నొకటి స రి గ మ ప ద స । స ని ద ప మ గ రి స అను షాడవ సంపూర్ణములగు ఆరోహణావరోహణములు గలిగి యున్నను క్రింది పంచమము నుండి పై స్థాయి షడ్జమము వరకు మాత్రమే వాడుట సంప్రదాయమని తెలియుచున్నది. దీనిని గేయ హెజ్జజ్జి అనియు చెప్పుట కద్దు సంపూర్ణ సంపూర్ణముగ నుండినచో ఇది పదమూడవ మేళమగును. రాగముల జన్య జనకముల ఏర్పాట్లు రాక పూర్వము ఎన్నో అందమైన స్వర సందర్భములు గల రాగములుండెడి వనియు, వీనిని జన్య జనకములను పరిధులలోనికి తెచ్చి బిగించి నప్పుడు వాని అందములు స్వరస్వరూపములు మార్పులు చెంది పాడుటకును, వినుటకును అనువు గాని కటువరి తనము వచ్చి ఎన్నియో రాగము లంతరించినవని కొందరు లక్షణకారుల యభిప్రాయము. పరిశీలనతో గమనించినచో వారి యభిప్రాయముతో ఏకీభవించక తప్పదు. హెజ్జజ్జి యందలి నిషాదము శుద్ధ నిషాదము కన్న హెచ్చు పలికి రాగస్వరూపమును వ్యక్తము చేయుచున్నది. దీనిని శుద్ధ నిషాదముగ పట్టినచో అపస్వరమువలె తోచును. శుద్ధ నిషాదమును ఎంత హెచ్చుగా పట్ట వలెను అనునది సంప్రదాయము నెరిగిన గురువుల వల్లనే ఎరుగ వలసి యున్నది. ఇట్లే గుమ్మ కాంభోజి, ఆహిరి, సామంతం, మొదలగు రాగములలో వచ్చు స్వరములు షట్శ్రుతులు, చతుశ్శృలు, శుద్ధములు అని చెప్పుట వలన, వ్రాయుట మాత్రముననే ప్రయోజన ముండదు. అవి సూచన మాత్రముగానే గ్రహించి గురుముఖత అభ్యసించినచో శ్రవ్యవిద్యయగు సంగీతము నందలి మాధుర్యములు తెలియును, సంప్రదాయములు నిలుచును.

**హెజ్జజ్జి — తిశ్రగతి**

మాపు దాకా రేపకాడ మాటకు మాటాడ గాను
యేపున దెగని పనికేల పెట్టే వాన ॥పల్లవి॥

నవ్వి నవ్వి మానేవు నడుమ నడుమ నీవు
జవ్వని యెవ్వతేమైనా సన్న సేసెనా
పువ్వుళ్లూర నీనిజము వొరసి చూచే నింతే
యెవ్వరిందుకు గురయ్యే రేల పెట్టే వాన ॥మాపు॥

చెప్పి చెప్పి కొంకేవు సిగ్గులు వడుతా నీవు
వుప్పటించ నీడ నెవ్వరున్నారు నీకు
రెప్పలెత్తి చూచి నిన్ను రేచి వెదకే నింతే
యెప్పటి వాడవే నీవు యేల పెట్టే వాన ॥మాపు॥

ముట్టి ముట్టి చూచేవు మొరగి నాకుచములు
యిట్టె యెవ్వతెవైనా యీాడు వచ్చెనా
నెట్టన శ్రీ వేంకటేశ నిరతి మెచ్చిణి నింతే
యెట్ట కేల కైన పనికేల పెట్టే వాన ॥మాపు॥

శృం : 27–92

ప సా రి గ గ రి । సా ని ధ ప ధ ॥
మా పు దా - క । రే ప కా - డ ॥

స మ మ మ మ ప । గ మ గ రి స ॥
మా - ట కు మా - । టా - డ గా ను ॥

స ద ద దా - । ప ద సా ని ని ॥
యే - పు న - । వె గ ని ప ని ॥

ద ప ద ప మా । ప మ గా రి ॥
కే - ల - పె । ట్టే - వా న ॥ ॥మాపు॥

చ. పా ద పా మ । ప మ గా రి ॥
న వ్వి న వ్వి । మా - నే వు ॥

స రి మ గ గ రి । స రి గ రి గా - ॥
న డు మ న డు మ । నీ - - - వు - ॥

మ గ మ ప పా । ప ద ని ద ద ప ॥
జ - వ్వ ని యె । వ్వ - తె యై - నా ॥

ప̇ ద స̇ నీ ద । పా - - - - ॥ ప దా సా రి̇ । గా రి̇ రి̇ సా ॥
స - న్న సే సె । నా - - - - ॥ వు వ్వి ళ్ళూ ర । నీ ని జ ము ॥

స̇ రి̇ మ̇ మ మా̇ ప̇ మ̇ । గ̇ గా̇ మ గ̇ రి̇ సా ॥
వొ ర సి చూ చే - - । నిం - - - తే - ॥

స̇ రి̇ గ̇ రి̇ స̇ రి̇ స̇ । ని నీ ద ద ప ॥
యె - వ్వ - రిం దు కు । గు ర య్యే - రే ॥

మ ప ద ద ప ద ప । మా ప మ గా మ గ రి స ॥
- - - ల పె ట్టే - । వా - - - - - - న ॥ ॥మూపు॥

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక స్వాధీన పతిక. ఈమెకు స్వప్నముల యందుకూడ స్వామి సాక్షాత్కరించి సంతోషమును కలిగించు చున్నట్లుండునట. ఆయానందమును నాథుడు నీ కడకు వచ్చినపుడు "నిన్న రేయి నా కలలో నీ దివ్యమంగళ విగ్రహమును చూచితిని. అదియిట్లున్నదని చెప్పుటకు నాకు సిగ్గగు చున్నది. నీవు నాతో ఆడిన ఆ కలలోని పలుకులు గ్రమ్మర చెప్పు కొనుటకు వలనుగా కున్నది. నీతో మంతనము లాడినట్లు నిన్ను మనసు దీర కలసినట్లు అనుభవమైనది గాని అది చెప్పుటకు వచ్చిగా నుండునేమో? ఓ శ్రీ వేంకటేశ్వరుడా, నీమోవి యాని నట్లును, ఎన్నెన్నో చేతలు నీతో చేసినట్లునది. నీవు నా యందు స్థిరమై యున్నావు. అదే చాలునాకు. నేను చెప్పినది నీకు తార్కాణలో కాదో" అని స్వామికి తన యంతఃకరణమును వివరించి తన తాదాత్మిక తను తెలుపు కొనుచున్నది.

హిజ్జిజ్జి — త్రిపుట

అది నీకు దారుకాణ అవునో కాదో కాని
కదిసి చెప్పగ బోతే కతలయ్యీ గాని ॥పల్లవి॥

కలలోన నీ రూపు కన్నుల గన్నట్లయ్యీ
చెలగి ఆ సుద్ది చెప్ప జింతయ్యీ గాని
వెలయ నీ పలుకులు వీనుల విన్నట్లయ్యీ
సెలవి గమ్మర జెప్ప సిగ్గయ్యీ గాని ॥అది॥

మంత నాన నీతో మాటలాడి నట్లయ్యీ
అంతట జూచితే వెరగయ్యీ గాని
కంతు సమరతి నిన్ను గాగిలించి నట్లయ్యీ
వంతాన నేమని నాను వచ్చిదేరీ గాని ॥అది॥

సరుస నీమోవి తేనె చవిగొన్న అట్లనయ్యీ
వొరసి చూపబోతే గోరొత్తీగాని
ఇరవయిన శ్రీ వేంకటేశ నీవు దిష్టముగా
సరుగ గూడిన నదె చాలా యగాని ॥అది॥

శృ : 27—442

ప. ప ప ద | పా ప మ || గ మ పా - మ | మ గ రీ సా ||
అ ది - | నీ కు - || తా - రు - - | కా - - ణ ||

స ని ని ధ | ఫా - ధ సా || స రి గా గ రి | గా మా ||
అ - వు - | నో - - - || కా - దో - - | గా ని ||

ప దా | సా సా రి స నీ || ద పా | ద ప ప మ పా ||
క ది | సి చె - - - || న్ప గ | బో - - - తే ||

మ మా | మ గ రీ స రి || గ మ గా గ రి | గ మ పా ||
క త | ల - - య్యా - || గా - - - - | ని - - ||

||అది||

చ. ప ద ని ద | దా పా || మా ప మ గా | మా పా ||
క ల ల - | లో న || నీ - - - | రూ పు ||

గ మ ప ద ప మ | గ మ ప మ గ మ గ రి || గ మ ప ద స ని | ని ద దా పా ||
క - న్ను - - - | ల - - - గ - - - || న్న - - - - - | ట్ల - - య్యా ||

పా ప మ గా | ప మ గా రి స || ఫ ధ ని ధ | ఫ ధ సా ||
చె ల - గి | ఆ - - సుద్ది || చె - - వ్ప | జిం - త ||

స రి గ మ ప ద | ప మ గ మ పా ||
య్యా - - - - - | గా - - - ని ||

ప ద ని ద | పా ప ద సా || స ని ద ద | పా - మ పా ||
వె - ల య | నీ - - - || ప - - లు | కు - - లు ||

ప ద సఀ సఀ | సఀ రిఀ గఀ గఀ రిఀ || సఀ రిఀ గఀ మఀ పఀ మఀ | గఀ రిఀ రీఀ సాఀ ||
వీ - - ను | ల - - వి - || న్న - - - - - | ట్లు - - య్యా ||

సఀ రిఀ గఀ రిఀ | రీఀ సాఀ || సాఀ - ని ని ద | ద ప పా ||
సె - ల - | వి గ్ర || మ్మ - - ర - | జె - ప్ప ||

గ మ ప ద సీ | ద ప ప మ || ప మ గ రి సా | స రి గ మ పా ||
సి - గ్గ - - | య్యా - - - || గా - - - - | ని - - - - ||     ||అది||

**అవతారిక :**

ఇందలి నాయిక దివ్య. ఈమె పతియెడ బాటును సహించనిది. నాధుని చేతలకు అలుగని స్వభావము కలది. 'నీవు నా కడకు రానప్పుడు నేనేమో అనుకొంటిని. నాపై ప్రేమచే నీవు వచ్చితివి కదా. ఇక నేల ఆలస్యములు, ఇందవయ్యా విడెము. నీవు, నీ గుణములు గుట్టుతో నున్నపుడు నాకు వెరపు లాయెను. నీవు యూరకే ఉన్నందుకు నేను కోపముతో బిగిసితిని. పరికించి చూచితే నీవు నేను ఒకటే' అని స్వామి యందలి తాదాత్మ్య తను చెప్పుకొనుచు విడె మందించుచున్నది.

ఇందు అయ్యవారు మధుర భక్తికి మూలమగు జీవాత్మ పరమాత్మ తత్త్వమును నాయికా నాయకుల యందు ఆరోపించి ద్రష్టలు గనుక చూచి తరించి మనకు గేయ రూపమున చెప్పు చున్నారేమో అనిపించు చున్నది.

**రాగలక్షము :**

మాయా మాళవ గౌళ యిప్పటి వాడుక ప్రకారము 15వ మేళ కర్త. సంపూర్ణ సంపూర్ణము. ఇది సుమారు మూడు నాలుగు వందల ఏండ్ల నుండి వాడుకలో నున్నట్లు తెలియు చున్నది. ఇప్పటి సంగీతాభ్యాసమునకు ప్రథమ సూత్రములుగా నిలిచిన సరళి, జంట, అలంకారములు అనునవి శ్రీ పురందర దాసులవారు ఏర్పరచిన వని విజ్ఞుల అభిప్రాయము. ఇందుగల రచనలు కొలది మాత్రమే మనకు యీనాడు లభ్యమయిన చక్కటి స్వర సందర్భములతో ప్రత్యేక వ్యక్తిత్వము గల యీ రాగము ప్రాచీనము.

**మాయా మాళవగౌళ — రూపకం**

అప్పటి కప్పుడే కాక అంత యేటికి
యెప్పుడూ మనకు బోదు ఇందవయ్యా విడెము ॥పల్లవి॥

తక్కి మాటున నున్నంత తడవు నిను దూరితి
నిక్కి చూడ బోతేను నీవే నేను
కక్కసించ నిక నిన్ను కడు నానవెట్ట కిక
యిక్కువలు గరగేను ఇందవయ్యా విడెము ॥అప్పటి॥

గుట్టుతో నూర కుండగా గుణము వెరపు లాయ
నెట్టు కొని మాటాడితే నీవే నేను
పెట్టను రట్ల నిన్ను పెనగకు మిక నీవు
ఇట్టే నీ మాటలు పింటి నిందవయ్యా విడెము ॥అప్పటి॥

అరయ దూరకున్నందు కటునిట్టు బిగిసితి
నేరిచి పొందు సేసితే నీవే నేను
కోరి శ్రీ వేంకటేశుడ కూడితి మిద్దరమును
యీ రీతి శాయ కుందము ఇందవయ్యా విడెము ॥అప్పటి॥

శ్రృం : 27–4

ప. మ గ మ ద ప ద ॥ మ ప మ గ రీ సా ॥
1. అ - ప్ప టి క - ॥ ప్పు డె గా - - క ॥

రి స ని స స రి గ రి ॥ గా మా - - ॥
అం - - త యే - - టి ॥ కి - - - ॥

2. మ గ మ ద ప ద ॥ మ ప మ గ రీ సా ॥
అ - ప్ప టి కి - ॥ ప్పు డె గా - - క ॥

రి స ని స స రి గ రి ॥ గ మ ప ద ని స ని ద ప మ గ మ ॥
అం - - త యే - - టి ॥ కి - - - - - - - - - - - ॥

3. మ గ మ ద ప ద ॥ మ ప మ గ రీ స రి గా ॥
అ - ప్ప టి కి - ॥ ప్పు డె గా - - క - - ॥

గ మ ద ప ద ని స ని ॥ ని స రి స ని ద ప మ గ రి గా ॥
అం - - త యే - - టి ॥ కి - - - - - - - - - - ॥

మ ద ప ద మ పా ॥ ద ప ద నీ స ॥
యె - - ప్పు డూ - ॥ మ న కు బో దు ॥

1. స రి ని ద ప ద మా గ రి ॥ స రి గా గ మ ప ద ॥
ఇం - ద - వ - - య్యా - ॥ వి డె ము - - - - ॥

2. ని స ఠి గ ఠి స ని స ని ద ప మ ॥ గ రి స రి గా గ మ ప ద ॥
ఇం - - - ద - వ - - - య్యా - ॥ వి - డె - ము - - - - - ॥

3. మ గ మ స ని దా ప మ ॥ గ రి సా - - ॥
ఇం - ద వ - - య్యా - ॥ వి డె ము - - ॥ ॥అప్పటి॥

చ. - ప ద పా - ద పా ॥ ప మ గ మ ప మ గ స రి స ॥
- త క్కి మా - టు న ॥ ను - - - న్నం - - - - త ॥

స ని స రి స ని దా ని ని ॥ సా - రి గ రి గా ॥
త - డ - వు - - ని ను ॥ దూ - - - రి తి ॥

- గ మ ప ద ని స ని ద ॥ పా ద మ పా ప గ మా ॥
- ని క్కి చూ - - - డ - ॥ బో - - తే - - ను ॥

మ గ మా స ని దా ప మ ॥ ప మ గ రి సా - - ॥
నీ - - వే - - - - ॥ సే - - - ను - - ॥

- మ గ మా ద ప ద ॥ ని ని దా సా సా ॥ స ఠి గ మ ప మ గ ఠి స ఠి ॥
- క - క్క సిం - చ ॥ ని - క ని న్ను ॥ క - డు - నా - - - - న ॥

గ గ రీ గ గ రీ సా ॥ మ ద ప ద మ పా ॥
వె - - ట్ట - కి క ॥ యి - - క్కు వ లు ॥

ద ప ద నీ స ॥ మ గ మ స ని దా ప మ ॥
క ర - గే ను ॥ ఇం - ద వ - - య్యా - ॥

గ రి సా - - ॥
వి డె ము - - ॥ ॥అప్పటి॥

**అవతారిక :**

ఇందు నాయిక మానవతి. విరహోత్కంఠిత, దక్షిణ నాయకుడగు తన నాథుడు తన వద్దకి రావలసిన నాడు రాలేదని వగచుచు చెలితో "కలువ పువ్వులకు చంద్రుని రాక దిన, దినము ఎవ్వరైనా నెరిగింతురటే ? ఆమని రాక ప్రతివత్సరము కోయిలకు ఎవరు చెప్పుదురే ? అట్లే వంతెరిగి నాపై మనసు కలిగి నాథుడు రావలెగాని వినికి సేయుటయేలనే ?" అని చెప్పుకొనుచు వగచు చున్నది. ఇందు అయ్యావారు చూపిన ఉపమానములు కవి సమయములే ఐనను హృద్యంగముగా పొందిక కలిగి యున్నవి. 'నిలువుకు నీడ ఎవరు చెప్పుదురు' అన్న వాక్యమును ఈ గేయము నందు పొందు పరచిన కవి ద్రష్టగాక మరెవ్వరు !

**రాగలక్షణము :**

మంగళ కైశిక రాగము భాషాంగము. రెండు మధ్యమములును సందర్భాను సారముగ నిందు వచ్చును. వెంకటమఖి సంప్రదాయమున చ్యుత పంచమ మధ్యమము ఈ రాగమున చెప్పినను, ఏలనో దీనిని భాషా గమన లేదు. మాయా మాళవగౌళ జన్యముగా ఇప్పుడు దీనిని పరిగణింప వలసి యున్నది. అతి ప్రాచీనమగు ఈ మంగళ కైశిక 72 మేళ కర్తల పద్ధతి రాక మునుపే ఎంతో ప్రచారమున నున్నది.

స రి గ మ ప మ ద ని సా - స ని ద ప మ గ రి సా అను ఆరోహణావరోహణ ములు కలిగి యున్నను, 'గ మ మ² మా మ² గ రి సా' 'స ని గ మా' - 'మ గ ద ప స ని రి స' అనునవి విశేష ప్రయోగములుగా గుర్తించు కొన వలయును. మేళ కర్తల పద్ధతికి పూర్వముండిన రాగములు చాల వరకు ఆరోహణావరోహణముపై ననే గాక కొన్ని ముఖ్యమైన స్వర సందర్భములు గల రాగపు ఛాయల తోనే ఎక్కువగా గుర్తించబడు చుండెడివేమో నని అను కొన వలసి యున్నది. ఇందుకు మంగళ కైశిక, ఆహిరి, ఘంట, సైంధవి, నవరోజు, మారువ, ద్విరఘావంతి, గౌరిపంతు, మొదలగు రాగముల స్వరూపములే మనకు ఉదాహరణములు.

మంగళ కైశిక — ఆది

మనసుకు మనసే మర్మము గాక

విన్నికి వలె దనకు విన్న వించ గలనా ॥పల్లవి॥

తలుపులో తమకము తానె యెరగడట
యెలమిదన్ను గొసరె నేలె నాకూ
కలిమి జంద్రుని రాక కలువ పువ్వులకును
తెలిపిరా యెవ్వరైన దిన దినమునకు ॥మనసుకు॥

తప్పక వరు సెరిగి తానె విచ్చేయడట
యిప్పుడు విలువ నంప నేలె నాకూ
వుప్పతిల్లు గోవిలకు నొగి వసంత కాలము
చెప్పుదురా యెవ్వరైన జెలగి యేటేటను ॥మనసుకు॥

దగ్గరి వచ్చిన వాడు తానె యెరుగు గక
యెగ్గు సిగ్గులిటు దీర్చ నేలె నాకు
అగ్గమై (శ్రీ) వేంకటేశు డాదరించి నిన్ను గూడె
నిగ్గు నిలువుకు నీడ నేర్పిరా యితరులు ॥మనసుకు॥

శృం : 15–27

ప. స రి గ మ ద ప దా । స ని ద మ । ప గ మా ।
మ న సు కు మ న సే । మ - ర్మ ము । గా - క ।

రి గ మ మ మ గ రి గ । మ మ మ గ । రి రి సా ॥
వి ని కి వ లె త న కు । వి న్న విం చ । గ ల నా ॥

2. స రి గ మ ద మ గ మ ద ని సా । స ని స రి స రి ని స । ద ని ప ద మ ప గ మ ॥
మ న సు కు మ - న - సే - - । మ - - - ర్మ - ము - । గా - - - క - - - ॥

రి గ మ మ మ గ రి గ । మా స ని ద మ । గ రి సా ॥
వి ని కి వ లె త న కు । వి న్న - విం చ । గ ల నా ॥ ॥మనసుకు॥

చ. ప ద ప ద మ ప గ మ । గ మా మ । మ గ రి స ॥
త ల పు లో త మ క ము । తా నె యె । రు గ డ ట ॥

స ని ధ ధ రి స రి గ రి । గ మ మ మ । మ గ రి సా ॥
ఎ - ల మి త - న్న గొ స । రె నే - డె । నా - - కూ ॥

గ మ ద ప దా ద ప । ద ని స రి । రి స నీ సా ॥
క లి మి — — జం — । ద్రు ని రా — । — — — క ॥

స రి గ మ మ మ గ మ మ మ గ మ గ రి । స ని స రి । రి స నీ సా ॥
క — లు — — — వ — — — — — పు — । వ్వు — ల — । కు — — ను ॥

స ని స రి స ని ద మ । ప మ గ మ ద ప ద ని । సా — — ॥
తె లి పి రా — — యె వ్వ । రై — — — — — — — — । నా — — ॥

స రి నీ ని స దా ద ని పా ప ద మా । మ ప గా గ మ రీ । ప మ గ రి సా ॥
ది — న ది — న ము — — — — — । న — — — — — — । కు — — — — ॥

॥మనసుకు॥

అవతారిక :

ఇందలి నాయిక దివ్య. ఈమెకు తన నాథుడేమి చేసినను సరియే నట. అతనిని దూరుట తాను సహించలే దట. కనుకనే పాలముంచినను, నీట ముంచినను, నగనీ, తెగడనీ, యేగించనీ, రేగించనీ, తన కేమియు అభ్యంతరము లేదని చెలులకు చెప్పి, వారు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునిపై కోపించి అనరాని మాట లనకూడదని హెచ్చరించుచున్నట్లుగా అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

మంగళ కైశిక—తిశ్రపేత

సారె దూర జాలనూ చలముల కోపనూ
చేరితి మా చనవోలి చెన్నుని భ్రమలను ॥పల్లవి॥

యీడకు బిలుపించెను యేమిసేయు మనీనే
వోడక తన యెదుట నున్న దానను
పాడితో నీట ముంచనీ పాలముంచనీ తాను
వాడు దన వలపుల వలకు లోనైతిని ॥సారె॥

మాట నన్ను నాడించెను మనసెట్టు దెలిసీనే
యేటికైనా నియ్యకొంటి నదివో నేను
నాటి మాట చెల్లించీనా నగనీ తెగడనీ
మేటి పాయము తనకే మీదుగా నెత్తితిని ॥సారె॥

కాగిట నన్ను నించెను కళ దాకె నిక నేలే
దాగక తనకు నిట్టె దక్కితి నేను
వీగక శ్రీ వేంకటాద్రి విభుడు దా నన్నుగూడె
యేగించనీ రేగించనీ యురవైతి నేను ॥సారె॥

శ్లో : 26-149

ప. మా మ మా గ | రి గ రి సా - || స రి స మ గ మ | దా మ గ మ మ ||
సా రె దూ ర | జా - ల ను - || చ ల ము ల - - | కో వ ను - - ||

ద ని స స స ని | ద ని ద ద మా || మ గ మ మ మ మ | గ గ రి సా - ||
చే - రి తి మా - | చ న వో - లి || చె - న్నని - - | భ్ర మ ల ను - ||
||సారె

చ. మ గ మ ద ప ద | మ ప గ మా - || రి గ మ మ గ రి | మ గ రి సా - ||
యీా - డ పి లి పిం | - చె - ను - || ఏ - మి సే - యు | మ నీ - నే - ||

స ని ధ ధ స ని | రి స రీ - - || మ గ మ ద ప ద | పా - - - - ||
వో - డ క త న | యె దు ట - - || ను - న్న దా - న | ను - - - - ||

మ గ ద ప ద ద | స ని ద నీ - || సా రి సా ని | ద ని సా సా ||
పా - డి తో నీ ట | ముం - చ నీ - || పా ల ముం చ | నీ - తా ను ||

స మ గ రి సా | స ని ద స ని సా ||
వా - డు ద న | వ - ల పు ల - ||

స ని ద ని స రి స ని దా | మ గ మ మా గ రి గ రి సా ||
వ - ల - - - కు - - | లో - - నై తి - - - ని || ||సారె||

**అవతారిక :**

"నీవు గొల్ల భామలకు పలుకొంటివి. రుక్మిణీదేవిని రాచ మర్యాద ననుసరించి అపహరించుకు వచ్చి వివాహ మాడితివి. వావి వరుసలను యే భామలను పలుకొనుచుంటివా? పదియారు వేల కన్యలను వరించునప్పుడేమి చూచితివి? వెలినవ్వులు నవ్వుచు మా వంక నదేపనిగా చూచెదవేల. నీవే పులివెందల? రంగనాధుడవని మాకు తెలుసు ఓ వేంకటేశ్వరుడా వంకల నొత్తక ఎదుటనున్న మమ్ము పలుకొనవయ్యా!" అని తమకాంతుని వేడుకొనుచున్నారు కొందరు కాంతలు.

**రాగ లక్షణము :**

మలహరి ప్రాచీన రక్తిరాగములలో నొకటి. దీనినే 'కొండ మలహరి' అనుటయు కద్దేమో! ఇది యిప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళ జన్యము.

ఆరోహణ : స రి మ ప ద స

అవరోహణము : స ద ప మ గ రి స

ఈ రాగమునందు దీక్షితులవారి కృతులు ఒకటి రెండును, పురందరదాసులవారి ప్రారంభగీతములు కొన్నియు, తప్ప ఇతర వాగ్గేయకారుల రచనలు కానవచ్చుట లేదు. చక్కటి రక్తిరాగమగు దీనిని ప్రారంభదశ యందు, విద్యార్థులకు విసుగు వచ్చునంతవరకు పాడించుటయే కారణమై యుండునని తోచుచున్నది. తాళ్ళపాకవారి రచనలు మాత్రము ఇందు ఎక్కువగనే కనబడుచుండుట వలన, వారి కాలములో ఇది మంచి ప్రచారము నందుండిన రాగములలో ఒకటి అని అనుకొనవలసి యున్నది.

**మలహరి—రూపకం**

ఇంక నేల వెరపు యెదుటనే వున్నారము
వంక లొత్తికిక మటి వద్దు వద్దు ఇపుడు ॥పల్లవి॥

వావులు నీ కెంచనేల వాడల గొల్లెతలకు
దేవరవు గావా తెలిసినదే
యీవలమావంక నిట్టె యేమి చూచేవు తప్పక
మోవనాడితి మిదివో మొదలనే నేము ॥ఇంక॥

చందాలు చెప్పగనేల సతి నెత్తుక వచ్చితి
విందుకు రాజవు గావా యెరిగినదే
దిందుపడి మమ్మునేల తిట్టేవు పెదవులను
నిందవేసితి మిదివో నిన్ను నే నేము ॥ఇంక॥

వెలి నవ్వేల పదారువేల పెండ్లాడితివి
బలిమికాడవు గావా భావించినదే
చెలగి పులివిందల శ్రీ రంగదేవుడవని
కలసితిమిదె శ్రీ వేంకటరాయ నేము ॥ఇంక॥

శృ: 20_15

ప. - స రి | మా పా ద ప ప మ గ రి || స ఫ ధ | సా - - ||
- ఇం - | క నే - - - - ల - || వె - ర | పు - - ||

- స రి | మ ప ద ప ద స || ద ప మా | ప మ గా రి స ||
- యె దు | ట నే - - - - || వు - - | న్నా - - ర ము ||

- స రి | మా ప ద ప ద || స ప | ధ మ మా ||
- వం - | క లో - - - || త్తు కి | క మ ఙి ||

ప ద సా | ప ద ప మ || పా ద ప మా ప మ | గ గ రి సా ||
వ - - | ద్దు వ - ద్దు || ఇ - - - - - | పు - - డు || ||ఇంక||

చ. - స రి | గ రి సా || ధ ఫ | ద సా స ||
- వా - | వు లు నీ || కెం - | చ నే ల ||

- స రి | మా మా || ప ద ప మ | గ రి స రి గ రి ||
- వా - | డ ల || గో - - - | ల్లె - త - ల కు ||

- మ | మ ప ద ప మ ప || ప ద సా | ప ద ప దా ||
- దే | వ ర - - - వు || గా - - | వా - - - ||

మ ప | ద ప మా || ప మ గ రి | సా - - ||
తె లి | సి న దే || - - - - | - - - ||

- మ | ప ద సా || స రి గ | స రి స రి ||
- యీా | వ ల మా || వం - - | క ని - ట్టె ||

- స | రి మ గా || రి స రి | గ రి సా ||
- యే | మి చూ సే || వు త - | - ప్వ క ||

స రి గ | రి సా - || ద ప | మ ప దా ||
మో - - | వ నా - || డి తి | మి ది వో ||

రి మ ప ద | ప ద సా ప || ద ద ప మ | ప ప మ గ రి గ రి స ||
మొ - ద - | ల - నే - || నే - - - | - - - - ము - - - || ||౩౦౪||

**అవతారిక :**

ఇందు నాయిక తన నాథునితో యనెడి మాటలు, తనుచేసిన చేతలు చెప్పుకొనుచు అవి చూచి ఆ మాటలు విని సవతులు ఈర్ష్యపడుచున్నారని అనుచున్నది.

మలహరి —ఆది

పొత్తుల మగడవు పొరుగున నుండగ
తత్తరమింతేసి తమకేలయ్యా ॥పల్లవి॥

యేపున నీ మోము యిటు నే జూచిన
చూపు లాపెమై చురుకనెను
ఆపొద్దు నీతో నాడిన మాటల
తీపులు దనకటు తిన జేదాయ ॥పొత్తుల॥

నడుమ నే నీతో నవ్విన వెన్నెల
కడనాపెకు జీకటులాయ
చిడుముడి నే నిను -జెనకిన సరసము
వెడ వెడ దన కవి విరసములాయ ॥పొత్తుల॥

వెస నా మోవులవిందు నీ కిడిన
పసిగొని నాపెకు బగలాయ
యెసగిన (శ్రీ) వేంకటేశ మమ్మిద్దరి
గొసరికూడితివి గురి దనకాయ ॥పొత్తుల॥

శ్రం : 22-391

ప. - ప ప ద ద ప ప మ మ గ గ రి | - స రి ప మ | గా రి స ||
- పొ త్తు ల మ - గ - డ - వు - | - పొ రు గు న | నుం డ గ ||

- ధ స రి మా - గా - రీ | మ మ ప ద | ద ప ప మ పా ||
- త త్త ర మిం - తే - సి | త మ కే - | - - ల - య్యా || ||పొత్తుల||

చ. - మ ప ద సా - సా - సా | మ మ ప ద | సా స స ||
- యే పు న నీ - మో - ము | ఇ టు నే - | చూ చి న ||

- ప ద స ప ద ప మా | ప ద ప మ గ రి స రి | మ ప ద మ పా ||
- చూ - పు లా - పె మై | చు - ర్రు - క - నె - | ను - - - - ||

- స రి మ మ ప మ మ గ గ రి రీ | స రి మ మ ప మ | మ గ గ రి రీ ||
- ఆ - పొ ద్దు నీ - - - తో - - | నా - డి న మా - | - - ట - లు ||

- స రీ గ రీ స ద ప ద | మ ప ద ద ప మ | గ రి స రి మా ||
- తీ - పు లు త న క టు | తి న జే - - - | దా - - - య || ||పొత్తుల||

**అవతారిక :**

"పంచేంద్రియముల వ్యాపారములలో మనసునకు భ్రమకలిగింపజేసెడి యునికి లేనులతో నున్నది యీ ప్రపంచము. కనులు మూసినచో సర్వము శూన్యము. కనులు తెరువ గనే కనబడుచున్న యీ ప్రపంచము కలదనుకొనుటయా, లేదనుకొనుటయా? మనసు నందు తలచినంతనే విషయములు సన్నిహితములగును. పుట్టినప్పుడును పోవునప్పుడును ప్రాణికి స్పృహ యుండనే యుండదు. శ్రీ వేంకటేశ్వరుని ఆత్మయందు నిలుపుకొని ఇతరములన్నియు మరచినచో యీ మాయా బంధములు తొలగును," అని అయ్యవారు చెప్పుచున్నారు. అనాది నుండియు పుట్టుచు, గిట్టుచు సంచరించుచున్న ప్రాణికి ఇదియే కర్తవ్యమని వారి భావము.

**రాగ లక్షణము :**

పాడి ప్రాచీన రాగము. స రి మ ప ద ని స | స ని ప ద ప మ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 15వ మేళమగు మాయా మాళవ గౌళ జన్యము. ఇది ఆధునికుల రచనలు కానవచ్చుట లేదు. తాళ్లపాక వారి రచనలనేకములు గలవు. ఒకప్పుడిది బహుళ ప్రచారమున గల రక్తిరాగములలో నొకటి యేమో!

**పాడి — ఝంపె**

తొల్లి కలవే యివియు తొల్లి తాను గలడే
కల్లయునుగాదు కడు నిజము గాదు ॥పల్లవి॥

కనుదెరచి నంతనే కలుగు నీ జగము
కనుమూసి నంతనే కడు శూన్యమౌను
కనురెప్ప మరుగుననె కలిమియును లేమియును
తన మనో భావనల తగిలి తోచీనీ ॥తొల్లి॥

తలచినంతనె యెంత దవ్వైన గాన్పించు
తలపు మరచిన మదికి దట్టమౌదమము
పొలసి మతి మరుగునసె పుట్టుటలు బోవుటలు
పలుచంచల వికార భావ మీగుణము ॥తొల్లి॥

ముందు తా కలిగితే మూడు లోకములు గల
వెందు దా లేకుంటె నేమియును లేదు
అంది శ్రీ వేంకటేశు నాత్మలో ననె వీడె
కందువల నీతని సంకల్ప మీ పనులు ॥తొల్లి॥

అ : 10-73

ప. సా ని స స | రి స స స స || సా ని సా | రీ మ మ మ ||
తొ ల్లి క ల | వే - యి వి యు || తొ ల్లి తా | ను క ల డె ||

పా ద ద ప | పా మ మ మ || మ ప మ రీ | సా - - - ||
క ల్ల యు ను | కా దు క దు || ని జ ము గా | దు - - - || ||తొల్లి||

చ. మ మ మ మ మ | మ ప ద ద ప ||
త ల చి నం - | త నె యెం - త ||

ప మ మ ప మ | రి రి సా స ||
ద - వై వ - న | గా - న్పిం చు ||

స రి రి మ మ | మ ప ప ప మ ||
త ల పు మ ర | చి న మ ది కి ||

మ ప ప ద ద | ద ప పా - ||
ద - ట్ట మౌ - | త మ ము - ||

మ మ ప ప ప | ద ద ప ప మ ||
పొ ల సి మ తి | మ రు గు న నె ||

ప ప ని స స | రి రి స స స ||
పు - ట్టు ట లు | బో - వు ట లు ||

ప ని స స ని | ప ప ద ప మ ||
ప లు చం - చ | ల వి కా - ర ||

ప ప మ మ రి | రి స సా - ||
భా - వ మీ - | గు ణ ము - || ||తొల్లి||

**అవతారిక :**

పంచేంద్రియములనుద్దేశించి "నాలుకయందు శ్రీహరి నామమున్నది, గనుక, రుచులకు, దుర్భాషలకు తావులేదనియు, చక్రాంకితములు గల భుజములు శ్రీపతిని నిలుపుకొన్న మనసునకు దుష్టచింతలకు తావేది ? అట్లే విష్ణుకధలను వినెడి వీనులును, శ్రీహరి నామమును అలముకొన్న శరీరమును కలదు. కోపతాపాది గుణములారా ! దూరముగ పొండు" అని వేంకటనాధుని తలపు నందలి పారవశ్యమును గురించి అయ్యవారు చెప్పుచున్నారు.

**పాడి — ఆది**

ఇందు నుండి మీ కెడలేదు
సందడి సేయక చనరో మీరు ॥పల్లవి॥

నాలుక శ్రీహరి నామం బున్నది
తూలుచు బారరో దురితములు
చాలి భుజంబున చక్రంబున్న
తారిమి భవబంధములటు దలరో ॥ఇందు॥

అంతర్యామై హరి వున్నాడిదె
చింతలు వాయరో చిత్తమున
వింతలు జెవులను విష్ణుకధలివిగో
పొంత గర్మములు పోరో మీరు ॥ఇందు॥

కాపయి శ్రీ వేంకటపతి పేరిదె
నాపై నున్నది నయమునను
కోప(పు) కామాది గుణములాల మీ
రేపున కడ గడ నెందైన బోరో ॥ఇందు॥

అ. 11(2)–161

ప. ప ప ద ద ప ప ప మ | మ మ ప ద | పా - - ||
ఇం - దు నుం - డ మీ - | కె డ లే - | దు - - ||

మా ప ద పా ప మ | రి రి సా | రి మ పా ||
కం ద డి సే య క | చ న రో | మీ - రు ||

||ఇందు||

చ. స రి మ మ రి రి స స | ప మ రి స | రి మ ప ప ||
నా - లు క శ్రీ - హ రి | నా - మం - | బు - న్న ది ||

ప ద ప ని స ని స స | రి మ ప ని | సా - - ||
తూ - లు చు బా - ర రె | దు రి త ము | లు - - ||

స రి మ మ రి రి స స | స రి మ మ | రి రి స స ||
చా - లి భు జం - బు న | చ - క్ర - | బు - న్న ది ||

స ని ప ద ప మ రి స | స రి మ మ | ప ప ప మ ||
తా - లి మి భ వ బం - | ధ ము ల టు | తొ ల గ రో ||

||ఇందు||

**అవతారిక :**

"పాప పుణ్యముల హద్దులు నాకు తెలియవు. త్రిసంధ్యల యందును అనుభవించెడి భోగముల యందును, పుట్టక మునుపును, పుట్టిన తరువాతను, జాగ్రథ సుషుప్తి స్వప్నావస్థల యందును, మనోవాక్కాయ కర్మల యందును నిన్నే శరణుబొచ్చి యున్నాను. జగత్తునందు నిండియున్న ఓ వేంకటేశ్వరా ! నీకు నమస్సులు," అని అయ్యవారు చెప్పుచున్నారు.

**పాడి — ఆది**

పాప పుణ్యముల పక్వ మిదెరుగను
నా పాలిటి హరి నమో నమో ॥పల్లవి॥

మానస వాచక కర్మంబుల
తానకముగ నీ దాసుడను
పూని త్రిసంధ్యల భోగ భాగ్యముల
నానా గతులను నమో నమో ॥పాప॥

వలనుగ జాగ్ర స్వత్స్వప్న సుషుప్తుల
ఇలలో నీకే(ని) హితభటుడ
వెలుపల లోపల వేళావేళల
నలి నాథ నీకె నమో నమో ॥పాప॥

పుట్టుక తొలుతను పుట్టిన మీదట
అట్టె నీ శరణాగతుడ
గట్టిగ శ్రీ వేంకటపతి నీకృప
నట్ట నడుమైతి నమో నమో ॥పాప॥

అ : 10–100

ప. పా ద ప ప ప ప మ । ప ద ప మ । రి రి స స ॥
పా ప పు - ణ్య ము లు । ప - క్వ మి । దె రు గ ను ॥

1. రి మ మా ప మ రి రి స స | స నీ ని | స రి స రి ||
నా - పా - - లి టి హా రి | న మో న | మో - - - ||

2. రి మ మా ప మ మ రి రి స | ని సా స | సా - - ||
నా - పా - - లి టి హా రి | న మో న | మో - - || ||పాప||

చ. మ ప పా ని ని స స | స ని స రి | రి స స స ||
మ న సా వా - చ క | మ త క - | ర్మం - బు లు ||

స ని స రి స ని ప మ | ప ద ప ని | సా - - ||
తా - న క ము గ నీ - | దా - సు డ | ను - - ||

రి రి మ మ రి రి స స | ప ద ప ని | ని స స ని ||
పూ - ని త్రి సం - ధ్య ల | భో - గ భా | - గ్య ము ల ||

స రి స ని ద ద ప మ | ప మా రి | సా - - ||
నా - నా - గ తు ల ను | న మో న | మో - - || ||పాప||

**అవతారిక :**

శృంగార మనోహర మగు ఈ పదము నందలి గాయిక తన చెలికత్తెతో నాయ చేష్టలను "తాను రమ్మని పిలువనంపలే దట. కాని వచ్చిన తలుపు తెరచినదట. మాట లేదటగాని చిరునవ్వులు చిందించినదట. సిగ్గుపడి దూరముగనే యున్నదట. ముందు యాతనిని కౌగిలించుకొనలే దట. కాని విడెమందించిన దట. ఈమె తనను నేరుపరిగాను జాణగాను భావించుకొన దట. తన హావ భావములు తెలుసుకొని ఆనందించలేదా?" అలమేలుమంగ యగు ఈమె (శ్రీ) వేంకటేశ్వరుని చేతలను చెప్పుకొనుచున్నది.

**పాడి — త్రిశ్రఏక**

నేరుపరి ననుకోను నెరజాణ ననుకోను
యీ రీతి నా హావ భావా లింతెల గడా ||పల్లవి||

మలసి తనతో నేను మాటలాడనని దూరి
నెలవుల నవ్వితేనే సేన మాటలే
పిలిపించనని తాను బిగువులు నెర పీని
తలుపు దెరచి తేనే తగుసన్న గాదా ||నేరు||

దగ్గర గూచుండనంటా తమకించి నంతలోనె
సిగ్గువడి వుండితేనే చేరి వుండులే
వొగ్గి తన్ను జూడనంటా వొరట్లు వట్టిని
అగ్గమై యెదుట నుంటే అన్నియును గాదా ||నేరు||

ముందు కౌగిలించనంటా మొనలెల్ల జూపిని
ఇందమని విడె మిచ్చుటిదియే అది
అందపు (శ్రీ) వేంకటేశు డలమేలుమంగ నేను
పొందితి మిద్దర మివి పోదులెల్లా గావా ||నేరు||

రేకు : 27—9

ప. పా ద ప మా । ప మ రీ సా ॥ స ని ధ ధ ధా । స ని సా రి ॥
నే రు ప ౯ । న ను కో ను ॥ నె ర జా - ణ । న ను కో ను ॥

స రి మా పా । ద ప నీ సా ॥ స ని ప ద ప మ । రి స రి మా - ॥
యీా - రీ తి । నా - హా వ ॥ భా - వా - లిం । తె ర గ డా - ॥ ॥నేరు॥

చ. రి మ పా ద ప మ మ । పా ద ప మ రి సా ॥ స రి సా - ని సా । ధ ధ ధ ని సా ॥
మ ల సి - - త న । తో - - నే - ను ॥ మా ట లా - - డ । న ని దూ - రి ॥

స రి మ మ మా । పా ద ప మా మా ॥ ప ద ప ని స ని । ప ద పా - - ॥
సె ల వు ల న । వ్వి - - తే నే ॥ సే న మా - - ట । లే - - - - ॥

రి మ పా పా ద ప ప మ । ప ని సా సా రి స స ని సా ॥
పి లి పిం చ - - - - । న ని తా ను - - - - - ॥

స రి మా స రి సా । స ని ప ద ప మ ప ని సా - - ॥
బి - గు వు - లు । నె - ర - పి - - - ని - - ॥

స రి మ మ స రి రి । స రి స ని ప ద ప మ ॥
త - లు పు దె ర చి । తే - - నే త - గు - ॥

రి మ రి మ ప మ ప ద ప ని సా । స ని ప ద ప మ రి స ని స రి మ ॥
స - - - న్న - కా - - - - । దా - - - - - - - - - - - - ॥ ॥నేరు॥

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ముగ్ధ. ఈమెకు నేర్పులు చెప్పుచు "తమకించినప్పుడె కూడుటకు సమయమాయెను. సుముఖుడుగా నున్నప్పుడే మాటలాడుటకు వేళాయెను. చెమరింపులు కలిగినపుడే నీకు ప్రియమైన చేతలకు లోనౌటలు, నిన్ను కలయజూచినప్పుడే నీ వాతనిని లోబరచుకొనవలెను. నీ వెంట నాతడు వచ్చినప్పుడే నీ మోవికి విందులు, అతడు నిన్నంటినప్పుడే నీ కోరిక లీడేరు. నీవు సమ్మతించినప్పుడే కౌగిలి సుఖములు నీకు. ఓయమ్మా యింకా యెందులకే ఈ గోలతనము?" అని తమ యేలికసాని యగు అలమేలుమంగను ఆయత్త పరచుచున్నారు చెలులు.

**పాడి — త్రిశ్రఏక**

వేళ గాదు సిగ్గులకు విచ్చన విడింతే కాని
గోలతన మిపుడేలే కొంగుపట్టీ నతడు ॥పల్లవి॥

తమకించి నపుడే తతియాయ రతులకు
సుముఖుడై నపుడే సూటి మాటకు
చెమరించినపుడే చేతల కెల్లాలోను
కొమరె వేల లోగేవే కొంగువట్టీ నతడు ॥వేళ॥

అంట జూచినపుడే అదనట్టే నవ్వులకు
వెంట వచ్చినపుడే విందు మోవికి
నంటు సేసుకున్నప్పుడే నయము కోరికలకు
దంటవు యేల కొంకేవే దక్కగొనీ నతడు ॥వేళ॥

ఆయము లంటినప్పుడే అనువు నీ పంతాలకు
చాయ సేసుకొన్నపుడే చవి కౌగిలి
యీ యెడ నలమేల్మంగ ఇదిగో శ్రీ వేంకటేశు-
న్నోయమ్మ కూడితివి నీ వాడి వట్టె నతడు ॥వేళ॥

శ్లో : 27-153

ప. సా రి̇ సా ని । పా ద ప ప మ ॥ పా ద ప స̇ ని । సా రి̇ సా ని ॥
వే ళ కా దు । సి గ్గు ల కు - ॥ వి చ్చ న వి డెం । తే - గా ని ॥

సా రి̇ స̇ స̇ ని । పా ద పా మ ॥ రి మ ప ప ని । స̇ రి̇ సా - - ॥
గో ల త న - । మి పు డే తే ॥ కొం గు ప ట్టి - । న త డు - - ॥ ॥వేళ॥

చ. స రి ప మ రీ । స రి సా - - ॥ స ని̣ ప̣ ధ̣ ప̣ ని̣ । స రి ని̣ సా - ॥
త మ కిం - చి । న పు డే - - ॥ త తి యా - య - । ర తు ల కు - ॥

స రి మ రి మ ప । మ ప ద ప ద ప ॥ ప ద ప మ ప మ । రి స రి మా - ॥
సు ము ఖు డై - - । న - పు - డే - ॥ సూ - టి మా - - । ట - - కు - ॥

రి మ ప ద ప ని । స̇ ని ప ద ప మ ॥ రి మ ప ని స̇ రి̇ । రి̇ స̇ నీ సా సా ॥
చె మ రిం - చి - । న - పు - డే - ॥ చే - త ల కె - । ల్లా - - లో ను ॥

స̇ రి̇ మ స̇ రి̇ స̇ । ని స̇ ని ప ద ప ॥ మ రి మ ప ప ని । స̇ రి̇ సా - - ॥
కో మ రె వే - ల । లో - గే వే - - ॥ కొం - గు ప ట్టి - । న త డు - - ॥వేళ॥



**అవతారిక :**

మానవునికి సుఖమునిచ్చునవిగా తోచినను, ఎండమావుల వంటివైన చూపు, తలపు, స్పర్శ వంటి వాటిని, యెంతో చక్కటి ఉపమానములతో ఈ రచన యందు చెప్పి యున్నారు. నిడివైన కనుచూపు నీడ నేయున్న యెండయట, తెలివి తక్కువ ఊహాలు-అనగా బుద్ధిమానిన చింత, పోని యూరికి తెరువట; ఇట్లే ఉదహరించుచు తీపు లోపలి తీపు (శ్రీ) వేంక టేశ్వరుని కరుణయనియు, కోరదగిన, తెలియదగిన, పొందదగిన యీ విషయమునందు తమ చూపు నిలిపి పంకించి చూచిన తెలియవచ్చుగదా యీ సుఖమనియు అనుచున్నారు.

**రాగ లక్షణము :**

ఈ బౌళి రాగము ప్రాచీన రక్తిరాగములలో నొకటి. దీనిని పూర్వాచార్యులు ఘన రాగ ఉత్తర పంచకమున చేర్చియున్నారు. దీనిని మాయామాళవగౌళ జన్యముగా యిప్పటి గ్రంథకర్తలు పేర్కొనియున్నారు. ఆరోహణ స రి గ ప ద స । అవరోహణ–స ని ద ప గ రి స అని యుండుటచే ఇది 51వ మేళమయిన కామవర్ధని జన్యమనియును అనవచ్చును. ఉత్తరదేశస్థుల ఇదే ఆరోహణావరోహణములు గల రాగమును 'త్రివేణి' యందురు. తాళ్ళపాకవారి రచనల యందు ఈ రాగము కొంచెము అధికముగనే కనబడుచున్నది. దీనికి సన్నిహితములగు మాయా మాళవగౌళ జన్యరాగములు, ఇప్పుడు వాడుకలో లేనివి ఎన్నియో వీరి రచనల యంద ఎక్కువగా కనబడుచున్నవి.

**బౌళి — త్రిపుట**

చూడరెవ్వరు దీని సోద్యంబు పరికించి
చూడ జూడగ గాని సుఖమెఱగరాదు ॥పల్లవి॥

ఎడతెగని మమత వేయగరాని పెను మోపు
కడలేని యాస చీకటి దవ్వుకొనుట
నిడివైన కనుచూపు నీడనుండిన యెండ
వడి చెడని తమకంబు వట్టి తాపంబు ॥చూడ॥

బుద్ధిమానిన చింత పోనియూరికి తెరువు
పొద్దువోవని వలపు, పొట్ట పొంకంబు
ఎద్దు బట్టిన సివం బెఱుక మాలిన ప్రియము
ఒద్దిక విహారంబు లుబ్బు గవణంబు ॥చూడ॥

తీపులోపలి తీపు తిరువేంకటేశ్వరుని
చూపు తను బొడగనని చూపులో చూపు
ఆపదలువాయు నెయ్యపు దలపులి(లో?)తలపు
రూపైన రుచిలోని రుచివివేకంబు ॥చూడ॥

11(2)–30

ప. - - గ । పా ద ప ॥ ద సా । సా సా ॥
- - చూ । డ రె - ॥ వ్వ రు । దీ ని ॥

- - స రి । గా గ రి ॥ రి సా । సా సా ॥
- - చో - । ద్యం బు - ॥ ప రి । కిం చి ॥

- - ప ద । సా స ని ॥ ని దా । ద ప పా ॥
- - చూ - । డ చూ - ॥ డ గ । గా - ని ॥

- - గ గ । ప ప ద ప ॥ గ రి । స స రి గా ॥
- - సు ఖ । మె ఱ గ - ॥ రా - । దు - - - ॥ ॥చూడ॥

చ. - - ప ద । ద ద ద ప ॥ ప పా । పా ప గ ॥
- - ఎ డ । తె గ ని - ॥ మ మ । త వే - ॥

ప ప ద । దా ద ప ॥ ప పా । పా పా ॥
య గ - । రా ని - ॥ పె ను । మో పు ॥

- - గ ప । దా సా ॥ స ని దా । దా పా ॥
- - క డ । లే ని ॥ యా - - । స చీ ॥

ప ప గ | పా ద ప || గ రి | సా - - ||
క టి - | త్రవ్వ - || కొను | ట - - ||

- - గ గ | పా దా || స స రి | గా గా ||
- - ని డి | వై న || క ను - | మా వు ||

- - స రి | గ ప గ రి || రి సా | సా సా ||
- - నీ డ | డ - నుం - || డి న | యొం డ ||

- - స స | రి స స ని || ద ద ప | పా పా ||
- - వ డి | చె డ ని - || త మ - | కం బు ||

- - గ | పా ద ప గ రి || స స రి | గా గా ||
- - వ | ట్టి - - తా - || పం - - | బు - ||

||చూడ||

**అవతారిక :**

ఇందు శ్రీ వేంకట నాథుడు సృష్టియందలి సమస్త జీవులయందును తానే నిండి యున్నాడని తెలుపుటకు పోతన గారి భాగవతమున ప్రహ్లాద చరిత్ర యందు చెప్పినట్లు "ఇందు గలడందు లేడని సందేహామువలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన యందందే గలడు"—అనునట్లు సామాన్యులకు సహితము భగవతీ స్వరూపము తెలియునట్లు నిత్య జీవితములో మనకు మంచి చెడ్డల యనుభవములను కలిగించుచు మనచుట్టూ తిరుగు జీవుల యన్నిటి యందును స్వామిని దర్శించి అన్నమయ్యవారు ఆనందించుచున్నారు.

బౌళి — తిశ్రఏక

ఎండగాని నీడగాని యేమైన గాని
కొండలరాయడే మా కుల దైవము ॥పల్లవి॥

తేలుగాని పాముగాని దేవ పట్టయిన గాని
గాలిగాని ధూళిగాని కాని యేమైనా
కాలకూట విషమైన గ్రక్కున మ్రింగిన నాటి
నీల వర్ణుడే మా నిజదైవము ॥ఎండ॥

చీమగాని దోమగాని చెలది యేమైన గాని
గాముగాని నాముగాని కాని యేమైనా
పాముల నన్నిటి మ్రింగే బలుతేజిపై నున్న
ధూమకేతువే మాకు దొర దైవము ॥ఎండ॥

పిల్లిగాని నల్లిగాని పిన్న యెలుకైన గాని
కల్లగాని పొల్లగాని కాని యేమైనా
బల్లిదుడై వేంకటాద్రిపైనున్న యాతడే మ
మ్మెల్ల కాలమును నేలే యింటి దైవము ॥ఎండ॥

ప. గా గ పా ప | పా ద దా ప || గా ప ప ప ద | పా - పా - ||
ఎం డ గా ని | నీ డ గా ని || ప దై - నా - | గా - ని - ||

గా ప ద స ని | ద ద పా పా || గ ప గా రి | సా - - - - ||
కొం డ ల రా - | య డె మా కు || కు ల దై వ | ము - - - - || ||ఎండ||

చ. ప గ గ గ ప ప | ప ద ద ద ప ప ||
తే - లు గా - ని | పా - ము గా - ని ||

ప గ గా పా | ప ద ద ప పా ||
తే నె ప ట్టై | నా - గా - ని ||

గా ప పా ద | ధ స స సా స ||
గా లి గా ని | ధూ - ళి గా ని ||

సా రి రి సా | సా - సా - ||
కా ని యే - | మై - నా - ||

సా రి రి గ గ | గ రి రి స సా ||
కా ల కూ - ట | వి ష మై - నా ||

సా రి గ గా | రి రి స స సా ||
గ్ర క్కు న గ్రిం | గి న నా - టి ||

సా రి సా ని | ద పా పా - ||
నీ ల వ ర్ణు | డే - మా - ||

గ ప గా రి | సా - సా - ||
ని జ దై వ | ము - - - || ||ఎండ||

**అవతారిక :**

నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని దూతికవచ్చి నాయకుని దర్శించి, "పున్నమ వెన్నెలవంటిదియు, నిత్యనూతన మైనదియు, పండిన పండట్లున్న నీ వలపులును, నిండిన నీ జవ్వనమును, తీపులగు నీ మోవి తేనెలును తలచి నాథుడు నిన్నుకూడనున్నాడు" అని విన్న వించుచున్నది.

బౌళి—రూపకం

వలచిన పతి వాడే వచ్చినదాన నే నిదె
తలపులు దలపులు తారు కాణ లెన్నడే ॥పల్లవి॥

పుచ్చ బుచ్చ బున్నమలు పోలతి నీ నవ్వులు
యిచ్చట నీపతి జూచేదిక వెన్నడే
నిచ్చ నిచ్చ గొత్తలాయ నెలత నీ జవ్వనము
మెచ్చి మెచ్చి ఆతనితో మేలమాడు టెన్నడే ।వలచిన॥

పండ పండ నట్లాయ వాడిక నీ వలపు
నిండిన పతి కౌగిట నించు టెన్నడే
వుండ నుండ నొగరాయపువిద నీ జంకెనలు
అండ నాతనికి వినయాలు సేయుటెన్నడే ॥వలచిన॥

తిన దిన దీపులాయ తెరవ నీ మోవి జున్ను
పొనిగి శ్రీ వేంకటేశు పొందు లెన్నడే
ననిచి యీతడే నేడు నయముల నిన్ను గూడె
మనికి మీ లోలోన మందలించు టెన్నడే ॥వలచిన॥

శృం : 26–99

ప. స రి గ పా ద ప గా ॥ ప గ ద ప దా ॥
వ ల చి నా - - - ॥ ప తి వా - డే ॥

గ ప దా సా రి స || స ని దా పా ద ప గ రి ||
వ చ్చి న దా - - || న - - నే - - వి దె ||

ప ద పా ద గ పా || ప ద పా ద గ పా ||
త ల పు - - లు || త ల పు - - లు ||

గ ప ద ప గా || గ రి రీ రి సా - ||
తా రు కా - ణ || లె - - న్న డో - ||

||వలచిన||

చ. స రి గా గా || గ ప దా దా || గ ప ద ప గ రి || సా రి గా - ||
పు చ్చ పు చ్చ || పు న్న మ లు || పొ ల తి - నీ - || న వ్వు లు - ||

గ ప దా సా || స ని దా ని ద పా || పా ద ప గ రి గా || పా - - - - ||
యి చ్చ ట నీ || ప - తి చూ - చే || ది క - సె - న్న || డే - - - - ||

ప గ పా దా || స స సా - రి గా || గ ప గ రి సా || స ని ప దా సా ||
ని చ్చ ని చ్చ || కొ త్త లా - - య || నె ల త - నీ || జ - వ్వ న ము ||

ప ద స రి గ రి సా || స రి స ని ద ప దా ||
మె చ్చి మె - - - చ్చి || ఆ - త - ని - తో ||

గ ప ప ద ని ద ద ప || గ ప ద ప గ రి సా ||
మే ల మా - - - డు - || లె - - - న్న - డే ||

||వలచిన||

**అవతారిక :**

"నీవు ఏమిచేసినా, ఏమిచెప్పినా, తిట్టినా దీవించినా, నా మనసునందు నాకు బాధ ఇంతైనను కలుగదు. నీవు నా పతివి. నీవేమి అనుటకైనను చెల్లును. కాని నీవు ప్రేమతో తెచ్చుకొన్న నా సవతులు ఎంత తియ్యగా తేనె లొలుకబోయుచు ఏమియన్నను, మర్మములు నాటి, వారి పలుకులు బాధ కలిగించుచున్నవి. నా సవతుల నయగారాలు నాకు ఈటె పోటుల వలె నున్నవి. నా సవతులముందు నీ వేమియు చేయవలదు," అని మానవతియు, స్వీయయునగు నాయిక, నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని వేడుకొనుచున్నది.

బౌళి—రూపకం

నే నెంత చిన్ననైనా నీకే సులభము గాని
పూని నా సరివారికి బోడవే షుమ్మీ ॥పల్లవి॥

యిచ్చకపు పతివి నీ వే మన్నా నితవే నాకు
కొచ్చి కొచ్చి తిట్టి నాను కోపమున్నదా
తెచ్చుకొన్న నీ సతులు తేనె మాటాడినాను
మచ్చరములై పెరిగి మర్మములు నాటురా ॥నేనెంత॥

నీటున ప్రాణవిభుడ నీవేమి సేసినా
వాటమై మొక్కుదు గాక వాసి వట్టేనా
పాటకపు సవతులు నయగారాలు సేసినా
యీాటెల పోట్లే కాక యింత కోపేనా ॥నేనెంత॥

చేరినన్ను నేలినట్టి శ్రీ వేంకటేశ నీవు
యేరీతి నుండినాను యెర వున్నదా
సారెకు నీవు మట్టిన సవతులు వద్దనున్నా
నీరసమె రేగు గాని యీాయకోలు గాదురా ॥నేనెంత॥

శృం : 17-213

ప. - గ పా దా || సా స ని ద ప ద ||
- నే నెం త || చిన్న - నై - న ||

- గ ప ద స ని ద ప || గ ప ద ప గ ప గ రి సా ||
- నీ కే - - - సు ల || భ - ము - గా - - - ని ||

- స రి గా గ రి || గ ప పా ద ప గ ప ||
- పూ - నినా - || స రి వా - - రి కి ||

- ప ద స రి గ రి స ని దా || పా ద ప గ ప గ రి స రి ||
- పొ డ వే - - - - - - - || సు - - - - - - - మ్మి - ||   ||నేనెంత||

చ. - ప ద ప దా || ద ద ప గ పా పా ద ప గ రి ||
- యిచ్చుక పు || ప - తి - వి నీ - - - - ||

స స రి గా గ రి || గ ప ద సా రి స ని ద పా ||
- వే - మన్నా - || నిత వే నా - - - - కు ||

- గ ప ప దా || పా ద ప గ ప గ రి స || - స రి గ రి గ || పా - - - - ||
- కొ చ్చి కొ చ్చి || తి ట్టి - నా - - - ను || - కోపము - న్న || దా - - - - ||

- గ ప ద సా || సా స రి గ రి గా ||
- తెచ్చుకొన్న || నీ - - స తు లు ||

- గ ప గ రి సా || స ని ప ద సా స ||
- తే - నె ల మా || టా - - డి నా ను ||

- స̇ రి̇ స̇ రీ̣ || స̇ ని ప ద స̇ సా ||
- మ చ్ఛ ర ము || తై - - పె రి గి ||

- ప ద స̇ రి̇ గ̇ రి̇ స̇ ని దా || పా ద ప గ ప గ రి స రి ||
- మ - ర్మ - ము - - - లు || నా - - టు - - - రా - ||

- గ పా దా || సా̇ స̇ ని ద ప ద ||
- నే నెం త || చి న్న - - నై నా || ||నేనెంత||

**అవతారిక :**

స్వామిని తేరుపై నుంచి మేళతాళములతోను, ఆటపాటలతోను రథోత్సవములను దేవాలయము లన్నిటి యందును చేయుట ఒక ప్రాచీనమగు ఆచారము. స్వామిని పరివేష్టించి కొలిచియుండెడి భక్తులు ఆ వైభవమును కొనియాడుచు గానము చేయుచుండుటయు వాడుక. ఇది అటువంటి సందర్భములలో అన్నమయ్యవారు పాడిన రచన కావచ్చును.

బౌళి—ఝంపె

దేవ దేవోత్తముని తిరుతేరు
దేవతలు గొలువగా తిరు తేరు ॥పల్లవి॥

తిరువీధు లేగీని తిరుతేరు
తిరుపు గొన్నట్లాను తిరుతేరు
తెరలించె దనుజుల దిరుతేరు
తిరిగె దిక్కులనెల్ల తిరుతేరు ॥దేవ॥

ధిక్కరించీ మోతల దిరుతేరు
దిక్కరి కుంభా లదర దిరుతేరు
తిక్కు ముత్తేల కుచ్చుల తిరుతేరు
తెక్కుల ప్రతాపించీ తిరుతేరు ॥దేవ॥

తీరిచె గలకలెల్ల దిరుతేరు
ధీర గరుడవాహపు దిరుతేరు
చేరి యలమేలుమంగతో శ్రీ వేంకటేశ్వరుని
తీరున నెలకొన్నట్టి తిరుతేరు ॥దేవ॥

అ : 11(1)–24

ప. ప గ గ గ ప | పా ప పద | ప ద ద స ని | ద ప ద గా ||
దే - వ దే - | వో త్త ముని | తిరు తే - - | రు - - - ||

గా ప ప ద | ప ద ప గ ప | గ రి రీ స | సా - - - ||
దే వ త లు | కొ లు వ గా - | తిరు తే - | రు - - - || ||దేవ||

చ. ప గ పా ప | పా ద ప ద | ప ద ద సా | సా - - - ||
తి రు వీ ధు | లే గీ - ని | తి రు తే - | రు - - - ||

స స రి గ ప | గా రీ స | స రి రీ స | సా - - - - ||
తి రు పు గో - | న్న ట్లా ను | తి రు తే - | రు - - - - ||

ప ద సా స | స రి స ని ద | ప ద పా - | ద ప ద గా ||
తె ర లిం చె | ద ను జు ల ను | తి రు తే - | రు - - - ||

ప గ ప దా | స ని ద ప ప | గ ప గ రి | సా - - - ||
తి రి గె ది | క్కు ల నె - ల్ల | తి రు తే - | రు - - - || ||దేవ||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రౌఢ. ఈమె నాథుని చేతలకు యిష్ట పడిన దైనను తన చెలితో "నాథుడు నన్ను ఆశలతో బెట్టి కొంత ప్రొద్దు, నాకు బాసలు చేసి కొంత ప్రొద్దు పోగొట్టుచున్నాడు. ఈసు దీర నన్ను మన్నించకున్నాడు. ఇట్లే నా వయసు పోవునో యేమో? నా మోమును చూచుచు మొక్కులాడుచు కొంత ప్రొద్దు జరపుచున్నాడే! ప్రణయ కలహపు మాటలు కొన్నిటితో ప్రొద్దు పోగొట్టి తెల్లవార్చుచున్నాడే? శ్రీ వేంకటేశ్వరుని చేతలను ఎవరికి చెప్పుకొందునే? నా సంతోష మెట్లీడేరునే? గతమునందలి కూటములు తలచుకొని తనిసితిని. ఇక తాళిమి తప్ప వచ్చెడి సంతోషములు ఎన్నడో కదా?" అని చెప్పుకొనుచున్నది.

మేచ బౌళి-త్రిపుట

తనిసితి నన్నిటాను తాలిమే మేలిమాయ
యెనసిన సంతసము లిక నెన్నడే ॥పల్లవి॥

ఆసలనే కొంతవద్దు అంగమంటి కొంతవొద్దు
బాసజేసి కొంతవొద్దు భ్రమయించెను
వాసికి సరసమాడ వయసు వోయీనేమో
యీసు దీర మన్నించే దిక నెన్నడే ॥తనిసితి॥

మోము చూపి కొంత వొద్దు మొక్కులాడి కొంతవొద్దు
నాముదేర నవ్వి కొంత నాలి సేసెను
ఆమని గుంటెన మాట లాడగానే తెల్లవారె
యీ మేర నన్నుగూడే దిక నెన్నడే ॥తనిసితి॥

చేయి వేసి కొంత వొద్దు సేసవెట్టి కొంతవొద్దు
యీ యెడ గాగిట గూడె నీ పొద్దు
పాయపు శ్రీ వేంకటాద్రిపతి కింతా నెలవాయ
యే యెడ జొక్కుదు గాక యిక నెన్నడే ॥తనిసితి॥

శ్లో : 27-441

ప.　- - ప ద | సా - ని దా || ప ద ని ద ప గ | పా పా ||
- - త ని | సి - - తి || న - - న్ని - - - | టా ను ||

- - గ | పా - ద ని ద ప || గా - ప ద ప | గ రి సా ||
- - తా | లి - - - మే - || మే - లి - - | నూ - య ||

- - ప ద | సా స రి గ రి || గా పా ద ప | గ రి స రి ||
- - యెన | సి - - న - || సం త - - | స - ము - ||

గా గ ప | దా స ని దా || పా - | - - - - ||
- లి క | నె - - న్న || దే - | - - - - ||　||తనిసితి||

చ.　- - ద | ద ద దా || ప ద ప గ ప గ | గ రి రీ సా ||
- - ఆ | స ల నే || కొం - - త - - | వ - - ద్దు ||

- - ప ద | సా స రి || గ రీ గా - | పా పా ||
- - అం - | గ మం టి || కొం - త - | వ ద్దు ||

- - ద | దా దా || ప ద ని ద ప గ | ప ద గా పా ||
- - బా | స జీ || సి - - కొం - - | త - - వో ||

పా ప ద | సా స ని ద || ద ని దా | పా - - ||
ద్దు భ్ర మ | యిం - - చె || ను - - | - - - ||

- - ప ద | స స రి గ రి || స రి గా ప గ | గ రి రీ సా ||
- - వా - | సి - - కి - || స ర స - - | మా - - డ ||

సాం సరి | సాం స ని దా || పా ద ప ద గ | పా - ద సా ||
- వ య | సు వో - - || యీా - - - - | నే - - మో ||

- - స రి | గ ప గ రి సా || సా సా రి గ రి స | స ని దా ప ద గా పా ||
- - యీా - | సు - - - దీ || ర - - - - - | మ - - న్నిం - - చే ||

- - గ ప | ద స స ని దా || పా ద ని ద ప గ రి | స రి స రి గా ||
- - ది క | నె - న్న - - || - - - - - - - | జే - - - చే || ||తనిసితి||

**అవతారిక :**

బ్రాసెడు పొట్టను నింపుకొనుటకు పడరాని పాట్లు మానవులు పడుచున్నారు కదా ! ఇతరులు మేలు చూచి ఓర్వలేకుండుట, పరులకు కష్టములు కలిగించు పనులు చేయుట, తాను చదివిన చదువుల యందలి మంచిని యితరులకు చెప్పకుండుట, ఆశలకు లోనైన మనసుతో చవుల వెంబడి పడి తిరుగుట, భగవంతుని సేవలకు వినియోగపడని ధనములను సంపాదించి విఱ్ఱవీగుట, శ్రీ వేంకటేశ్వరుని కొలువునకు పోజాలక తెలివిమాలిన త్రోవలను పోవు దొరతనములు కలుగుట—ఇవి యన్నియు దేహధారులకు పొట్ట నింపుట కొరకే గాని, భవబంధములు తొలగించుకొనుటకు కావు" అని అయ్యవారు ఉదర పోషణార్థమై సంచరించు మానవులనుద్దేశించి పరితపించుచున్నారు.

**రాగ లక్షణము :**

గుండక్రియ ప్రాచీన రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయా మాళవగౌళ జన్యము. అవరోహణము నందు స ద ని ప ద మ ప మ గ రి స — ఆరోహణము నందు సంపూర్ణము కలిగి యీ రాగమును పూర్వాచార్యులు ప్రథమ యామమున గానము చేయదగినదని చెప్పియున్నారు. అన్నమయ్యవారి తరువాత, మేళకర్తలు పుట్టి సంపూర్ణ సంపూర్ణమగు మాయా మాళవగౌళ ప్రచారమునకు వచ్చి, వక్ర సంపూర్ణమగు యీ రాగము మరుగునపడిన దేమోనని తోచుచున్నది. ఇందు ఇటీవలి వారివి ఒకటి రెండు రచనలు తప్ప కానవచ్చుట లేదు. ఇది అయ్యవారి కాలమున ఎక్కువగా ప్రచారము నందున్నట్లు తోచుచున్నది. ఇందు తాళ్లపాకవారి రచన లెన్నియో గలవు.

గుండక్రియ — ఝంపె

కడుపెంత తా గుడుచు కుడుపెంత దీనికై
పడని పాట్ల నెల్ల పడి పొరల నేలా ? ॥పల్లవి॥

పరుల మనసునకు నాపదలు గలుగగ జేయు
పరితాపకరమైన బ్రతు కేలా ?
సొరిది నితరుల మేలు చూచి సైపగలేక
తిరుగుచుండేటి కష్టదేహ మిది యేలా ? ॥కడు॥

యెడిరి కెప్పుడు జేము హితమెల్లదన దనుచు
చదివి చెప్పని యట్టి చదువేలా ?
పొది గొన్న యాసలో బుంగుడై సతతంబు
సదమదంబై పడయు చవులు దరకేలా ? ॥కడు॥

శ్రీ వేంకటేశ్వరుని సేవారతికి గాక
జీవన భ్రాంతి బడు సిరులేలా ?
దేవోత్తముని నాత్మదెలియ నొల్లక పెక్కు
త్రోవ లేగిన దేహి దొరతనం బేలా ? ॥కడు॥

అ. 5–205

ప. స రి మా మ । పా ప ప మ ॥ ప ని సా స । రీ రి స ని ॥
క డు పెం త । దా గు డు చు ॥ కు డు పెం త । దీ ని కై - ॥

ప ని స స ని । ప ద పా మ ॥ ప ద ప ప ను । గ రి సా - ॥
ప డ ని పా - । టు ల నె ల్ల ॥ ప డి పొ ర ల । నే - లా - ॥ ॥కడు॥

చ. మ మ ప ప ద । ద ప ప ప మ ॥ మ మ ప ప ద । ద ప ప ప మ ॥
ప రు ల మ న । సు న కు నా - ॥ ప ద లు క లు । గ గ జే - య ॥

ప ద పా ని । స ని స స స ॥ స స స రి రి । రి స సా - ॥
ప రి తా ప । క ర మై - న ॥ బ్ర తు కే - । లా - - - ॥

స స రి మ గ । రి రి స స స ॥ స స రి మ గ । రి రి స స స ॥
సొ రి ది ని త । రు ల మే - లు ॥ సూ - చి సై - । ప గ లే - ని ॥

ప ప ని సా । స రి స స ని ॥ ప ద ప మ గ । రి రి సా - ॥
తి రు గు చుం । డె డి క - ష్ట ॥ దే - హ ము ది । యే - లా - ॥ ॥కడు॥

**అవతారిక :**

జగత్తంతయు దేవదేవుని మాయామయమైనది, ఇది వట్టి బూటకము నాటకము శరీరమునందలి జీవునికి కోటి విద్యలు కూటికొరకు మాత్రమే, ధనస పాదనలు భోగములకు మాత్రమే, చదివిన చదువులలో తా నెవరో తెలిసిన ఘనునికి వేంకటనాధుని మాయలు లీలలుగానే తోచుననియు హరిదాసులు కందురనియు అయ్యవారు చెప్పుచున్నారు.

**గుండక్రియ – ఆది**

నాటక మింతా నవ్వులకే
పూటకు బూటకు బొల్లై పోవు ॥పల్లవి॥

కోటి విద్యలును గూటి కొరకె పో
చాటున మెలగేటి శరీరికి
తేటల నాకలి దీరిన పిమ్మట
పాటుకు బాటే బయలై పోవు ॥నాటక॥

మెఱసేటి దెల్లా మెఱుతల కొరకే
చెఱల దేహముల జీవునికి
ఱఱ మగవుల సుఖమందిన పిమ్మట
మెఱుగుకు మెఱగే మొయిలై పోవు ॥నాటక॥

అన్ని చదువులును నాతని కొరకే
సన్నెరిగిన సుజ్ఞానికిని
యిన్నిట శ్రీ వేంకటేశు దాసునికి
వెన్నెల మాయలు విడివడి పోవు ॥నాటక॥

ప.  ప మ ప ని సా సా | స ని స రి | సా - - ||
నా - ట క మం తా | న - వ్వు ల | కే - - ||

స రి మ గ రి రి స ని | స ని ప ద | ప మ పా ||
పూ - ట కు బూ - ట కు | పొ - ల్లయి | పో - వు || ||నాటక||

చ.  పా ద ద ప ప ప మ | పా ద ద | ప ప ప మ ||
కో టి వి - ద్యలును | గూ టి కో | ఱ కె పో - ||

మ ప ద ద ప మ గ రి | రి మా మ | పా - - ||
చా - టు న మె ల గే టి | శ రీ రి | కి - - ||

ప మ ప ప ని ని స స | రీ రి మ | గా రి రి ||
తే - ట ల నా - క లి | దీ రి న | పి మ్మ ట ||

స రి స ని ప ని సా | ప ద ప మ | గ రి మా ||
పా - టు కు పా - చే | బ య లై - | పో - వు || ||నాటక||

**అవతారిక :**

ఇందలి నాయిక పరకీయ. జాణ. ఈమెకు జూద మాడు నేర్పుకలదు. తనను చేర లంతేసి కన్నులతో నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుడు చెంగలించు చున్నాడట. తనను జూద మాడుటకు పిలువగా భయస్తురాలివలె "అత్త మామలు గల వారము. పట్టి పందెములు వద్దు. రేఖ రేఖ వేయగలిగితే ఆడవచ్చు" అంటుంది. ఈమెకు తన గెలుపునందెంత నమ్మక మున్నదో "సత్యభామతో నాడి నీ వోడి ఆమె పాదములకు నీవు మ్రొక్కితివి. అల్లే ఓడినచో నాకును మ్రొక్కవలెను సుమా! మేము పేదవారము. మావంటి మీద సొమ్ములుండ నియ్యవా, పోనీతే నీవు గెలిచినచో నా పాదములంటి బంగారు మట్టెలు తీసుకో" అనుచున్న యీామె ఎంత పేదరాలో తెలియుచున్నది గదా! శ్రీ వేంకట పతి ఈమెను కూడినదట ఇకచాలు. కర్పూర తాంబూలమిచ్చి పంపవయ్యా" అని ఈ ఖండిత పలుకుచున్నదని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

సావేరి పూర్వ ప్రసిద్ధములగు రక్తిరాగములలో నొకటి. ఇది మేళకర్తల ఆవిర్భావ మునకు ముందునుండియు వాడుక యందున్న రక్తిరాగము. ఐనను ఇప్పటి వాడుక ప్రకారము 15వ మేళమగు మాయామాళవగౌళ జన్యముగా చెప్పుకొనుచున్నాము. స రి మ ప ద స | స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. తారస్థాయి యందు స రి ప మ గ రి సా అను ప్రయోగము గలదా యనియు, స ని స, మ గ మ అను ప్రయోగ ములు కలవా అనియు, విద్వాంసుల మధ్య వాదోపవాదములు గలవు. కాని యిప్పుడు లభ్యమగుచున్న రచనలలో, ప్రాచీనములగు క్షేత్రజ్ఞులవారి పదములలో ఇట్టి ప్రయోగములు గలవు. కనుక వాటిని పాటించినచో తప్పేమియు లేదు. ఆరోహణావరోహణములపై ఆధార పడక రాగచ్ఛాయలను కమక వరికాదులను తెలిసి పాడుకొనదగిన అఠాణా, ఆహిరి, సైంధవి, హుసేని వంటి రాగములలో నిదియొకటి యని తెలుసుకొనినచో ఇట్టి వాదోపవాదములకు తావుండదు.

**సావేరి — త్రిపుట**

ఊరకే పోనియ్యరా నన్నుద్దండాన
చేర లంతేసి కన్ను లెంగలించే విప్పుడు ॥పల్లవి॥

జూదమాడ బిలిచేవు చూపులనే జంకించేవు
పేద వారి మేన సొమ్ము పెట్ట నియ్యవా !
కేదమున నోడి గెలిచితి నంటా నా
పాద మంటి తీసుకోరా బంగారు మట్టెలు ॥ఊరకే॥

నెత్తమాడ బిలిచేవు నెఱ జాణ నంటాను
అత్తమామ గల వార మదేమిరా !
ఒత్తి విన్న వించ లేము ఓడితేను నీకు నాకు
రిత్తమాట వద్దు రేఖ రేఖ పందెమూ ! ॥ఊరకే॥

సొక్కటాలు నిన్న నాడి సోలి సత్యభామకు
మ్రొక్కితివి నేడు నాకు మ్రొక్కవలెగా !
చక్కని వేంకటపతిస్వామి నన్నుం గూడితివి
మొక్కెద కర్పూర తాంబూల మీరా చాలును ॥ఊరకే॥

శృం : 4-163

ప. - - ప ద | పా పా - మ || గా రి | స రి ప మ గ రి ||
- - ఊ - | ర కే - - || పో - | ని - - - - య్య ||

సా - | స స ని ఫ ధా || సా స రి | మా ప మ గ స ||
రా - | న - - - న్న || - ఉ - | ద్దం డా - - - ||

రీ ప మ | దా సాం || సాం సం రిం | గ సం రిం రిం ||
న చే - | ర లం || తే - - | సి - క ను ||

రీ సం రిం | సాం సం ని ద ద || మ ప దా | ప మా గ రి సా - రి || మా
ల జెం - | గ లిం - - - || చే - - | ని - - - పు - - || డు ॥ఊరకే॥

చ. - స రి | మా గా || స రి గ స | రీ సా ||
- పొ క్క | టా ల || ని - న్న - | నా డి ||

- స రి | స ని ధా || స రి గ స | రీ రీ ||
- సో లి | స - త్య || భా - - - | మ కు ||

స రి ప మ గ | రి రి సా || - - స రి | మా పా - మ ||
మ్రొ - - - - | క్కి తి వి || - - నే - | డు నా - - ||

ద ప ప మ | గా రీ || పా మ దా - | పా - - ||
కు - - - | మ్రొ క్క || వ - లె - | గా - - ||

- - ప మ | దా సా || సా - | స ని పా దా ||
- - చ - | క్క ని || వేం - | క - - ట ||

ప దా | సా - రీ గా || స రి ప మ గా | రి రి స స ||
ప తి | స్వా - - మి || న - న్ను - - | గూ - డి తి ||

సా ప ద | స రి గా రీ || సా - | స ని పా దా ||
వి మ్రొ - | క్కె - - ద || క - | ర్పూ - - ర ||

పా ద మ | గ స రీ || సా స ని | ధా స రి || ప మ
తాం - - | బూ - ల || మీ - - | ర చా - || లు ను ||ఊరకే||

**అవతారిక :**

ఇందు నారాయణుడగు శ్రీ వేంకటేశ్వరుని మోహిని యవతారపు లీలలను చెప్పుకొనుచు అయ్యవారు, "లకిమమ్మ యగు అలమేలుమంగదేవి సౌందర్య, సౌకుమార్య, సౌభాగ్య లక్షణములను చూచి అట్టివి తనకును అనుభవమునకు వచ్చుటకు, స్వామి యీ అవతారము నెత్తినాడో, లేక ఆమెతో తాదాత్మ్యతను పొందుటకు మోహినియైనాడేమో, ఆమెకు సఖియై కలసిమెలసి యుండుటకు యిట్టి రూపు ధరించినాడేమో! పాపము, ఆతనికి ఆ యవతారము నందు పతి దొరకనే లేదు గనుకనే ఆ సౌందర్య, సౌకుమార్యముల నట్లే యుంచుకొని తిరుమల యందు శ్రీ వేంకటేశ్వరుడై వేంచేసి యున్నాడు." అని అలమేలుమంగా నాథుడగు దేవుని రూపును, అమ్మవారి సౌందర్యమును హృద్యంగముగా కొనియాడుచున్నారు అయ్యవారు. ఇట్లగుట దోసముగాదనియు అన్యోన్యత గలిగిన సతీపతులకు, ఇట్టి భావములు చేతలు లోక సామాన్యములేనని అయ్యవారు చెప్పుచున్నారు.

**సావేరి—త్రిపుట**

అందుకేమి దోసమా అయితే నేమి
కందువై లోకములోన గలదే కాదా ॥పల్లవి॥

వలచి యిందిరాదేవి వన్నెలు జక్కదనాలు
తలపులో నే పొద్దూ దలపోయగా
సలిగె తోడుత నాపె సారూప్య మందినట్టు
నలువై గోవిందుడే నారాయణి యాయను ॥అందు॥

బాలకియై లకిమమ్మ పైపై సిగ్గువడగా
తేలించి యాపె మనసు తెలియ బూని
చాలా వేడుక నాకె సకియ యుండినటు
ఆలికిగా భువన మోహనరూప యాయను ॥అందు॥

యెడయ కింతులలో మేలెల్లా దెలియబూని
కడగి యాడురూపము గైకొని చూచి
బడినె తనకు నెందూ బతిలేనివాడు గాన
కడ గోవిందుడే శ్రీ వెంకటనాథు డాయను ॥అందు॥

శృం : 16(2)—119

(ఇది తాళ్ళపాక చిన తిరుమలాచార్యులవారి రచన)

అ. - - ప ద | పా - మ గ స || రీ - | స ని ఫ ధా ||
- - అం - | దు - - కే - || మి - | దో - - స ||

సా - | స రి మా || మా - | ప మ గ రి స రి మ ప ||
మా - | అ యి తే || నే - | మి - - - - - - - ||

దా మ ప | ద రి సా || స రి స రి మా | గ రి సా ||
- కం - | దు - వై || లో - - - - | క ము లో ||

సా రి స ని ప ద | మ ప ద రి || సా - | ని ద ప మ గ రి స రి || మా
న - - - - - | గ ల దే - || కా - | దా - - - - - - - || - ||అందు||

చ. - - స రి | మా మా ప మ గ రి || స రి గ రి | రి ప మ గ రి సా ||
- - యె డ | య కిం - - - - || తు - ల - | లో - - - - - ||

- రి మా - | పా ద ప ప మ || స రి మ మ ద ని | ద మ గ రి ||
- మే - - | లెల్లా - - - || దె - లి . - - | య - బూ - ||

సా స రి | గ స రీ || - సా స ని ప | దా సా ||
ని క ఢ | గి - యా || - డు రూ - - | ప ము ||

- - ప ద | స రి స రి మా || మా ప మ గ రి మ | పా - - ||
- - గై - | కొ - - - ని || చూ - - - - - | చి - - ||

- - స రి | మా మా ప మ గ రి || స రి గ రి | రి ప మ గ రి సా ||
- - బ డి | నె త - - - - || న - కు - | నెం - - - - దూ ||

- - రి మ | పా ద ప ప మ || స రి మ ప ద ని | ద మ పా ||
- - ప తి | లే ని - - - || వా - డు - - - | గా - న ||

- - మ ప | ద రి సా || స రి స రి మా | గ రి సా ||
- - క డ | గో - విం || దు - డే - - | శ్రీ - వెం ||

సా రి స ని ప ద | మ ప ద రి || సా - | ని ద ప మ గ రి స రి || మా
క - - ట - - | నా - ధు - || డా - | య - - - - - - - || ను ||అందు||

**అవతారిక :**

లక్ష్మీనారాయణులగు నాయికా నాయకులను, వారియందు గల సామ్య సౌందర్యములను వర్ణించుచు అన్నమయ్యవారు, "నీలవర్ణుడవు నీవు నీలకుంతలి ఆమె. పీతాంబరుడవు నీవు. బంగరుమేని చాయ ఆమె. పాలసముద్రము నందు నీ వుండునది. ఆమె ఆ సముద్రమునకు బిడ్డ వావులు వరుసలు, వన్నెలు చిన్నెలు అన్నియు మీకు తగియున్నవి. కల్యాణయోగమును లక్ష్మీనారాయణయు సిద్ధికల్గుచున్నవి. శీఘ్రమున మాకు శోభనతాంబూలము లియ్యరాదా" అని అమ్మవారిని, స్వామివారిని మేలము లాడుచున్నారు.

**రాగ లక్షము :**

గౌళఘనరాగ పూర్వపంచకము నందు రెండవది. ఇది ప్రాచీన రాగములలో నొకటి. ఇందల స్వరసముదాయము శృంగార పదములకు ఒదుగునట్లు నప్పించుట అతి కష్టము. మధ్యమ, దురితకాలములలో తప్ప, యీ రాగమును నేడు మనము వినుచుండుట లేదు. అభినయ ప్రధానములగు పదములు ఇందు విళంబకాలమున పాడినచో ఎట్లుండునో! ఇట్టి సృష్టిచేసిన తాళ్ళపాక వారికి జేజేలు!

స రి గ మ రి మ ప ని స : ఆరోహణ

స ని ప మ రి గ మ రి స : అవరోహణ

ఇది యిప్పటి వాడుక ప్రకారము 15వ మేళకర్త మాయామాళవగౌళ జన్యము.

గౌళ—రూపకం

ఎట్టు గూడె జెండ్లి యోగ మిద్దరికి నీవేళ
అట్టు లక్ష్మీనారాయణ యోగము ॥పల్లవి॥

నెలత కమలవాసి నీవు కమలాక్షుడవు
పొలతి నీకు గూడె పొంతనాలు
వలుద చక్రవాకాలు వనితకు చాలు నీకు
ఘొలమి జక్రాయుధుడ విద్దరికి దగునను ॥ఎట్టు॥

తరుణి నీలకుంతలి (ల) తగునీల వర్ణుడవు
సరుస మీకే తగు సమ్మంధము
నిరతి హేమ వర్ణకె నీవు పీతాంబరుడవు
సరవి నిద్దరి కొక్క జాతియ్యము ॥ఎట్టు॥

పాలవెల్లి బుట్టె నాకె పాలవెల్లి యిల్లు నీకు
మేలు మేలు యిద్దరికి మేనవావి
యీ లీల (శ్రీ) వేంకటేశ యింతి నీవు గూడితివి
సోలి మాకు బెట్టరాదా సోబన విడేలు ॥ఎట్టు॥

శృం : 26–201

ప. స స ని స రి స రీ ॥ సా స ని పా - ని ప మ మా ॥
ఎ ట్టు గూ - - - డె ॥ బెం డ్లి - యో - - గ - - ॥

రి మ ప ని స ని పా మ గ మా ॥ రీ గ మ రి రి సా ॥
మి - ద్ద - రి - - కి - - ॥ నీ - - వే - శ ॥

స స ని ఫా ని స రి స ॥ రీ ప మ గ మ రి రి ॥
అ ట్టె - ల క్ష్మీ - - - ॥ నా రా - - - య ణ ॥

మ ప ని స రీ - - ॥ స ని ప మ రి స రి మ ప ని ॥
యో - - - - - - ॥ గ - - - ము - - - - - ॥ ॥ఎట్టు॥

చ. మ మ ప ని ప మ మ గ మా ॥ రి గ మ గ రి రి సా ॥
పా ల వె - - - ల్లి - - ॥ బు - ట్టె - నా - కె ॥

స ని పా ని స రి స రీ ॥ ప మ గ మ రి రి సా ॥
పా - ల వె - - - ల్లి ॥ ఇ - ల్లు - నీ - కు ॥

స రి మా పా || ప ని సఁ రిఁ ని సఁ పా ||
మే లు మే లు || యి ద్ద రి - - - కి ||

మ ప ని ప ప మ గ మ రి మ || పా - - - - ||
మే - న - వా - - - - - - || ని - - - - ||

ప మ పా పా స ని సా || ని సఁ రిఁ స రిఁ రిఁ సా ||
యీ - లీ ల - - (శ్రీ) || వేం - క - టే - శ ||

ప మ గ మ రిఁ గ మా రీ || రిఁ స ని ప ని స రీ సా ||
యిం - తి - నీ - - వు || గూ - - - డి - తి వి ||

స రిఁ సఁ ని ప ని సఁ రిఁ సఁ ని పా || మ ప ని ప ప మ గ మ రీ ||
సో - లి - మా - - - కు - - || పె - ట్ట - రా - - - దా ||

స రి స ని ఫ ని స రి స ని స రి || ప మ గ మ రి స రి మా ప నీ ||
సో - బ - న - - - - - - - - || వి - - - - - డే - లు - || ||ఎట్టు||

**అవతారిక :**

జ్ఞానయగు నాయిక నుద్దేశించి ఆమె చెలి, "నయములు కలుగుట ప్రియములు కలుగుట, మొగమొగములు చూచుకొనుట, తగవులు నెరపుకొనుట, వంటివి ఎన్ని చేసినను ఇవి యన్నియు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునికి మోహమును పెంచుటకే కదా! ఆనందము, పొలయలుక తీరినవెనుక పెంపొందును కదే. అందుకే కదా విభుడు నీ యింట నెలకొన్నాడు. సరసముల సరసములెరిగిన దీనవు సుమా నీవు" యని చెప్పుకొనుచున్నది.

గౌళ–రూపకం

ఇందుకేనా విభుడు నీ యింట నెలకొన్నాడు
కందు వెలుగుదువు యీ కత నీవే నేర్తువే ॥పల్లవి॥

నయమెంత గలిగినా నవ్వులకే మేలు
ప్రియమెంత గలిగినా పెనవులకే మేలు
జయమెంత గలిగినా చనవులకే మేలు
క్రియ తెలుగుదువు యీ కీలు నీవే నేర్తువే ॥ఇందుకే॥

మొగమెంత చూచినా మొహానకే మూలము
తగవెంత నెరపినా తగులుకే మూలము
నగవెంత గలిగినాను నమ్మికలకు మూలము
పగ తెరుగుదువు యీ పాడి నీవే నేర్తువే ॥ఇందుకే॥

వూడిగ మెంతసేసినా వొద్దికలకే దాపు
వేడుకెంత నిలిపినా విట్టువీగుటకే చాపు
కూడితి విన్ని చందాల కోరిక శ్రీ వేంకటేశు
జాడెలుగుదువు సరసము సరసము నీవే నేర్తువు ॥ఇందుకే॥

శ్ఖం : 27–126

ప. ప మ మ గ మా రి || రి గ మా రి సా స ని ||
ఇం దు కే - - కా || నె - ల కొ న్నా డు - ||

స రి స ని సా || స ని ధా ని స రి స రి ||
వి భు డు నీ - || యిం - ట నె - ల - కొ ||

ప మ గ మ రీ సా || రి మ పా స ని ప మ ||
న్నా - - - - డు || కం దు వె రు - గు దు ||

ప ని సా స ని సా రి స || ప ని స రి స ని పా మ ||
వు - - యూ - - క త || నీ - - - - - వే - ||

రి గ మా రి రి సా ||
నే - - ర్తు - వే || ||ఇందు కేకా||

చ. రి స రీ రీ || రి స ని ధ నీ సా || ధ ని స రి ప మ గ మ రీ ||
న య మెం త || గ - లి - గి నా || న - ను - పు - ల - కే ||

రి స నీ సా సా || స రి మా పా || పా స ని పా మా ||
మే - - లు - || ప్రి య మెం త || గ లి - గి నా ||

రి మ ప ని ప మ గ మ రి || రి స నీ సా - - ||
పె - న - పు - ల - కే || మే - - లు - - ||

రి మ పా నీ || స స ని స రి రి స సా ||
జ య మెం త || గ లి - గి - నా - - ||

రి గ మా రి రి స స || రి స ని ప ని స రీ సా ||
చ - న వు ల కే - || మే - - - - - - లు ||

రి గ మా రి రి స స || రి స ని ప ని స రి స రీ ||
క్రి - య తె ఱు గు దు || వు - - - యూ - - - - ||

ప ని సా రి ని స ని పా ప మ || ప మ గ మ రి రి సా ||
కీ - లు - - నీ - - షే - || నే - - - ర్తు - వే || ||ఇ`దు

**అవతారిక :**

ఇందు నాయిక స్వాధీనపతిక, ప్రౌఢ. నాథుని చిత్తమును తనయందు నిలుపుకొను నేర్పరితన మీమెకు కలదు. నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునితో "నీకు వలపిన విధము లన్నియు నేర్చినది సుమా మా అలివేలుమంగ! నీవు యీమెయందు తప్పులెంచుటకు వలను గాదు. ఇట్టి మా నాయికను ఏలుకొనవయ్యా శ్రీ వేంకటేశ్వరుడా!'' అని చెలులు స్వామికి విన్నవించుచున్నారు.

**రాగ లక్షణము :**

సాళంగనాట ప్రాచీన ఘన రాగములలో నొకటి. ఇందు శృంగార రస ప్రధానము లగు పదములు చెప్పిన ఘనత తాళ్ళపాక వారిదే! ఘనరాగములు, గంభీరములగు నడకలతో నుండి, స్వరసంచారములయందు మహా వేగముగ పరుగులిడు సెలయేళ్లవలె నుండుట సహజము. అట్లే పెద్దలును చెప్పియున్నారు. ఇందు లలితములగు మనో భావములను వ్యక్తపరచుట కొంత కష్టసాధ్యమగు పనియే! సాళంగనాట 15వ మేళమగు మాయా మాళవగౌళజన్యము. స రి మ ప ద స । స ని ప ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. సావేరి మొదలగు సన్నిహిత రాగములనుండి దీనిని వేరుపరచుకొను, గమకవరికాదుల ప్రయోగములు అధ్య యనము చేయవలసి యుండుట వలననేమో ఇందు తరువాతి వాగ్గేయకారులు రచనలు చేసి నట్లు కనబడదు.

**సాళంగనాట — రూపకం**

అన్నిటా నేరుపరిగా అలవేలుమంగ నీకు
చిన్ని చిన్ని ముద్దులనే విడిపించెను ॥పల్లవి॥

చనవు మెరసి నిన్ను సారె సారె బేరుకొని
మనసు దనియ నాపె మాటలాడెను
కను సన్న చూపులనె కప్పుర విడెములిచ్చి
తనువు దనియ నీపై దలబాలు వోసెను ॥అన్ని॥

పన్నగడల తోడనే పానుపు చేరువనే
కన్నుల దనియగ దగ్గరి నిల్చెను
మన్ననలు దై వార మచ్చికలు పెడరేచి
విన్న వీనులు దనియ విన్నపాలు సేసెను ॥అన్ని॥

మాగిన మోవి యిచ్చి మనసు గరచి యిట్టే
కాగిలి దనియ నీకు గప్పె బయ్యెద
వీగక శ్రీ వేంకటేశ వెలది గూడితి విట్టె
రాగి వయసు దనియ రతికేలి సేసెను ॥అన్ని॥

రే : 14-89

ప. సా రి సా ని || పా ప ద ప మ || రి మ ప ద పా || మ గ రి సా ||
అ న్ని టా - || నే రు ప రి గా || అ ల మే - లు || మం గ నీ కు ||

స రి సా స ని || ప ద ప ని సా || స రి మ ప దా || ద ప ప మ ప ద ప ని ||
చి న్ని చి న్ని - || ము ద్దు ల - తో || సి గ్గు వి డి పిం || చే - - - - - - ను - ||
||అన్నిటా||

చ. మ మ మా ప ద ప మ || గ రి ప మ గ రి సా ||
చ న వు మె - ర - || సి - ని - - - న్ను ||

స రి సా - ని ప ధ || ప ని స రి సా ||
సా రె సా - - రె - || చే రు గొ - ని ||

స రి మా ప మ గ రి || స రి గా రి స నీ సా ||
మ న సు - - ద ని || య - - నా - - పె ||

స రి మా పా || ద ప ప మ ప ద ప ద పా ||
మూ - టా లా || దే - - - - - - - ను ||

రి మ ప ద పా || మ గ ప స ని సా ||
క ను స - న్న || చూ - - పు ల నె ||

స రి మ గ రీ || స రి గా రి రి సా ||
క ప్పు ర - వి || డె - ము లి - చ్చి ||

ప ద ప ని స ని || సా రి గ రి స నీ సా ||
త ను వు - ద ని || య - - నీ - - పై ||

స రి మ ప దా || ద ప ప మ ప ద ప ని ||
ద ల ఝాం - లు || పో - - - - నె ను - ||

||అన్ని||

**అవతారిక :**

ఇందు నాయికా నాయకులగు శ్రీ అలవేలుమంగ, శ్రీ వేంకటేశ్వరుల అమరికలు ఆనందములు వైభవములు కొనియాడుచు, "మాయమ్మకు నీ యురము సింహాసనము, నీ హార ములే ఆమెకు సింగారపు దండలు, తోరణ కంభములవలెనున్నవి నీ హస్తములే, నీ తులసిదండలు పచ్చతోరణములు, నీ కౌస్తుభమణియే మించుటద్దము, నీ సొబగులే ఆమెకు నిండిన కానుకలు, కప్పములు, నీ కూరిమలే ఆమెకు సిరులు, నీ విచ్చెడి మోవి తేనెలే విందులు, నీ భోగములే వేడుకలు. ఇట్లు మా చెలికి నీ సర్వస్వమే యొక సామ్రాజ్య వైభవమై యున్నది" అని కీర్తించు చున్నారు.

**సాళంగనాట — త్రిశ్రఏక**

పట్టము గట్టితి వింక బ్రతుకరయ్యా
చిట్టకాలు లేవు మీకు శ్రీ వేంకటేశుడా ॥పల్లవి॥

అలమేలు మంగకు సింహ్వా(హా)సనము నీ వురము
కలిత హారములే సింగారపు దండలు
తొలకు నీ హస్తములే తోరణ గంభములు
చెలి రాజ్యమే నీవు శ్రీ వేంకటేశుడా ।పట్టము॥

పరగు తులసిదండ పచ్చతోరణ మాపెకు
మెరుగు గౌస్తుభమణి మించుటద్దము
గరిమ నీ సొబగులు కప్పములు గానికలు
సిరులు నీ కూరిములు శ్రీ వేంకటేశుడా ॥పట్టము॥

సంతతమైన విందులు సారె నీ మోవి తేనెలు
వింత రతి భోగములు వినోదాలు
కొంత నియ్యారును బొద్దు కుంచెయు గాళాజి
చెంతలనన్ని సమరె శ్రీ వేంకటేశుడా పట్టము

శ్లో : 27–152

ప. మా ప ప దా | ప ప మా గా || రి స రి మా ప | గా - రి స రి ||
ప ట్ట ము గ | ట్టి తి విం క || బ్ర తు క ర - | య్యా - - - - ||

రి మ ప ద ప | స ని స ప ద ప || మా ప ద ప ద | గా రి సా - ||
చి ట్ట కా - లు | తే - వు షి - కు || శ్రీ వేం - క - | టే శు డా - || ||పట్టము||

చ. ద ద దా దా | ప ద పా మా || ప ప ద ప మ గ | రి స రి మ మా ||
అ ల మే లు | మం - గ కు || సిం - హా స న ము | నీ - వు ర ము ||

స రి మా మ మ | ప మ గా - - || రి స రి మ ప ప | ప ద మ పా - ||
క లి త హా ర ము | తే - - - - || సిం - గా - ర పు | దం - డ లు - ||

ప ద ప మ గ రి | స రి మ ప దా || ప ద ప స ని స | రి రి స ని సా ||
తో ల కు - నీ - | హ - స్త ము తే || తో - ర ణ - - | గం - భ ము తే ||

- స రి మ గా రి | స రి గ రి సా స || స ని ప ద ప మ | గ రి స రి మా - ||
- చె లి - రా జ్య | మే - - - నీ వు || శ్రీ - వేం - క - | టే - - శు డా - ||
||పట్టము||

**అవతారిక :**

"అంతర్యామియగు పరమాత్ముని తో 'నేను' 'నే' నను భావముతో అలమటించి అలసితిని స్వామీ! కోరిన కోర్కెలు తీరవు. పాపపుణ్యములు బాయవు. జనుల మధ్య తిరుగాడుచు కష్టసుఖములను పంచుకొనక తప్పదు. మనసున నిండిన మైలలు వదలవు. వేంకటేశ్వరుడా! ఇట్టి విషయ పరంపరల యందు నేనిక పోరలాడలేను. నా యంతరాత్మవగు నిన్నే శరణు వేడుచు, నన్నుద్ధరింపుమని వేడుచున్నాను" అని అయ్యవారు ఇందు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

**లలిత** అతి ప్రాచీనమగు రాగములలో నొకటి. దీనిని 17వ మేళమగు సూర్యకాంతమునకు జన్యముగా పాడుకొనుట వాడుకలో నున్న పద్ధతి. ఒకే విధముగా ఆరోహణావరోహణములు కలిగి యుండుట వలన, వసంతరాగమును కూడ ఈ 17వ మేళ జన్యముగనే చెప్పెడివారును కలరు. కాని శుద్ధధైవతముతో స్వతంత్రముగా యొప్పుచుండెడి వసంత, చతుశ్శృతి ధైవతముతో ప్రత్యేకముగా కనబడుచున్న లలిత రాగమును, వేరువేరుగా పాడుకొని ఆనందించెడు అవకాశమును పోగొట్టుకొనవలసిన యవుసరము కానరాదు. ఈ రెంటికినీ ప్రాచీన సంప్రదాయము లుండనే యున్నవి. లలితకు స గ మ ద ని స । స ని ద మ గ రి స అన్నవి ఆరోహణావరోహణములు. ఇప్పుడు వాడుక యందుగల 72 మేళములలో 17వది యగు సూర్యకాంతమునకు ఇది జన్యము. ఇట్లే స గ మ ద ని స । స ని ద మ గ రి స అను ఆరోహణావరోహణములు గలిగి 15వ మేళమగు మాయామాళవగౌళ జన్యముగా వసంత నేడు వాడుకలో నున్నది.

అన్నమయ్య వారి రచనలు 17వ మేళమగు సూర్యకాంత జన్యముగా నుండెడి లలిత యందే స్వర పరుపబడినవి.

**లలిత — ఆది**

అంతర్యామీ అలసితి సొలసితి
ఇంతట నీ శరణిదె చొచ్చితిని ॥పల్లవి॥

కోరిన కోర్కులు కోయనికట్లు
తీరవునీవవి తెంచక
భారపు పగ్గాలు పాపపుణ్యములు
నేరుపుల బోనీవు నీవు వద్దనక ॥అంత॥

జనుల సంగముల జక్క రోగములు
విను విడువవు నీవు విడిపించక
వినయపు దైన్యము విడువని కర్మము
చనదది నీవిటు సంతపరచక ॥అం త॥

మదిలో చింతలు మయిలలు మణుగులు
వదలవు నీవని వద్దనక
యెదుటనె శ్రీ వేంకటేశ్వర నీవదె
అదన గాచితివి అట్టిట్టనక ॥అంత॥

అ : 11-167

ప. - సా - సా - స ని ద ని ద మ । - గ మా ద మా । మ గ సా రి స ॥
- అం - త - ర్యా - - - మి వి । - అ ల సి తి । సొ - ల సి తి ॥

- స మా గ మా దా ద మ । - ద నీ స రీ । రి స నీ సా ॥
- యిం - త ట నీ శ ర । - ణి దె జొ - । చ్చి - తి నీ ॥ ॥అంత॥

చ. - మ మా మా - ద మ గ స రి స । - స రీ స నీ । స ధ నీ స స ॥
- మ ది లో - చిం - - - త లు । - మ యి ల లు । మ - ణు గు లు ॥

- స మా గ మా ద మ ద ని । స రి స ని ద ని ద మ । గ మ గ రి సా ॥
- వ ద ల వు నీ - వ ని । వ - - - ద్ద - న - । క - - - - ॥

- ద మా గ మా ద ని స ని । స రి గ మ గ రి స ని । స ద నీ స స ॥
- ఎ దు ట నె శ్రీ - వేం క । టే - - - శ్వ - రు - । నీ - - వ దె ॥

- స నీ ద ద ని ద మ గ మ । ద ని స రి స ని ద మ । గ మ గ రి స మ గ మ ॥
- అ ద ను గా - - చి తి వి । అ - - - ట్టి - - - । ట్టి - న - క - - - ॥

ద ని
- - ॥అంత॥

**అవతారిక :**

సూర్యచంద్రుల ఉదయాస్తమయములను చూచుచునే యున్నాము పుట్టుటలు, గిట్టుటలు, సంసారమునందలి అనుభవములు, వ్యవహారములు జరుగుచునే యున్నవి. అర్థార్జన కొరకు అడుగనివి, చేయనివి, తిరుగనివి లేనే లేవు మరణము, రోగము, ముదిమి అనుభయ ములతో నిండియున్న దేహమును మోసుకొని అధికులమని విర్రవీగుచునే యున్నాము. ఇప్పుడు వేంకటపతి సన్నిహితులమై వెనుకటి విధము మరచి హరిదాసులమై తరించు చున్నామని అన్నమయ్యవారు అనుచున్నారు.

పాప భీతి కలిగి అనిత్యమగు దేహమును నమ్మి చెడక భగవద్భక్తిని పొంది తరించుట జీవులకు కర్తవ్యమని అయ్యవారి బోధ.

**లలిత — ఆది**

అతడే యెరుగును మము బుట్టించిన యంతరాత్మయగు నీశ్వరుడు
అతికీ నతుకదు చిత్తశాంతి యిదె ఆత్మవిహారం బిక నేదో ॥పల్లవి॥

కనుచున్నారము సూర్యచంద్రులకు ఘన వుదయాస్తమయములు
వినుచున్నారము తొల్లిటివారల విశ్వములోపలి కథలెల్లా
మనుచున్నారము నానాటికి మాయల సంసారములోన
తనిసీ దనియము తెలిసీ దెలియము తరువాతి పనులిక నేవో ॥అతడే॥

తిరిగెదమిదివో ఆసలనాసల దిక్కుల నర్థార్జన కొరకు
పొరలెదమిదివో పుణ్యపాపముల భోగములందే మత్తులమై
పెరిగెద మిదివో చచ్చెడి పుట్టెడి భీతిగలుగు దేహములోనే
విరసము లెరగము మరచీ మరవము వెనకటి కాలము విధియేదో ॥అతడే॥

అల్లెనారము హరినుతిచే నాలిడి (డి బోవక) గురు వసుమతిని
పట్టినారమిదె భక్తిమార్గమిదె (ముని) బలువగు విజ్ఞానముచేత
గట్టిగ (శ్రీ) వెంకటపతి శరణని కంటిమిదివో మోక్షము తెరువు
నుట్టిముట్టము పట్టీపట్టము ముందటి కైంకర్యం బేదో ॥అతడే॥

అ :11—147

ప. స మ గ మ గ రి రి స | స ని̣ ని̣ ధ̣ | ని̣ స స ||
అ త డే - యె రు గు ను | మ ము ఖ - | ట్టిం చి న ||

సా ని̣ సా రి స ని̣ | ని̣ ధ̣ స ని̣ | సా - - ||
అం త రా త్మ య గు | నీ - శ్వ రు | డు - - ||

స గ గా గ మ మ మ | గా మ మ | ద ద ద మ ||
అ తి కీ న తు క దు | చి త్త శాం | - తి యి దె ||

మ గ మ ద మ గ గ రి | స ని̣ ధ̣ ని | సా - - ||
ఆ - త్మ వి హా - రం - | బి క నే - | దో - - || ||అతడే||

చ. గ గ మ మ గ గ రి రి | స స రి స | స ని̣ ధ̣ ధ̣ ||
అ - ల్లై - నా - ర ము - | హ రి ను తి | చే - నా - ||

ధ̣ ధ̣ స ని̣ స రి స ని̣ | స స రి రి | సా - - ||
అ డి గు రు వ ను మ తి | నీ - - - | - - - ||

ప గ గ గ గ మ మ మ | గ గ మ మ | ద ద ద మ ||
ప - ట్టి నా - ర మి దె | భ - క్తి మా | - ర్గ మి దె ||

గ గ మ మ గ గ రి రి | స స మ గ | మా - - ||
బ లు వ గు వి - జ్ఞా - | న ము చే - | త - - ||

గ గ మ మ దా ద ద | ద ని ని ని | ద ద ద ద ||
గ - ట్టి గ (శ్రీ) వెం - | క ట ప తి | శ ర ణ ని ||

గా మ మ ద ద ద మ | ద ద ని ని | సా̇ - - ||
కం టి మి ది వో మో - | క్ష ము తె రు | వు - - ||

స̇ ని స̇ స̇ మ̇ గ̇ రి̇ స̇ | ని ని సా̇ | ని ని ద ద ||
మ - ట్టీ - ము - ట్ట ము | ప - ట్టీ | ప - ట్ట ము ||

ని ని స̇ స̇ ని ద ద మ | గ మ గ రి | సా - - ||
ముం - ద టి కైం - క - | ర్యం - బే - | దో - - || ||అతడే||

**అవతారిక :**

అశాశ్వతములగు బంధములలో తగులుకొని మానవులు అలమటించు చుందురు. ఇతరులు తిరుచుండుట చూచి, పరుల భోగ భాగ్యములను చూచి, రూప సౌందర్యాదులను గాంచి, స్పర్శసుఖాదుల నాశించి, దుఃఖములను కొనితెచ్చుకొందురు. వారి వారికి కలిగినంత వారి వారి దేహములు అనుభవములు వుండగా, తృప్తి నొందక, శ్రీహరిదాసులై తరించక, ఇంద్రియములకు దాసులై ఏల తిరుగుచుందురు? హరిదాసులను ఇంద్రియము లేమియును చేయజాలవు కదా !" అని అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

**లలిత — రూపకం**

పని వడి యింద్రియాలే పరువులు వెట్టు గానీ
ఎడయని చుట్టరికా లెవ్వరికీ లేవు ॥పల్లవి॥

వన్నె సతుల రూపులు వారి వద్దనె నుండగా
కన్నుల జూచే వారికి కళ రేగును
ఎన్ని వారి గుణా లెడ మాటలాడ గాను
విన్న వారికి వూరకేను వేడుకలు బుట్టు ॥పని॥

అంతా నింతా గమ్మవిరులు అంగళ్ళలో నుండగా
సంత వార లూరకే వాసన గొందురు
బంతి వారి కంచాలలో, పలురుచు లుండగాను
వింత వార లందుకు గా వెస నోరుదురు ॥పని॥

వెరవిడి దేహాలు వేరె వుండగాను
సురతాన సోకితేనే చొక్కుదురు
ఇరవై శ్రీ వేంకటేశు యిన్నిటికీ సూత్రధారి
నరి నితనీ దాసులు జడియ రిందుకును! ॥పని॥

ప. స ని స రీ రి || సా ని దా ద || గ గ మ దా మ ||
ప ని వ డి - || యిం ద్రి యా లె || ప రు వు లు - ||

గా రి సా ని || స మ గ మా మ || ద ద ని దా మ ||
వె ట్టు గా ని || ఎ డ య నీ - || చు ట్ట రి కా లు ||

మ గ మ దా - || స ని స రి సా ||
ఎ వ రి కి - || లే - - - వు || ||పని||

చ. స మ గ మా - || దా ద ద మ మ | ద స ని దా మ || మ గ మా మా - - ||
వె ర వి డి - || దే - హా - లు | వే - రె వుం డ || గా - - ను - - ||

గ మ దా ద మ || దా ని సా ని | ద మ ద ని స రి || రి స నీ సా - - ||
సు ర తా - న || సో కి తే నె | చొ - క్కు దు రు - || - - - - - - ||

స మ గా రీ - || స ని దా ని స | ని స ని ద ద ని || దా మ గా మ ||
యి ర వై (శ్రీ) - || వేం క టే శు డు | ఇ - న్ని టి కి - || సూ త్ర ధా రి ||

స మ గ రి సా || స ని ధ ని సా - | స మ గ మ ద మ || ద ని స రి స ని ||
న రి ని త నీ || దా - - సు లు - | జ డి య రిం - దు || కు - - - - ను ||
||పని||

**అవతారిక :**

శ్రీ వేంకటేశ్వరుని అలంకార శోభను వర్ణించుచు సహజములగు సౌందర్యము లన్నియు స్వామికి కై కేసిన సేతలముందు దిగదుడుపులాయెనని ఉపమాలంకారమును అత్యంత సుందరముగ నుపయోగించుచు అయ్యవారు, ముత్యముల వానలు కురిసినట్లు మజ్జనము చేయించి రనియు, తెల్లని మేఘములు చుట్టుకొన్నట్లు కప్పురములు జల్లిరనియు, నీలపు దట్టు పుణుగు లలది రనియు, అది నీలపు మణుల పేరులు స్వామికి చుట్టినట్లున్నదనియు, మెరపు తీగెవలెనుండు నట్లు సొమ్ములెన్నిటినో అలంకరించిరనియు, నవ రత్నములు రాసులు పోసినట్లు పుష్పహారము లను అమర్చిరనియు, ఇన్నిటికి మించినదగు అలమేలుమంగను ఉరమునందు బెట్టిరనియు చెప్పుచు, కన్నుల పండువైన ఆ స్వామి సౌందర్యమును వర్ణించుచున్నారు.

**లలిత — రూపకం**

మహిమెల్ల దొప్పదోగె మజ్జనవేళ
సహజ శృంగారాలు జడిసె శ్రీపతికి ॥పల్లవి॥

ముత్తేల వానలెల్ల ముంచి కురిసిన యట్టు
హత్తి పన్నీట జలకమాయ హరికి
తత్తరాన దెల్ల మొయిలు తను బొదిగిన యటు
కొత్తగా గప్పుర కాపు గుప్పిరి దేవునికి ॥మహి॥

నీలపు చేరులెల్లా నిండా గట్టిన యట్టు
తేల దట్టు పుణుగు మెత్తిరి పతికి
అలరు మెరుగు దీగె లలము కొనిన యట్టు
కోలు ముందై సొమ్ములెల్లా గుప్పిరి విష్ణునికి ॥మహి॥

పెక్కు నవ రత్నములు పెద్ద రాసి వోసినట్టు
యెక్కువ దండలు గట్టిరి మూరితికి
వొక్కట నలమేలుమంగ నురమున గట్టిరిదె
చిక్కని నవ్వులు మించె శ్రీ వేంకటేశునకు! ॥మహి॥

శృం : 23-531

(ఇది పెద తిరుమలాచార్యులవారి రచన)

ప. గ మ దా మా ॥ గా మ గా రి ॥ సా ని ధ స ని ॥
మ హి మె ల్లా ॥ దొ ప్ప దో రె ॥ మ జ్జె న - - ॥

స గ రి సా - ॥ గ మ దా ద మ ॥ ద ని సా స ని ॥
వే - - శా - ॥ స హ జ శ్శం - ॥ గా - రా లు - ॥

ద ని ద మ గ మ ॥ గ రి స రి గా ॥
జ డి సె - (శ్రీ) - ॥ ప తి కి - - ॥ ॥మహి॥

చ. సా సా స ని ॥ దా ని దా మ ॥ గ మ దా ద మ ॥ ద ని సా సా ॥
ము త్తే ల - ॥ వా న తె ల్ల ॥ ముం - చి కు రి ॥ సి ని య ట్టు ॥

ని స గ గ మ గ ॥ రి స రి స స ని ॥ దా మ ద నీ ॥ సా - - - - ॥
హ - త్రి ప - - ॥ స్ని - ట జ ల క ॥ మా య హా రి ॥ కే - - - - ॥

సా గ రి స ॥ నీ రి స స ని ॥ ద ద ని ని ద మ ॥ ద ని ద దా - ॥
త త్త రా న ॥ తె ల్ల మొ యి లు ॥ త ను పొ ది గి న ॥ య - టు - - ॥

మా స ని దా ॥ ని ద మా మా ॥ గా మ మ గా ॥ రి రి స రి గా ॥
కొ త్త గ క ॥ ప్పు ర కా పు ॥ గు ప్పిం ం దే ॥ పు ని కి - - ॥ ॥మహి॥

**అవతారిక :**

ఇందలి నాయిక విరహోత్కంఠిత. ఈమె చేష్టలను నాయకునికి చెప్పుచు "నీవు లేకున్న మా చెలి మాటలే యాడదు. విడెములే యొల్లదు. నిద్దురేపోదు. ఆమె యౌవనమెల్ల మీదుకట్టి నీకై తపస్సు చేయుచున్నది. ఓ శ్రీ వేంకటేశ్వరుడా ఆమెను పలుకొనరావయ్యా!" అని సఖి వివరించుచున్నది.

**లలిత — రూపకం**

ఎంత మీదు కట్టెనో యింతి నీకు జవ్వనము
కాంతుడ వేమి సేసితో కానుకలంపె చెలి ||పల్లవి||

నిద్దరించవలసినా నీ కౌగటనే కాని
వొద్ద నిన్ను బాసి వొంటినొల్లదు చెలి
కొద్దిగా మాటాడినాను కోరి నీతోనే కాని
ముద్దరించి పరులతో మోసమే చెలి ||ఎంత||

ఆరగించవలసినా అటు నీ పొత్తునగాని
వూరకే వేరైయైతే నొల్లదు చెలి
సారె విడెమిచ్చినాను సగమాకు నీ కియ్యక
చేరి వేరే తమ్ములము చేయదు చెలి ||ఎంత||

కొమ్మ పయ్యద గప్పినా గూడ నీతోగాని
వుమ్మడి దనంతనైతే నొల్లదు చెలి
యిమ్ముల శ్రీ వేంకటేశ యింతలో గూడితిగాని
బమ్మర వెట్టినా నీకు బాయదు చెలి! ||ఎంత

శ్ర్యం : 26—144

ప.  స రి సా స ని || ద ని దా మా || గ మ మ గ రి సా ||
ఎం త మీ దు - || క - ట్టె నో || యిం తి నీ - - కు ||

స ని స రి రి స సా ||
జ వ్వ న - ము - - ||

ధ ని స రి స ని || స మ గా మ మ || ద ని స రి స ని ద మ ||
కాం తు డ - వే - || మి - సే సి తో || కా ను క - - - లం - ||

గ మ ద మ ద ని సా ||
పె - - - జె - లి ||                    ||ఎంత||

చ.  ద స ని దా మా || గ మ మ గ రి సా || స ని ధా సా - ని స స ||
ని ద్ద - రిం చ || వ ల సి - - నా || నీ - - కా - - గి ట ||

మ గ మ ద మ మా || గ మ దా ద మ || ద ని స రి స ని ||
నే - - కా - ని || వొ ద్ద ని న్ను - || బా సి వొం - టి - ||

ద మ ద స ని రి || సా - - - - ||
నో - ల్ల దు - చె || లి - - - - ||

స మ గా రీ || స ని స రి స స || ద ని స రి స ని || ద మ గ మ దా ||
కొ ద్ది గా మా || టా - - - డి న || కో రి ని - తో - || నే - కా - ని ||

గ మ ద ని స రి స ని ద మ || గ మ ద మ గ రి సా ||
ము ద్దిరిం - - - చి - - - || ప - రు - ల - తో ||

ధ ని సా స గ మా గ మ దా || గ మ ద ని స రి స ని ద మ ద ని ||
మ్మో - స మ్మే - - - - - || చె - ళి - - - - - - - - - ||  ||ఎంత||

**అవతారిక :**

ఇందు ముగ్ధ, విరహోత్కంఠిత యగు నాయిక చేష్టలను చెలులు నాయకునికి విన్నవించుచున్నారు. "ఆమెను ఆరగింపజేయు సఖి భోజనమిడగా, పరాకున నుండి ఆమె చెలిపై యొరగినదట! కప్పురపు విడెమియ్యగా, కడకంటనైన చూడదట. తొలగిన కొంగునైన సరిచేసుకొనదట! ఈమె చేష్టలకు అర్థములు తెలిసిన ఓ శ్రీ వేంకటేశ్వరా! నీ పాదములపై ఒట్టిడుకొని చెప్పుచున్నాము. ఈమెను పాలించుటకు నీవే దిక్కు!" అనుచున్నారని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

భైరవి రాగము అతి ప్రాచీనము. భాషాంగము. రక్తిరాగము. 'ప ద ని సా' అనునప్పుడు చతుశ్శ్రుతి ధైవతము, 'స ని ద పా' అనునప్పుడు శుద్ధధైవతము పలుకును. ఇది సంపూర్ణ సంపూర్ణము. వెంకటమఖి సంప్రదాయమున గల భైరవికిని, క్షేత్రజ్ఞులవారి పదములలో గల భైరవికిని, పెద్ద తేడాలు లేవు. గంభీర ప్రకృతి గల యీ రాగము ప్రాచీనుల కాలము నుండి నేటివరకును ఇంచుమించు ఒకే విధముగా కనబడుచున్నది.

**భైరవి—త్రిపుట**

వనిత భాగ్యంబు దేవరచిత్తము మాకుం
బనిగాదు యింక నీ పాదంబులాన ॥పల్లవి॥

అడబాల సతి బోన మారగించు మటంచు
బడి బడి నీ కడు విన్నపము సేయంగ
వుడుగని పరాకున వుండి నెచ్చెలి మీద
బడలి వొరగినది నీ పాదంబులాన ॥వనిత॥

అడపంబు సతి వీడె మవధరింపు మటంచు
అడరి కప్పురపుం బలుకందియ్యగా
కడ కంటం జూడదిదే కాంతాళమో మరపో
పడతి యిప్పుడు నీ పాదంబులాన ॥వనిత॥

ఆలవట్టము విసరు అతివలను వలదనదు
పాలిండ్లపై కొంగు సవరించదు
యేలాగౌనో వేంకటేశ నీ విపు డిట్టె
పాలించకున్న నీ పాదంబులాన ॥వనిత॥

శ్రృం : 3_23

ప. - - గ రి | సా - ని సా || రి - | గ రి రి స రి ||
1. - - వ ని | త - - ఖా || గ్యం - | బు - - - దే ||

గ రి రి స రి గ | మా పా ద ప || మ గ రి | గ రి రీ సా ||
- - - - వ ర | చి త్ర - - || ము - - | మా - - కు ||

2. - - గ రి | సా - ని సా || మ రి ప మ ద ప | మ గా రి రీ ||
- - వ ని | త - - ఖా || గ్యం - - - - - | బు - - దే ||

గ రి రి స రి గ | మ ప ద ప ని ని ద ప || ప ప మ గ రీ | గ రి రీ సా ||
- - - - వ ర | చి - - - త్ర - - - || ము - - - - | మా - - కు ||

3. - - గ రి | సా - ని సా || మ రి ప మ ద ప | మ గా రి రీ ||
- - వ ని | త - - ఖా || గ్యం - - - - - | బు - - దే ||

గ రి రి స రి గ | మ ప ద ప ద ని స రి || స ని సా - ప | ప ప మ గ రీ ||
- - - - వ ర | చి - - - త్ర - ము - || - - మా - - | కు - - - - ||

4. సా గ రి | సా - ని సా || రి గ మ ప ద ప | మ ప ద ని సా ||
- వ ని | త - - ఖా || గ్యం - - - - - | బు - - - దే ||

సా రి స స నీ ద గ రి | స ని సా పా - ద ద ప మా ||
- - - - - - వ ర | చి - - త్ర - - - - - ||

పా - ద ద ని స ప | ప ప మ గ రీ ||
ము - - - - - - - | మా - - - కు ||

సా స రి | సా - ధ ధ స ని ధ || ని సా రీ - | గ రి గ మ పా ||
- ప ని | గా - - దు - - - || యిం - క - | నీ - - - - ||

- - ద ని | సా రి స ని స స ప || ప ప మ గ రి స | రీ - ని సా ||
- - పా - | ద ం - - - - బు || లా - - - - - - | - - - న || ||వనిత||

చ. - - రి గ | మా ప ద నీ || ద పా | ప ద మ పా ||
- - ఆ - | ల వ - - || ట్టు ము | వి - స రు ||

- - ద ప | మ గ రీ || సా గ రీ ని | స స సా ||
- - అ తి | వ ల ను || వ - ల - | ద న దు ||

- - స రి | సా - ధ స నీ ధ || ధ స ని సా - | రీ - గ గ రి రి స ||
- - పా - | లిం - - డ్ల - - || పై - - - - | కొం - - గు - - - ||

రి స రి గ | మా పా ద ప || ప దా ద ప మ | పా - - ||
- - స వ | రిం - - - || చ - - - - | దు - - ||

- - ద | పా ద ప ప మ || పా - | పా - ద నీ ||
- - ఏ | లా గా - - - || నో - | వేం - - క ||

దా - నీ - | స స ని సా || స ని ద ప | ప ద మ పా ||
ఛే - శ - | - - - నీ || వి ఫు - - | డి - - ట్టై ||

— - ప | గ ఠి ఠి స ఠీ || ఠీ ప మ మ గా ఠి | సా - ని సా ||
— - పా | లిం - - - చ || కు - - - - - | న్న - - నీ ||

— - ప | స ని సా పా ద ప || స ని ద ప మ గ | రీ సా ||
— - పా | దం - - బు - - || లా - - - - - | - న || ||వనిత||

**అవతారిక :**

స్వాధీన పతికయు, రూప గర్వితయు, సంగీతము, కవిత్వము మొదలగు కళల యందు విదుషియునగు నాయికను పొగడుచు, "ఆమె కిన్నెర వాయించు చున్నది. నీపై పాటలు పాడుచున్నది. అద్దములో తన సౌందర్యమును చూచుకొని మురియు చున్నది. నీవు విచ్చేసితివి. నిన్ను జూచి కిన్నెరమీటుటను ఆపి, నీపై ఆమె పాడుచున్న పాటలకు నీ వద్ద మడుగగా నవ్వుచు మోమటు త్రిప్పుకొన్నది. ఇక మీద పనులు నీవు సూచుకొనవయ్యా!" అని చెలులు ఆ దివ్య దంపతులను మేలమాడుచు నాయకుడగు (శ్రీ) వేంకటేశ్వరునకు విన్నవించుచున్నారు.

భైరవి—ఝంపె

ఇట మీది కడ మెల్లా నిక నీవు దీర్చవయ్యా
పటుకున జెలి నీకు జాలుపెట్టీ నిదిగో ॥పల్లవి॥

నెలత మంచముపై కిన్నెర వాయించి వాయించి
తలకొని నీవు రాగా దలవంచెను
నొలసి చెలులతోడ సుద్దులు దా జెప్పి చెప్పి
చెలగి నీ మోము చూచి సిగ్గు వడీ నిదిగో ॥ఇట॥

పడతి నీ మీది పాట పాడి పాడి అర్థము నీ
వడిగితే నవ్వలి మోమై నవ్వీని
అడి యాలముల రూపు అద్దములో జూచి చూచి
కడు నీవు కొంగు వట్టగా భ్రమసీని ॥ఇట॥

సతి యేకతాన నుండి జవ్వాది పూసి పూసి
రతి నీవు గూడగా సరస మాడీని
ఇతవైన (శ్రీ) వేంకటేశ నీ వాపె గూడగా
పతి చూచి యిప్పుడిట్టె పకు్కన నవ్వీని. ॥ఇట॥

శృం : 26—95

ప. గ రి సా స | స ని రి స నీ ద || ప మ పా ప | ప ద నీ స ||
ఇ ట మీ ద | క డ ల - మె ల్ల || ని క నీ వు | తీ ర్చ వ య్య ||

ప ప గ రి రి స | స ని ని రి స ని దా ప ||
ఏ టు కు - - న | చె - లి - నీ - - కు ||

ప ప మ గ రీ రి స | రి స ని స రి గ మ ప ద ని ||
పా - - - లు పె - | ట్టి - - - ని - ది - వో - || ॥ఇట॥

చ. ప ద ప పా | ప ద ద ప ప మ మ || ప మ మ ని ని | ద ప ద మ ప ||
ప డ తి నీ | మీ ది పా - - - ట || పా డి పా - డి | అ ర్థ ము - నీ ||

గ మ ప పా ద ప | ప ప మ గ రి రి స ||
వ డి గి తే - - | న - వ్వు - లి మో - ||

రి ని స రి గ మ | పా - - - ||
మై - - న - వ్వి | ని - - - ||

ప మ పా ద | ని ద ని సా స ||
అ డి యా ల | ము - ల రూ పు ||

ద ని స రి స | రి మ గ రి సా స ||
అ ద్ద ము లో - | చూ - చి - చూ చి ||

ప ప గ రి రి స రీ | స స ని రి స ని ద ||
క డు నీ - - - వు | కొం గు - వ - - ట్ట ||

పా ప ప మ గ రీ | రి స ని స రి గ మ ప ద ని ||
గా భ్ర - మ - సీ | నీ - - - - - - - - - || ॥ఇట॥

**అవతారిక :**

ఇందలి నాయిక ప్రేమోత్కంఠిత. నాయకునియందు తనకు గల మక్కువను చెప్పుకొనుచు, "నీవు పరుసవేది వంటి వాడవు. నీ మహిమలు పొగడ గలనా? నీ నవ్వులు చూసినంతనే నా మనసు నందలి చీకట్లు మాయమగుచున్నవి. నీ చేయి సోకినంతనే నాయందుగల వలపులు పండుచున్నవి. నీ చూపులకు నా యందలి జవ్వనము పొంగులు వారుచున్నది. నీవు దయతో నన్నేలి నప్పుడు మన్మథ సామ్రాజ్యమే నాకు దొరకినట్లున్నది," అని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునికి ప్రేమతో విన్నవించుచున్నది

**రాగ లక్షణము :**

నాగగాంధారి ప్రాచీన రాగములలో నొకటి. మేళకర్తల ఆవిర్భావమునకు పూర్వమే కొన్ని రాగములు స్వతంత్రములగు స్వరూపములను సంతరించుకొని యున్నవి. మేళకర్తలు వెలసిన తరువాత ఈ రాగములకు జనక రాగములుగా ఆయా మేళకర్తలను పేర్కొని, లక్షణకారులు చెప్పుకొని యున్నారు. నారీరీతిగౌళ స్థానమున నటభైరవి నిర్ణయింపబడినది. నాగ గాంధారి—నటభైరవి జన్యముగా ఇప్పుడు వినబడుచున్నది. ఇందు యితర వాగ్గేయకారుల రచనలంతగా కనబడుటలేదు. తాళ్ళపాకవారి రచనలు తగు మాత్రముగా నున్నవి. స రి మ గ మ ప ద ని స । స ని ద ప మ గ రి స అనునవి అరోహణావరోహణములు.

**నాగగాంధారి — రూపకం**

ఇదివో నీ మహిమలు యేమని పొగడేమయ్యా
కదిసితేనే యినుము కనకమై మించెను ॥పల్లవి॥

నెలవి నీవు నవ్వితే చిత్తము చీకటి వాసె
వెలసెను నాలోని వేడుక లెల్లా
చెలిమిసేసి నాపై జేయి నీవు వేసి తేను
బలిమితో వలపుల పంటలెల్లా బండెను ॥ఇదివో॥

తప్పక నీవు చూచితే తనువుపై కాక మాని
వుప్పతిల్లె జవ్వనము వుదుటునను
కొప్పు దువ్వి నీవు నన్ను గొనగోరు సోకించితే
కుప్పళించి తమకపు కొటారులు నిండెను ॥ఇదివో॥

చేరి నీవు పలికితే సిగ్గులు మూలకొదిగి
కారుకమ్మె నెమ్మోమున గళలన్నియు
యీ రీతి శ్రీ వేంకటేశ ఇన్నిటా నన్నేలితివి
సారె నాకిట్టె మదన సామ్రాజ్యము వొచ్చెను. ॥ఇదివో॥

శృ : 25–246

ప. - రి మ పా ని ద పా || ప ద ని స ని ద మా పా ||
- ఇ ది వో నీ - - || మ - హి - మ - - లు ||

రి మ ప ద ప మ పా గ రి || స రి మా గ రి గా సా ||
ఏ - - - మ - ని పొ గ || డే - - మ - - య్యా ||

మ ప ద ప ద సా స || రి ని సా - - ||
క ది సి తే - - నే || ఇ ను ము - - ||

స రి మా గ రి సా || ని స ని ద ప మ రి మ గ రి సా ||
క - న క - మై || మిం - - - చె - ను - - - - || ॥ఇదివో॥

చ. - మ మ మ మా మ || ప ద మ ప మ గ రి స ||
- నె ల వి నీ వు || న - - వ్వి తే - - - ||

- స స ని ధ ప ధ ని స || రి మ మ గ రి రి స ||
- చి త్త ము - చీ - - - || క టి వా - - - సె ||

- స రి మ మా ప మ గ రి || స రి మా ప ద ప ద మ ప ||
- వె ల సె ను - - - - - || నా - - లో - - - - - ని ||

మ ప ద ని స ని ద పా ద మ || పా - - - - ||
వే - - - డు - క లె - - || ల్లా - - - - ||

- మ ప ని నీ స ని ద ప || మ గ రి మ పా ప ||
- చె లి మి చే - - - సి || నా - - - పై - ||

- రి మ ప ని ద పా ప మ || ప ద సా స ని సా స ||
- జే - యి నీ - - వు - || వే - - సి - తే ను ||

- స స రి స రి మా ప మ గ రి || స రి ని సా - ||
- బ లి మి తో - - - - - - - || వ ల పు ల - ||

- ప ద స రి గ రి స ని ద ప || మ ప ద ప స ని ద ప మ గ రి స ||
- పం - ట - - - లె - ల్లా - || బం - - - డె - - - - - ను - || ॥ఇదివో॥

**అవతారిక :**

అతి సులభమగు నానుడులతో కొండ కోనేటిపతి యగు శ్రీ వేంకటేశ్వరుని కొలిచి, పుట్టుట గిట్టుట వంటి వగు ఆపదలు పోగొట్టు కొనుటకు ప్రయత్నించవలెను గాని, క్షణికములగు సుఖముల నాశించి దుఃఖములను పెంచుకొను చున్నాడే జీవుడు" అని అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణం :**

శ్రీ రాగము పూర్వ ప్రసిద్ధములైన ఘనరాగములలో నొకటి. దీనిని వెంకటమఖి సంప్రదాయమున 22వ మేళముగా చెప్పుకొన్నారు. ఇప్పటి 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా దీనిని చెప్పుకొనవలసియున్నది. 'ప ద నీ' అను ప్రయోగము అక్కడక్కడ వచ్చునని పూర్వాచార్యుల మతము. మేళకర్తలు పుట్టుటకు పూర్వమే, యీ రాగము ప్రసిద్ధమై యున్నట్లు తోచుచున్నది. సంపూర్ణ సంపూర్ణములుగా నుండని రాగములు మేళకర్తలుగా ఎట్లు ఏర్పరుపబడినవో తెలియని కొన్ని రాగములిట్టివి యింకను కలవు. గంభీర ప్రకృతిగల ఈ రాగమును లలితములు, మృదు మధురములు నగు భావనములను వ్యక్తపరచుటకు అన్నమయ్యవారి యున్నారు. వీరి తరువాత క్షేత్రజ్ఞులు కూడా యీ రాగమున పదములు చెప్పియున్నారు.

**శ్రీ — చాపు**

కూడు వండుట గంజి కొరకా — తనకు
వేడుకలు గల సుఖము వెదుకుటకు గాక ॥పల్లవి॥

కుప్ప నురుచుట కసవు కొరకా — తనువు
గొప్ప యవుటిది మదము కొరకా
ఒప్పయిన వేడుకల నొరసి మనసు
నెప్పునకు రా దివియ నేరవలె గాక ॥కూడు॥

కొలుచు దంచుట పొట్ట కొరకా తా
గులజుడై మూఢుడౌ కొరకా
తలపోసి యిన్నిట దగిలి — మీదు
తెలిసి సుఖ దుఃముల దెలియవలెగాక. ॥కూడు॥

కొండ దవ్వుట యెలుక కొరకా — తా
గొండ యెక్కుట దిగుట కొరకా
కొండ(ల) కోనేటిపతి గొలిచి — తనకు
నిండి నాపదపెల్ల నీగవలె గాక ॥కూడు॥

అ : 11(2)–19

ప. మ రీ । మా మా ॥ ప ప ని । పా ప మ ॥
కూ- । డు వం ॥ డు - ట । గం జి ॥

రి గా । రీ - - ॥ స నీ । సా - - ॥
కొ ర । కా - - ॥ త న । కు - - ॥

ని సా । స ని సా ॥ ని సా । గ రి సా ॥
వే - । డు క లు ॥ గ ల । సు ఖ ము ॥

మ రి మ । ప ని ప మ ॥ రి గ రి । సా - - ॥
వె ద కు । ట . కు - ॥ గా - - । క - - ॥ ॥కూడు॥

చ. పా ని । ని ని ప మ ॥ మ మ ప । ప ప పా ॥
కు ప్ప । ను రు చు ట ॥ క స వు । కొ ర కా ॥

- - - । స ని ప మ ॥ పా ని । ని ని ప మ ॥
- - - । త ను వు - ॥ గొ ప్ప । య వు టి ది ॥

ప ని స । స స సా ॥ ి సా । మా మా ॥
మ ద ము । కొ ర కా ॥ ఒ పై్ప । న వే ॥

రి రి గ । రి రి సా ॥ - - - । ని ని సా ॥
డు క ల । నొ ర సి ॥ - - - । మ న సు ॥

నీ స । స ని పా ॥ ప ని ప । మా ప మ ॥
నె ప్పు । న కు రా ॥ ది వి య । నే ర వ ॥

రి గ రి । సా సా ॥
లె - - । గా క ॥ ॥కూడు॥

**అవతారిక :**

నల్లనివాడైన వేంకటాచలపతిని నీలమణి ప్రభలతో పోల్చుచు, యాదవుల కులమున వసుదేవుని యింట పుట్టినప్పుడును, యీ దేవుడు నల్లనివాడై యున్నాడు. ఇక్ష్వాకు వంశమున శ్రీరాముడై జన్మించినప్పుడును ఈతడు నల్లని వాడుగనే యున్నాడని స్వామిని చమత్కారముగా అన్నమయ్యవారు వర్ణించుచున్నారు.

శ్రీ—ఝుంపె

సకల సందేహమై జరుగుచున్నది యొకటి
ప్రకటింప జీవమో బ్రహ్మమో కాని ॥పల్లవి॥

వసుదేవు జఠరమను వర నిధికి జంద్రుడై
అసమాన గతి బొడమినాడీతడు
వసుధ జంద్రుడు నీలవర్ణుడేటికి నాయ
కసరెత్తి నునుగందు గలయ గొనబోలు ॥సకల॥

ఇన వంశమున లోకహిత కల్పభూజమై
అనఘుడై జనియించి నాడీతడు
ననుపైన సురతరువు నల్లనేటికి నాయ
పెనుగొమ్మలో చేగ పెరిగి రాబోలు ॥సకల॥

తిరు వేంకటాద్రిపై దెలియ జింతామణై
అరిదివలె బొడ చూపినాడీతడు
గరిమెనది యిపుడు చీకటి వర్ణమేలాయ
హరి నీలమణుల ప్రభ లంమి కొనబోలు. ॥సకల॥

అ : 11(2)—120

ప. పని । ససని ॥ నిప । పపమ ॥ పని । సరీ ॥ గరి । ససస ॥
సక । లసం - ॥ దే - । హమై - ॥ జరు । గుచు ॥ న్నది । యొకటి ॥

1. పని । సాస ॥ సా । రిరిని ॥ నీ । సనిప ॥ నినిమా । పా - ॥
ప్రక । టింప ॥ జీ । వమో - ॥ బ్ర । హ్మమో - ॥ గా - - । ని - ॥

2. పని । సరిగరి ॥ నిసరీ । నిరిసనిపా ॥
ప్రక । టిం - - ప ॥ జీ - - । వ - మో - - ॥

పనిసని । పామా - రి ॥ గరిరిస । రిమపా ॥
బ్ర - - - । హ్మమో - - ॥ గా - - - । ని - - ॥ ॥సకల॥

చ. నిని । నీని ॥ పప । నినిపమ ॥
వసు । దేవు ॥ జఠ । ర - మను ॥

రిమ । పపనిసా ॥ సనిపా । పపమ ॥
వన । నిధి - కి ॥ చం - - । ద్రుడై - ॥

మమ । పామ ॥ రిరి । గరిస ॥ రీ । మామ ॥ పా । పా - ॥
అస । మాన ॥ గతి । బొడమి ॥ నా । డీత ॥ డు । - - ॥

మమ । మపా ॥ నిని । పపమ ॥ మమ । మపమ ॥ నిని । పాప ॥
వసు । ధచం ॥ ద్రుడు । నీ - ల ॥ వ - । ర్ణదే - ॥ టికి । నాయ ॥

పని । సరిగరిమా ॥ రిగ । రీస ॥ నిస । రిరిసనిప ॥ నీ । సా - ॥
కస । రె - - - త్రి ॥ నును । గందు ॥ గల । యగో - న - ॥ బో । లు - ॥
॥సకల॥

**అవతారిక :**

పరమాత్ముడవగు నిన్ను తెలుసుకొనుట అందరికిని సాధ్యము కాదు. ఎటువంటి వారికి నిను తెలుసుకొనదగు జ్ఞానము కలుగుననగా, నిరత సత్యవ్రతులు, నియమ నిష్ఠాపరులు, నారీ కటాక్షములకు లోనుగాని వారును, భోగ భాగ్యములకు పరవశించనివారును, యోగ నిష్ఠా గరిష్ఠులును, భాగవత సేవా నిరతులును, భక్త జనులును, వేద వేదాంగ కోవిదులును, నీ యునికి, నీ పలుకు, నీ రూపము, నీ సన్నిధి తెలుసుకొనగలరుగాని - ఇతరులకు అది యెట్లు సాధ్యపడునని శ్రీ వేంకటేశ్వరునకు అయ్యవారు విన్నవించుకొనుచున్నారు.

శ్రీ — ఝుంపె

ఇతరులకు నిను నెఱగ దరమా ?
సతత సత్యవ్రతులు సంపూర్ణ మోహ విర
హితు లెఱుగుదురు నిను నిందిరా రమణా ||పల్లవి||

నారీ కటాక్ష పటు నారాచ భయ రహిత
శూరు లెఱుగుదురు నిను జూచేటి చూపు
ఘోర సంసార సంకుల పరిచ్ఛేదులగు
ధీరు లెరుగుదురు నీ దివ్య విగ్రహము ||ఇత||

రాగభోగ విదూర రంజితాత్ములు మహా
భాగు లెఱుగుదురు నిను బ్రణుతించు విధము
ఆగమోక్త ప్రకారాభి గమ్యులు మహా
యోగు లెఱుగుదురు నీ వుండేటి వునికి ||ఇత||

పరమ భాగవత పద పద్మ సేవా నిజా
భరణు లెఱుగుదురు నీ పలికేటి పలుకు
పరగు నిత్యానంద పరిపూర్ణ మానస
స్థిరు లెఱుగుదురు నిను దిరు వేంకటేశ. ||ఇత||

ప. - ప మా రి గ రి || ని̣ స రీ గ రి స ని̣ ఫ̣ ఫ̣ ||
1. - ఇ త రు ల కు || ని - ను - - నె - ఱ గ ||

ని̣ స రీ మ రి మ రి || గ రి సా - ||
త ర మా - - - - || త ర మా - ||

2. - ప మా రి గ రి || ని̣ స రీ గ రి స ని̣ ఫ̣ ఫ̣ ||
- ఇ త రు ల కు || - ని ను - - నె - ఱ గ ||

ని̣ స రి మ ప ని స̇ ని ప మ | రి గ రీ సా - ||
త - ర - మా - - - - - | త ర మా - - ||

3. - ప మా రి గ రి || ని̣ స రీ గ రి స ని̣ ఫ̣ ఫ̣ ||
- ఇ త రు ల కు || ని - ను - - నె - రు గ ||

ని̣ స రి మ ప ని నీ పా || స̇ ని ప మ రి గ రి స ||
త - ర - మా - - - || త - ర - మా - - - ||

రి గ రి ని̣ స రీ గ రి || స ని̣ ఫ̣ ని̣ స రి ||
స త త స - - - - || త్యా - - వ్ర తు లు ||

రి మ పా ప మ || ప ని స̇ రి̇ గ̇ రి̇ స̇ ||
సం - పూ ర్ణ - || మో - - - హా వి ర ||

స̇ ని ని రి̇ స̇ ని పా ప మ || రి గ రీ స ||
హి - తు - లె - రు గు - || దు రు ని ను ||

ప ని స̇ రి̇ గ̇ రి̇ స̇ రి̇ ని స̇ || ప ని మ ప రి గ రి స రి మ ||
ఇం - - - ధి - శా - - - || ర - ఘు - ణా - - - - - || ||ఇత||

చ. - ని సా రి గ రి || సా స ని స స ||
- నా - రీ - క || టా క్ష - ప టు ||

- ని సా రి గ రి || స ని ఫా ని స స ||
- నా - రా - చ || భ - య ర హి త ||

రీ మ ప ప || ని ని ప మ ప ప ప ||
శూ రు లె రు || గు - దు - రు ని ను ||

ప మ రీ గ రి రి స ని స || రి మ పా - ||
చూ - - చే - - - టి - || చూ - పు - ||

- మ మ పా || ప ని స ని ప ప ప మ ||
- ఘో ర సం || సా - - - ర సు - - ||

మ మ ప పా || ప ని స ని ప ప మ ||
కు ల ప రి || చ్ఛే - - - దు ల గు ||

- ప ని సా రీ గ రి || స ని ప ని సా ||
- ధీ - రు లె రు - || గు - దు రు నీ ||

- ప ని స రి ప మ రీ || గ రి రీ సా - ||
- ది - వ్య - వి - - || గ్ర - హా ము - ||

||ఇతి||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక విరహోత్కంఠిత, ముగ్ధ. ఈమె వెఱగు పడుట, కన్నీరు కార్చుట, తలయూచుట, మొదలగు చేష్టల వలన, నాయకుని యందు తనకు గల మోహమును సూచించు చున్నదే గాని, చెలులతో వా గ్రూపమున నేమియు చెప్పకున్నది. వారును ఈమె భావముల నూహించి నాయకునితో చెప్పుకొనుచున్నారు.

ఇందలి వాక్యముల తీరు, భావముల సొగసు, తెలిసి యానందించగల చిత్రకారుడే యున్నచో ఈ పదమే ఒక అద్భుతమగు వివిధ వర్ణచిత్ర సముచ్చయ మగునేమో యనిపించు చున్నది.

శ్రీ—ఝంపె

తెలియ దెవ్వరికిని దేవ దేవేశ యీ
నెలత భావ మెల్ల నీ వెఱుగు దికనూ ॥పల్లవి॥

నిలుచు దలయూచు గన్నీరు వాలిక గోళ్ళ
జినుకు నివ్వెఱగుపడు జింతించును
పులకించు నలయు దలపోయు నిను జిత్తమున
నిలుపు నంగన విధము నీ వెఱుగు దికను ॥తెలియ॥

కమలంబు చెక్కుతో గదియించు నెన్నుదుట
చెమట బయ్యెద దుడుచు సెలవి నగును
తమకంపు గోరికలు తరుణి యిదె నిను దాసి
నిమిష మోర్వగలేదు నీ వెఱుగు దికను ॥తెలియ॥

వెక్కసపు నును దురుము వెడవ దలనేరదు
చిక్కుదేరగ గొంత సిగ్గు వడును
ఇక్కువల దిరువేంకటేశ నిను గూడె నిదె
నిక్క మీచెలి వగల నీ వెఱుగు దికనూ! ॥తెలియ॥

శృం : 4—72

ప. - రి మ | ప ప మ రి || గ రి | స న్రీ || - ఫ ని | స రి గ రి || సా | స ని సా ||
- తె లి | య దె - - || వ్వ రి | కి ని || - దే - | వ దే - - || వే | శ - యా ||

- రి మ | ప ప మ రి || గ గ రి స | రి మ ప ప ||
- నె ల | త ఖా - - || వం - - - | బె - - ల్ల ||

1. ప ని స | స ని ప మ || రి గ | రి సా ||
నీ - - | వె - ఱు గు || ది క | ను - ||

2. ప ని స రి | గ రి స ని ప మ || రి గ | రి సా ||
నీ - - - | వె - రు - గు - || ది క | ను - ||

|| తెలియ ||

చ. - రి మ | ప ప ప || ని ని ప మ | ప పా - మ ||
- ని లు | చు త ల || యూ - - - | చు క - - ||

రి మ | ప ని ని ప మ || రి గ | రి స స ||
స్నీ - | రు వా - - - || లి క | గో - ళ్ల ||

- రి గ | రి సా || స ని ఫా | ని స స ||
- జి ను | కు ని || వ్వో - అ | గు ప డు ||

రి గ రి స | రి మ పా ప మ || పా | - - - ||
చిం - - - | తిం - - చు - || ను | - - - ||

- ప ప | పా ని ని ప మ || ప ని | స రి గ రి ||
- వు ల | కిం - - చు - || న ల | యు త ల - ||

సా | సఁ ని ప || నీ | సఁ సఁ సఁ ||
పో | యు ని ను || చి | త్త ము న ||

- గఁ రిఁ | సఁ సా || సఁ ని పా | ని సఁ ని సఁ ||
- ని లు | పు నం || గ - న | వి ధ - ము ||

ప ని సఁ రిఁ | గఁ రిఁ సఁ ని ప మ || రి గ | రి సా ||
నీ - - - | వె - ఋ - గు - || దిక | ను - ||

|| తెలియ ||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రౌఢ, స్వాధీ పతిక. నాయకుని పట్ల కోపమును నటించుచు, తన సౌందర్యాతిశయమున ఆతనిని యెట్లు స్వాధీనుని చేసుకొని తన వెనువెంట త్రిప్పుకొనగలదో చెప్పుకొనుచు ఆనందించు చున్నది.

శ్రీ — ఝుంపె

తనివి దీరక నన్ను తమకమున నెంతేని
చెనకేవు వద్దు నీ చిత్తమిక నోరి ॥పల్లవి॥

దంటవై నాచేత దలపించు కొనగ దొర
కొంటి వింక నిది నీకు కొలది బడునా
నటున నా ప్రియము నాటిలను నిన్ను నా
వెంట ద్రిప్పక నిన్ను విడుతునా వోరి ॥తనివి॥

గబ్బివై నావాలు గనుగొనల నవ్వులకు
సుబ్బేవు నీవు నీ వొడబడికల
నిబ్బరపు నా వలపు నెలకొన్నయపుడేని
అబ్బురంబగు గర్వమణచనా వోరి ॥తనివి॥

మెట్టుకొని నీవు నా మెఱుగు బయ్యెద చెఱగు
పట్టేవు నీకు నీ పరిణామమా
రట్టువై కూడితివి తిరువేంకటేశ్వరుడ
యిట్టట్టు నిన్ను బోనిత్తునా వోరి ! ॥తనివి॥

శృం : 4-38

అ. - ప మ పా ప ని సా || రీ గ రి సా స | - గ రి సా స రి || స ని పా నీ స ||
[illegible] త నీ వి తీ - - || ర క - స న్ను | - త మ కా న - || నె - - తే వి ||

- ప ని స రి గ రి || స ని ని రి స ని సీ ప ||
- చె న కే - - వు || వ - - - ద్దు - నీ - ||

- మ మ పా ని ని || ప మ రి గ రి స రి || మ
- చి త్త మి క - || నో - - - - - - రి || - ||తని||

చ. - మ మ పా - మ || రి గ రి స స | - గ రి సా స రి || స ని పా ని స స ||
- దం ట వై - - || నా - చే - త | - వ ల సిం చు - || కో - న గ దొ ర ||

- ప ని స రి గ రి || రి స నీ స | రి మ ప ని ని ప మ || పా - - - ||
- కొం - టి విం క - || ని ది నీ కు | కో ల ది బ - డు - || నా - - - ||

- ప మ పా ప ని సా || రీ గ రి స స స ||
- నం - టు న - - || నా - - ప్రి య ము ||

- గ రి సా స రి || స ని పా ని సా ||
- నా - టి ల ను || ని - - న్ను నా ||

- ప ని స రి గ రి || స ని ని రి స ని ని ప ||
- వెం - ట - ద్రి - || ప్పి - క - ని - - న్ను ||

- మ మ మ పా ని ని || ప మ గ రి రి స రి ||
- వి డు తు నా , - || ఓ - - - - - - రి || ||తనివి||

**అవతారిక :**

ఇందలి నాయిక ప్రేమోత్కంఠిత. "ఇంత వలపు గల దానను. నాకు కోపము లేటికే? అతడు దగ్గరకు రాగానే అన్నియు మరచి పరవశమగుదును. కన్నులతో జంకించెదను అతనిని కౌగిలింపక మానుదునా? అతడు చేరువైనప్పుడు నా సిగ్గులన్నియు మాయ మగును. ఇటువంటి దానను నన్నేలిన నా నాధునికి నా గుణములు తెలియవా"? అని తన మనోభావములను చెలికి చెప్పుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

కన్నడ గౌళ ప్రాచీన రాగము. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. మేళకర్తల పుట్టుపూర్వోత్తరమునకు ముందే ప్రచారమునకు వచ్చియున్న రక్తిరాగములలో కన్నడగౌళ యొకటి. మేళకర్తలు ఏర్పడిన పిదప ఇట్టి రాగములకు జనక రాగములు నిర్ణయింపబడినట్లు తోచుచున్నది. ఇటీవలి వాగ్గేయకారులు కూడ యీ రాగము నందు రచనలుచేసి యున్నారు.

ఆరోహణ : స రి గ మ ప ని స
అవరోహణ : స ని ద ప మ గ స

**కన్నడగౌళ—రూపకం**

ఇటువంటి దాన నాకేటి యలుకే
గట కట తా రాగా గా దనేనా నేను? ॥పల్లవి॥

మాటలాడ కుండు గాని, మనసు లోపల నైతే
నాటినది తన మీద నా చిత్తము
కాటుక కన్నుల జూచి కసరుదుగాని నేను
వాటపు వలపు మీద వంతుబో లోలోనే ॥ఇటు॥

దగ్గరి రాకుందుగాని, తా నన్ను నంటినప్పుడే
వెగ్గళించి సిగ్గులెల్లా వీడ గలవే
యెగ్గు వట్టి వుందుగాని, యేపాటి నవ్వించినాను
అగ్గలపు సరసము లాడుదుబో నేను ॥ఇటు॥

నివ్వెర గందితి గాని, నేడు నన్ను గూడ గాను
పవ్వళించి నప్పుడే పో పరవశము
యివ్వల శ్రీ వేంకటేశుడేక తమాయ నాతోను
జవ్వన భారము చేత జడిసీ బోతనువు! ॥ఇటు॥

శృం : 25_366

ప. - గ మ పా ప మ || - ని ద ప ని సా ||
- ఇ టు వం - టి || - దా - - - న ||

- స ని ని ద ద ప ప మ మ గ || గ స రి గ మా - - ||
- నా - కే - - - టి - _ - || య - లు - కే - - ||

- రి గ మ పా - || ని ద ద ప మా మ గ మా ||
- క ట క ట - || తా - - - రా - - గా ||

- ని స రి గ మా || ప మ గ గ స సా ||
- కా ద నే - - || నా - - నే - ను || ||ఇటు||

చ. - మ గ మ పా ప || మ గ ప మ గ గ స స ||
- మా - ట లా డ || కుం - - - డు గా - ని ||

- ని ధ ధ ధ ని ధ || నీ సా సా ||
- మ న సు లో - ప || ల నై తే ||

- ధ ని స రి గ మ మ || గ స రి గ మా ||
- నా - టి న - - ది || త న మీ - ద ||

- ప ని సా ని ద పా ప మ || పా - - - - ||
- నా - - చి - - త్త - || ము - - - - ||

- ప నిపనీ || సా సని సా సం ||
- కాటుకక || న్నుల - జూ చి ||

రి రి గ మ మ గ ప మ గా || సా నిస నిదపా ||
కస - రు దు - గా - - || ని నే - - - ను ||

- ప నిస రి గ మ గ స || రి గ స స ని స ని ద ప ||
- వా - టపు - - - - || వ - ల పు మీ - - - ద ||

- ప ని సా స ని ని ద ద ప || స ని ని ద ద ప ప మ మ గ గ స ||
- వం - తు బో - - - - - || లో - - - లో - - - నే - - - || ||ఇటు||

**అవతారిక :**

ఇది దలి నాయిక విరహోత్కం. నాయకుని చేతలకు తానెంత వ్యథ చెందెనను ఆతనిని బాయలేని ప్రేమచే, "నీవెంత చేసినను ఎట్లు చేసినను యౌవనవంతురాలనగు నేను నిన్ను బాయగలనా? ఇల్లాలినైన నాయందు నీ కరుణయుండుటయే నాకు చాలునులే! నిన్ను మాటలని దెప్పుటకు నాకు వశమా?" అని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునకు చెప్పుకొనుచు ఆతని కరుణకు అర్థించుచున్నది.

కన్నడగౌళ—రూపకం

లోకపు నీ చేతలకు లోనేకాదా
నీకు మారుకొని యుండ నేరుపా నాకు ? ॥పల్లవి॥

వుడి వోని జవ్వనము వొడిగట్టుకొని నీతో
పడిబెట్టి యలుగగ సంగతే నాకు
చిడిముడి కోరికలు చిత్తములో నుండగాను
తడిసి నిన్ను బాయగ తగునా నాకు ? ।లోకపు॥

వుప్పతిల్లు జన్నులు వురమున మోచుకొని
చిప్పిలనీ నేరాలెంచ జెల్లునా నాకు
ముప్పిరి మొగమోటలు మోముమీద నుండగాను
అప్పుడే నిన్నణకించ ననువా నాకు ? ॥లోకపు॥

నించుకొన్న జవ్వనము నిలువున బెట్టుకొని
చండసేసి పెనగగ సరవే నాకు
అండనే శ్రీ వేంకటేశ అంతలో నన్నేలితివి
అందుకాచి దూర దగ నవునా నాకు ? ।లోకపు॥

శ్రృం : 23—218

(ఇది పెదతిరుమలాచార్యులవారి రచన.)

ప. - రి గ । మ మ గ గ స ॥ ని ధ ప । ని ని సా ॥
- లో - । క పు - నీ - ॥ చే - - । త ల కు ॥

ని స । రి గ మా గా ॥ సా । - - - - - ॥
లో - । నే - - కా ॥ దా । - - - - - ॥

- స । స స ని ని ధ ॥ ధ ని పా । ని ని సా ।
- నీ । కు మా - - రు ॥ కో - ని । యుం - డ ।

రి గ మా । మ గ మా - ॥ ప మ గా । ప మ గా సా ॥
నే - - । రు - పా - ॥ నా - - । - - - కు ॥ ॥లోకపు॥

చ. - ప ప । ప పా - ॥ మా । రి గ మా ॥
- పు డి । వో ని - ॥ చి । వ్వ న ము ॥

- రి గ । మా పా ॥ ని ద ద ప । మా మ గ మా ॥
- వా డి । గ ట్టు ॥ కొ - ని - । నీ - - తో ॥

- ని స । రి గ మా ॥ ప ప । ని ప నీ ॥
- స డి । బె - ట్టి ॥ య లు । గ - గ ॥

- స । సా ని ద పా ॥ నీ । సా - - ॥
- సం । గ తే - - ॥ నా । కు - - ॥

- ని స । రీ - గ మా ॥ రి గ మా । మ గ గా సా ॥
- చి డి । ము - - డి ॥ కో - - । రి - క లు ॥

- సఀ । సఀ సఀ సాఀ ॥ గఀ సఀ ని ద । ప నీ సఀ ॥
- చి । త్తము లో ॥ నుం - - - । డ గా ను ॥

- ప ని । సఀ సాఀ సఀ ॥ ని స ని । ద పా ప ॥
- తడి । సి ని న్ను ॥ జా - - । య గ - ॥

మ ప । సఀ ని ని ద ద ప ప మ ॥ రి గ మా । గ గ సా ॥
త గు । నా - - - - - - - - ॥ నా - - । - - కు ॥ ॥లోకపు॥

**అవతారిక :**

ఇది నాయిక ముగ్ధ మానవతి. ఈమెను చెలి, "అతడు నీ కడకు వచ్చి విడె మియ్యగా ఏల వద్దందువే? ఉంగరములు మొదలగు ఆభరణములు ఇయ్యగా నీవు అలుకలేల చూపెదవే? నిన్ను కౌగిట నలమి కప్పురపు బాగాలు కొరికియ్యగా గైకొనక అలయింతురా? ఆతని వలపు చేతలను తెలుసుకొని ఆనందముతో ఒడబాటును చూపక వట్టి ముద్దరాలవలె నీ వేల యుందువే? పట్టపు దేవులలో మేటివైన ఓ అలమేలుమంగా! అతని చేతల కియ్యకొని ఆనందించవమ్మా!" అని బుజ్జగించి, లాలించి చెప్పుచున్నది.

**రాగ లక్షణము :**

మనోహరి ప్రాచీన రాగము. తాళ్ళపాకవారి రచనల తరువాత ఇది త్యాగరాజ స్వామివారి ఒక్క కీర్తనయే కనబడుచున్నది. నిజమునకు అతి మనోహరమైన ఈ రాగమునందు వాగ్గేయకారులు రచనలు చేయక యెందుకు వదలినారో తెలియదు. ఇది యిప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. స రి గ మ ప ద స | స ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములుగా త్యాగరాజస్వామి కీర్తనమునందు కనబడుచున్నవి. లక్షణకారుల గ్రంథములయందు ఈ రాగమును గురించిన చర్చ ఇంతవరకును కనిపించుటలేదు.

మనోహరి — ఝంపె

అలమేలు మంగవు నీ వన్నిటా నేరుపరివి
చలము లేటికి నిక సమ్మతించవే ! ॥పల్లవి॥

విడియము చేతికిచ్చి విభుడు వేడుక పడి
వొడి వట్టి పెనగగా నొద్దనకువే
వుడి వోని వేడుకతో నుంగరము చేతికిచ్చి
యెడయక వేడుకొనగా నియ్యకొనవే ! ॥అల॥

చిప్పిలు వలపు తోడ చెక్కులు నొక్కుచు మోవి-
గప్పుర మందియ్యగాను కాదనకువే
కొప్పు దువ్వి బుజ్జగించి కొసరి మాటలాడి
అప్పనము నవ్వగాను అట్లె కానిమ్మనవే ! ॥అల॥

యిచ్చగించి శ్రీ వేంకటేశ్వరుడు నిన్ను గూడి
మచ్చిక గాగిలించగాను మారాడకువే
పచ్చడము మీద గప్పి పట్టుపు దేవుల జేసి
నిచ్చలాన నేలుకొనె నీవూ గైకొనవే ! ॥అల॥

శృం : 25-31

ప. - ప మ పా ద । సా స స ద స ॥ - ప ద స స ద ప మ । రి గ గ రి రి స ॥
- అ ల మే లు । మం గ వు - నీ ॥ - వ - న్ని టా - - - । నే రు ప - రి ది ॥

- స ద స గ రి రి స । రి గ మ గ గ రి రి స ॥
- చ ల ము లే - - - । టి - కి - నిం - - క ॥

- రి గ మా పా ద స । దా ప మ పా - ॥
- స - మ్మ తిం - - । - చ - వే - ॥ ॥అలమేలు॥

చ. - రి గ మా పా - మ । మ రి గా గ రి రి స ॥
- వి డి య ము - - । చే - తి కి - - చ్చి ॥

- గ రి స స ధ స । స గ రి గ గ రి రి ॥
- వి భు డు వే - - । డు - క ప డి - - ॥

- ప మ పా ద । ప ద సా ద ప మ గ రి ॥
- పొ డి వ ట్టి । పె - న గా - - - ॥

స గ రి గ మ ప మ । పా - - - ॥ - ప ద సా రి । స గ రి గ గ రి రి ॥
వొ - - - ద్ద న కు । వే - - - ॥ - వు డి వో ని । వే - డు క తో - - ॥

- రి గ మా మ రి గ । గ రి రి సా స ॥
- ము - గ ర - ము । చే - తి కి చ్చి ॥

- ప ద సం రీం గం రిం రిం సం । ద ప మ గ రి ॥
- యె డ య క - - - - । వే డు కొ న గ ॥

స గ రి గ మా గ రి । సా గ రి గ మ పా ॥
ని - - - య్యా కొ న । వే - - - - - ॥

॥అలమేలు॥

**అవతారిక :**

ఇందలి నాయిక విరహోత్కంఠిత, స్వీయ, ముగ్ధ. ఈమెకు ఉపచారములు చేయుచు చెలికత్తెలు, "ఏమిమందులు వేసినను ఈమెకు సుఖము చేకూరదు. చిత్తజగురుడగు ఈమె నాథుని గొనివచ్చి ఆతనితో చికిత్స చేయించిననే ఈమె సుఖపడగలదు. మగువలకు వలపు తాపములయందు మగడుగాక మరేమి నుందు గలదు?" అని ఎకసెక్కెములాడుచు ఆమెను మేలమాడుచున్నారు.

**రాగ లక్షము :**

సైంధవి ప్రాచీన రాగము. భాషాంగము. ని స రి గ మ ప ద – ని ద ప గ రి స ని ధ అనునవి ఆరోహణావరోహణములు. ఇది యిప్పటి 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. 'పా ద ప మా' – 'పా ద మా' అనునప్పుడు శుద్ధధైవతమును 'పా మా' అనునప్పుడు అంతర గాంధారచ్ఛాయగల శుద్ధ మధ్యమమును పలికించుట సంప్రదాయము. 'రి ని సా రి గ మా' 'రీ గ మ రి గ సా' అనునవి తరచుగా వచ్చు ప్రయోగములు. వెంకటమఖి సంప్రదాయమున సంపూర్ణముగా యీ రాగము చెప్పబడి యున్నది. కాని వాడుకయందు నిషాదాంత్యముగనే కనబడుచున్నది. 'దేశాళం' అని తాళ్ళపాకవారి రచనలలో కనబడుచున్న రాగమునకు స్వరూపము తెలియవచ్చుటలేదు. కాని యీ రాగమునందలి రచనలు కొన్ని మనోజ్ఞములుగా నుండుటచే వీటిని సైంధవి రాగమున స్వరపరచడమైనది. సైంధవి రాగమునందు తాళ్ళపాక వారికి ఒక వంద సంవత్సరముల తరువాతి వాగ్గేయకారులైన క్షేత్రజ్ఞులవారి రచనలు కనబడుచున్నవి. దీనికి తాళ్ళపాకవారి కాలమునందు పేరేది యున్నదో తెలియుటలేదు. కాని ఇది ప్రాచీన రాగమనుట మాత్రము తథ్యము.

**సైంధవి — త్రిశ్రఏక**

ఏమి మందు గద్దె యింతులాల యీ
రామకు దిరుపతి రాముడే మందు ॥పల్లవి॥

వెలసెటి విరహాన వేగేటి యింతికి
చెలియలాల మనమేమి సేతమే
చలి వేడి వలపుల చవిగన్న యీపెకు
వలపించిన తన వరుడే మందు ॥ఏమి॥

పొది గొన్న తమకాన బొరలెటి కాంతకు
చెదరక మనమేమి సేతమే
పొదుటు గోరికల నొనరెటి యీపెకు
మదిలోపలి తన మగడే మందు ॥ఏమి॥

పొల్లవోని యాస బొరలెటి మగువకు
చెల్లబో మనమేమి సేతమే
కొల్లగా రతి నింతిగూడినా డీపెకు
నల్లని (శ్రీ) వేంకట నాథుడే మందు ! ॥ఏమి॥

శృ : 16(2)–108

( ఇది తాళ్ళపాక చిన తిరుమలాచార్యులవారి రచన )

ప. ని స రీ రి గ । మా గ రి సా ॥ సా స గ రి ని । సా - సా - ॥
ఏ - మి మం - । దు క - ద్దె ॥ ఇం తు లా - - । ల - యీ - ॥

సా పా పా । ప ప ని ద మా ॥ గ మ పా మా । గ రి సా - - ॥
రా మా కు । తి రు ప - తి ॥ రా - ము డే । మం - దు - - ॥ ॥ఏమి॥

చ. రి గ మా గ రి । స స రి ని సా ॥ ని స రి గ మా । గ రి గ రీ - ॥
వె ల సె టి - । వి ర హా - న ॥ వే - గె - టి । యిం - తి కి - ॥

స ప పా ని ద । ద మ మ గ రీ ॥ ని స రి గ మా ప మ । గ రి గ రి సా ॥
చె లి య లా - । ల - మ - న ॥ మే - మి - సే - - । - - - త మే ॥

స ప పా పా । ప ప ని ద మా ॥ ప ద ప ద ని ద నీ । ద ప మ గ రీ ॥
చ లి వే డి । వ ల పు - ల ॥ చ వి గ - - - న్న । యీ - పె - కు ॥

స ప పా పా ద ప । మ రి గ రి రీ ॥ ని స రీ - గ మా । గ రి గ రి సా ॥
వ ల పిం చి - - । న - త - న ॥ వ రు డే - - - । మం - - - దు ॥ ॥ఏమి॥

**అవతారిక :**

తినుటయు, తిరుగుటయు, పాప పుణ్యములు చేయుటయు, కంపులు ఇంపులు, కలవి, లేనివి ఊహించుటయు తప్ప వేరొక విధములేని యీ శరీరము కంతల బొంతవలె జీవుడు మోసి కొని తిరుగుచున్నాడే కాని, ముక్తిమార్గమును తెలుసుకొనలేకున్నాడు. శ్రీ వేంకటపతిని నమ్మి కొలిచిన వారికి జ్ఞానము, సుఖము మొదలగునవన్నియు కలుగుచున్నవి కదా అని అయ్యవారు యీ రచనయందు చెప్పుచున్నారు.

ఈ రచన 318వ రేకునను కలదు. అందు దీని రాగము 'దేసి', దేశాళం యొక్క లక్షణములుగాని సంపూర్ణ స్వరూపము గాని లభ్యముకానందున దీనిని, ఇతర దేశాళ రాగ రచనలను సైంధవిలో స్వరపరచడమైనది.

సైంధవి — ఆది

ఎన్నాళ్ళున్నా నిట్టె కదా
విన్నని వెరగులె వేడుకలాయ ॥పల్లవి॥

భువి నెట్టున్నా బోయేదే కా
చవులకు జవియగు శరీరము
ధ్రువమని యీ సుఖ దుఃఖ రోగములు
భవముల కిదియే బంధము లాయ ॥ఎన్నా॥

ఎంత వొరలినా నిదే తాగద
కంతల కంతల కాయమిది
బొంత దగులుచుక పొరలగ బొరలగ
సంత కూటములె సరసము లాయ ॥ఎన్నా॥

కైపుసేసినా ఘనమౌనే కా
పాపము బుణ్యము బైపైనే
యీ పుట్టుగునకు ఈ వెంకటపతి
దీపించగ బెను ధెరు వొకటాయ! ॥ఎన్నా॥

అ : 11(2)–59

ప. నీ సా సా స ని | సా రి గ | రీ - - ||
ఎన్నాళ్లు న్నా - | నిట్టైక | దా - - ||

మా ప ప ద ప ప మ | గ రి గ స | రి ని సా ||
వి న్న ని వె ర గు లె | వే - డు క | లా - య || ||ఎన్నా||

చ. స ప పా పా ప మ | ప ని ని ద | ద ప పా ||
భు వి నె ట్టు న్నా - | బో - యే - | దే - కా ||

మ మ ప ప ద ప మ మ | గ రీ గ | మా - - ||
చ వు ల కు చ వి య గు | శ రీ ర | ము - - ||

ప ని ని ద ద ప ప ప | ప మ ప మ | మ గ రి స ||
ధృ వ మ ని యీ - సు ఖ | దుః - ఖ రో | - గ ము లు ||

ని ని స స రి గ మా | గ రి గ స | రి ని సా ||
భ వ ము ల కి ది యే | బం - ద ము | లా - యె || ||ఎన్నా||

**అవతారిక :**

ఇందు నాయిక ప్రౌఢ. ఈమె "నేనేమి చేసినను, ఎట్లు చేసినను నీవు మ్రానువలె నిశ్చలుడవై యున్నావు కారణమేమి ? నాకడ వేసాలు వేసిన నీ కత లెల్ల నేనే పైకొని కూడిన యప్పుడు బైటపడినది." అని నాయకుని మందలించుచున్నది. ఇందు అయ్యవారు అనన్య సామాన్యమైన శృంగార సౌరభములను సరసమైన పదములతో చిత్రించినారు.

సైంధవి—చాపు

మీద మీద వలపెక్కె మేలు మేలోయి
చీదర రేచేవు నన్ను చెల్లు లేవోయి ॥పల్లవి॥

నిద్దురో నిచ్చెరగో నేనేమో చెప్పగాను
వొద్దనుండే వూకొనవు వోయి మేలోయి
పెద్దరికమో బీరమో బెట్టి పీడె మడిగితే
కద్దనవు లేదనవు గర్వమేలోయి ॥మీద॥

కాకలో వీకలో కడు నేను నవ్వినను
మాకు వలె నున్నాడవు మతక మౌనోయి
వేకమో వెరపో వేగనే జేయి వేసితే
కేకరించి ములిగేవు గేలి యేలోయి ॥మీద॥

ఆసలో వాసులో అండ నేను నిలుచుంటే
మేసుల గాగలించేవు మెత్తిలేవోయి
జాసతో శ్రీ వేంకటేశ పంతాన నన్ను గూడితి
వేసము లెల్లా దీరె నింతలాయ నోయి! ॥మీద॥

శృం : 26—91

ప. ప పా | ప మ గ రి || గ రీ | సా సా ||
మీ ద | మీ - ద - || వ ల | పె క్కె ||

ని సా | రి గ మా ప మ || గ రీ | గ రి సా ||
మేలు | మే - లో - - || - యి | - - - ||

ని సా | రి గ మ రి || గ రీ | గ రి రి స సా ||
చీ ద | ర - రే - || చేవు | న - - - న్నౌ ||

ని సా | రి గ మా || పా - | ప మ గ రి గ మ పా ||
చెల్లు | లే - వో || యి - | - - - - - - - ||

॥మీద॥

చ. - - మ | మా మా || ద ప ప మ గ | రి రి సా ||
- - ని | ద్దు రో || ని - - - - | వ్వే ర గో ||

- - ని | సా రీ || రి గ మా - రి | గ రి రీ ||
- - నే | నే మొ || చె - ప్ప - - | గా - ను ||

- - స | పా ప మ || గ రీ | గ రి స స ||
- - వ | ద్ద నుం - || డే - | వు - కొ న ||

స గ రి ని | సా సా || రి - గ మ | పా పా ||
వు - - - | వో యి || మే - - - | లో యి ||

- - ప | పా ప మ || ప ద ని ద నీ | ని ద పా పా ||
- - పె | ద్ద రి క || మో - - - - | చే - - ర ||

మా రి గ | మా పా ద ప || ఘ మ రి | గ రి రీ ||
మో జె - | ట్టి పీ డె - || మ డి గి | తే - - ||

- - స | ప మ ప ద ని ద || నీ ని ద | ద ప మ రి గ రి ||
- - క | ద్ద న వు - - - || - లే - | ద - - - న - ||

రీ ని | సా రి గ || మా ప మ గ రి | సా స రి గ మ ||
వు గ | ర్వ మే - || లో - - - - | - యి - - - || ||మీద||

**అవతారిక :**

**ఈ** పదము నందలి నాయిక మానవతి. నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని చిలిపి చేతలకు ఓర్వక, "నీవు వేయు పథకములు నాకు తెలియవా? ఇందరు సతులను ఒడబరచి వారిని వేధించనేల? ఊరకే యుండరాదా? మగువలను ఏలి గుంపులుగా జేసి తలలు వంచుకొనునట్లు చేయుట నీకు తగునా? ఊరకే యుండలేవా? నన్ను వేడుకొని నాతో నానందించి పువ్వులను వేసెదవేలా? నీకు పొద్దుపోక నీ కూరిమి సతులకు పోరులు పెట్టి ఆనందించుటయేనా నీ పని?" అని నాయకుని మందలించు చున్నది.

సైంధవి (దేశాళం)—రూపకం

ఇంతేసి మతకాలు నే నెఱుగనివా
పొంత నుండి నవ్వేవు పొద్దు వోదానీకు ॥పల్లవి॥

తాయకాణ లంతేసేల తగవు నడపరాదా
గారాపు నీ వెఱగని కల్ల వున్నదా
కూరిమి సతులమూక కూరిచి తలవంచేవు
పోరులేల పెట్టేవు పొద్దు వోదానీకు ॥ఇంతే॥

వొడ బరచగనేల వూరకే వుండగరాదా
తడవితిమా నీ వింతయు నేరవా
కడగడ లటుదొక్కి కమ్మినన్ను వేడుకొంటా
బుడికేవు నన్ను నీవు పొద్దు వోదా నీకు ॥ఇంతే॥

నివ్వెరగందగ నేల నిచ్చలాన నుండరాదా
జవ్వనపు నా చేత నీసలిగె కాదా
యివ్వల శ్రీ వేంకటేశ యిట్టె నిన్ను గూడితివి
పువ్వులనేల వేసేవు పొద్దు వోదా నీకు? ॥ఇంతే॥

శృం : 27–81

ప. ని స రి గ మా ప మ || గ రి గ రి సా ||
ఇం _ తే - సి - - || మ త కా - లు ||

గ రి ని స రి గ || మా - - - - ||
నే - నె ఱ గ ని || వా - - - - ||

ప ద ప ద ని ద నీ || ని ద ద ప మా ||
పొం త నుం - - - డి || న - వ్వే - వు ||

రి గ మా పా ద ప || మా ప మ గ రి సా ||
పొ ద్దు వో దా - - || నీ - - - - కు || (ఇంతేసి)

చ. ప ప పా పా || మా ప మ గ రి సా ||
తా రు కా ణ || లం తే - సే - ల ||

ని స రి గ మా ప మ || గ రి గ రి సా ||
త గ వు న డ - - || ప - రా - దా ||

ప ద ప ద ని ద నీ || ని ద ద ప ప మ ||
గా - రా - - - వు || నీ - వె ఱ గ ని ||

రి గ మ ప పా ద ప || మా ప మ గ రి సా ||
క - ల్లి - వు - - || న్న - - - - దా ||

ప ప పా ప ప || మా ప మ గ రి సా ||
కూ రి మి స తు || ల - - మూ - క ||

ని̣ స రి గ మా ప మ || గ రి గ రి సా ||
కూ రి చి - త ల - || వం - చే - వు ||

ప ద ప ద ని ద నీ || ని ద ద ప ప మ ||
పో రు లే - - - ల || పె - ట్టే - వు - ||

రి గ మ ప పా ద ప || మా ప మ గ రి సా ||
పొ ద్దు వో - దా - - || నీ - - - - కు ||

||ఇం తేసి||

**అవతారిక :**

ఇందలి నాయిక జాణ, ఖండిత. ఈమె నాధునితో "నీవు కావలెనన్న నేను వద్దంటినా? నిన్నేమైన గద్దింపులతో అడ్డుకుంటినా? నీ గుణములనేమైన దిద్దుటకు ప్రయత్నించితినా? నీ వద్ద నేనెట్లుండినను యుండితిని గాక, చలముతో నిన్నేమైన సాధింపవచ్చితినా? ఉన్నవి లేనివి కల్పించి తారుకాణలేమైన బెట్టితినా? అవ్వలయేమైన అనుకొని నవ్వుకొన్నానేమోగాని, నిలువునా నిన్ను ఏమైన అని నొప్పించితినా? పంతములాడి వంతులు వేసుకొని నిన్నేమైన భంగపరుప జూచితినా! నీవు నాకెంత చనవిచ్చినా ఇచ్చెదవు గాక నీ వెరుగవా? ఊరకున్న వారితో వూరే ఓపదు సుమా!'' అని తన నాధుడగు శ్రీ వేంకటేశ్వరుని కల్లబొల్లి మాటలను ఖండించి చెప్పుచున్నది,

సైంధవి (దేశాళం)—తిశ్రఏక

ఊరకున్న వారితోడ వూరునోప దెఱగవా
చేరినాతో సుద్దులెల్లా జెప్పేవు గాక

వద్దని నీతో నేను వాదులాడి చేనా ॥పల్లవి॥
గద్దించి యప్పటి నిన్ను గాదనేనా
తిద్ది నీ గుణాలు నేడు తీరుచ వచ్చేనా
వొద్దనే నీ వెట్టుండినా నుంటివి గాక ॥ఊర॥

చలపట్టి నిను నేను సాధించ వచ్చేనా
కలవి లేనివి తారు కాణించేనా
నిలువుకు నిలువే నిన్ను నేశా లెంచేనా
వెలినెంత నవ్వినా నవ్వితివి గాక ॥ఊర॥

పంతమాడి సారెసారె బంగించ దొరకొనేనా
వంతులకు నంతేసి వాసి పట్టేనా
యింతలో శ్రీవేంకటేశ యెనసితి విటునన్ను
యెంత చనవిచ్చినాను ఇచ్చేవుగాక !

శ్రృం: 27—161

ప.   పా ప పా మ | గా రి సా స || ని̇ ప రి గ | మ మ గ మా - ||
ఊ ర కున్న | వా రి తో డ || వూ రు నో వ | దె రు గ వా - ||

ప ని ద ప ద ప | మ ప మ గ రి గ || మ ప మ గ రి గ | సా సా - - ||
చే - రి నా - తో | సు ద్దు - లె ల్ల - || చె ప్పే - వు - - | గా క - - || ॥ఊర॥

చ.   రి గ రీ సా | రి ని̣ సా సా || ని̣ స రి గ మా ప మ | గ రి గ రి సా ||
వ ద్ద ని నీ | తో - నే ను || వా - దు - లా డి - | చే - - - నా ||

రి గ రీ సా | రి ని̣ స స స స || ని̣ స రి గ మా ప మ | గ రి గ రి సా ||
గ - ద్దిం చి | య - ప్ప టి ని న్ను || గా - ద - నే నా - | - - - - - ||

స ప పా పా | ప ద ప మా గ || రి ని̣ స రి గ రి | గా మా - - ||
తి ద్ది నీ గు | ణా - లు నే డు || తీ - రు చ వ - | చ్చే నా - - ||

ప ద ని ద సా | ని ద ద ప మ మ || రి గ మా ప మ గ రి | సా - - - - ||
వొ ద్ద నే - నీ | వె ట్టుం - - డి నా || నుం - టి వి - గా - | క - - - - ||

॥ఊర॥

**అవతారిక :**

ఇందు నాయిక ముగ్ధ. తన నాథునియందు గల ప్రేమాతిశయమున చెలులతో "నేను స్వామికి అడిగినప్పుడు ఆనందము నియ్యనిదాననా? నాకు ప్రేమలేఖ లంపుట, ప్రియములు చెప్పిపంపుట, కానుకలంపుట, దగ్గర వున్నప్పుడు పాదములంటి మ్రొక్కుట ఏల చేసేనమ్మా నా ప్రియమగు స్వామి? అందరి సతులలోను నన్ను ఎక్కువగా గౌరవించునని నాకు తెలుసునమ్మా!" అని చెప్పుకొనుచున్నది.

**రాగ లక్షణం :**

హిందోళము ప్రాచీన ప్రసిద్ధ రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 20వ మేళమగు భైరవి జన్యముగానున్నది. కాని కొందరు 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా కూడ పాడుచుందురు. 'ప్రాచీనమగు పాఠము ఇది' అని నిర్ణయించుటకు వీలు కాకున్నది. నిజమునకు దీనిని చతుశ్శ్రుతి ధైవతముతో పాడినచో ఒక సొంపు కనబడుచున్నది ప్రాచీనులు బహుశః ఇట్లే పాడియుండిరేమోనని తోచుచున్నది. హిందుస్తానీ సంగీత ప్రభావము కర్నాటక సంగీతముపై ప్రసరించిన కాలము నుండియే, ఈ రాగము మార్పు చెందినదా యను ప్రశ్నకు సమాధానము దొరకుటలేదు. తాళ్ళపాకవారి తరువాత దీనిని ఇటీవలి వాగ్గేయకారులు పాడియున్నారు. కాని మధ్యకాలపు రచయితల రచనలు ఇందు కానరాకుండుట వలన ఎట్టి నిర్ణయములు చేయుటకును వలనుపడకున్నది. ఇందలి తాళ్ళపాకవారి రచనలు 22వ మేళ జన్యముగా పాడదగిన హిందోళ రాగమునందే స్వరపరుపబడినవి.

**ఆరోహణ :** స మ గ మ ద ని స, **అవరోహణ :** స ని ద మ గ స

**హిందోళ — ఆది**

రమ్మనగా దనతో నే రానంటినా
చిమ్ముచు నింత ప్రియము చెప్పనేలెనాకు ॥పల్లవి॥

వెల్లవిరి దనమాట విననైతినా నేను
చెల్లబో నా కేల సేవ సేసీనె తాను
యెల్లవారి దా నేలీ నెవ్వరి బోలుదు నేను
బల్లిదుడు నా కేల బాతిపడీ దానూ ॥రమ్మనగా॥

చెప్పినట్లెల్లా నేను సేయకుండే దానా
అప్పటి లేక లేటికి నంపినె తాను
కప్పురపు పడిగల కాంతలు గాచు కుండగా
విప్పుచు నాకుగా నేల వేగించినె తానూ ॥రమ్మనగా॥

గక్కన దా గూడగాను కాదు గూడదంటినా
ముక్కు మోవ సాగి లేల మొక్కినె తాను
యెక్కువ శ్రీ వేంకటేశు డెనసె చా నన్ను నిట్టె
పెక్కు సతులలోననె పెద్ద సేసీ దాను ॥రమ్మనగా॥

శ్లో : 17—208

ప. గ మ ద ని సా గ స స ని । ద ని ద మ । గ మ గ స ॥
ర - మ్మ న గా - - - - । ద న తో - । నే - - - ॥

ని స ని ధా ని సా । మ గ గా । గ స సా ॥
రా - నం - టి నా । - - - । - - - ॥

సా ని ద నీ సా । - - మ గ । సా - - ॥
చి మ్ము చు నిం త । - - ప్రి య । ము - - ॥

ద ని స స ని ని ద మ ని । ని ద దా మ । గ గ సా ॥
చె - ప్ప నే - - లె నా - । కు - - - । - - - ॥ ॥రమ్మనగా॥

చ. మా ని ద మా - - । గ మ గా మ గ గా సా ॥
వె ల్ల వి రి - - । త న మా - - - ట ॥

ధ ని సా గ స ని స మ గ । సా మ గ । గా మా ॥
వి న నై - - - తి నా - । - నే - । - ను ॥

గా మ ద ని సా ని ద । ని ద మా । మా ద మ గా ॥
చె ల్ల బో - - నా - । కే - ల । సే - - వ ॥

స మ గ మ ని ద మా । గా మ గ గా । సా - - ॥
సే - - సీ - - సె । తా - - - । ను - - ॥

ద ని ద మా గ గ స । గ మ ని ద । నీ సా ॥
యె - ల్ల వా రి తా - । నే - లీ - । - నే ॥

స మ గ స ని గ స ని । దా ని స ని ద । ని గ సా ॥
ఎ - వ్వ రి బో - లు దు । నే - - - - । ను - - ॥

స గ స ని సా - - । ని ద ని ద । మా - - ॥
బ - ల్లి దు డ - - । నా - కే - । ల - - ॥

మ ని దా ని స ని ద మా । గ మ గా । సా - - ॥
శా - తి ప - డీ - - । తా - - । ను - - ॥

॥రమ్మనగా॥

**అవతారిక :**

ఇందు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుడు అన్యకామినులతో కలసి వచ్చిన చిన్నెలను గమనించియు, నాయిక కోపించుకొనక ఆతనిని లాలించి, పదములు పాడి, చేయెత్తి మ్రొక్కి, తన ప్రేమాతిశయమును వెల్లడిజేయుచు తన చేతలకు తానే సిగ్గునడునట్లు నాయకుని ఆదరించుటను చూచి చెలికత్తెలు నాయకుని మందలించుచున్నారు.

హిందోళ—త్రిపుట

నీ వేల సిగ్గుపడేవు నెట్టన దలవంచుక
భావించి భావించి నిన్ను బైకొని మెచ్చీని ॥పల్లవి॥

వాడలు దిరిగి నీవు వచ్చిన రాక చూచి
వేడుకలు వెదచల్లీ వెలది
జాడలతో నీ మోము చంద్రకళలు చూచి
వీడెపు నోటనే వేమారు బొగడీని ॥నీవేల॥

వుదుటు దమకమున వుండే నీ వునికి చూచి
కదిసి నవ్వులు నవ్వీ గలికి
పొదిగిన నీ శిరసు పువ్వులదండలు చూచి
యెదుట నిలుచుండి చేయెత్తి మొక్కీని ॥నీవేల॥

గక్కున వస్తా వచ్చి కౌగిట గూడగా చూచి
చెక్కులు నొక్కీ నిన్ను జెలియ
నిక్కి శ్రీ వేంకటేశుడ నీ మన్ననలెల్లా జూచి
పక్కన నీ మీదటి పదాలు పాడీని ! ॥నీవేల॥

శృం : 19–34

ప. - - సా | స ద ని ద మా || గ మ ద మ | మ గ గా సా - ని ||
- - నీ | వే - - - ల || సి గ్గు - - | ప - - డే - - ||

సా ధ ని | సా గ గ సా || గ మా | ద ని సా - ని ||
వు నె - | ట్ట న - - || త ల | వం - చు - - ||

గ గ సా ద ని | సా సా || స గ మ గ స | స స ని ద నీ ||
క - - భా - | విం చి || భా - విం - చి | - - - - ని ||

సా గ మ | ధ ని సా ని ద మా || గ మ గ స | గ మ ద ని ||
న్న పై - | కొ - - ని - - || మె - - - | చ్చి - ని - || ||నీవేల||

చ. - - మా | ని ద ద మా || గ మ ద మా | గ మ గ గ సా ||
- - గ | కు క్క - - న || వ స్త్రా - - | వ - - - చ్చి ||

- - ధ ని | సా గ గ స || గ మా | ద మ దా ని స ని ద ||
- - కొ - | గి ట - - || కూ డ | గా - చూ - - - - ||

మా ధ ని | స స గ గ స ని || సా ధ ని | స గ మా గ మ గ గ ||
చి చె - | కు క్క లు నొ - - - || క్కి ని - | న్న - - చె - లి - ||

సా స | గా మా || గ మ ద మ | దా - ని సా స ని ||
య ని | క్కి (శ్రీ) || వెం - క - | టే - - శు డ - ||

సా ద ని | సా గ స స స ని ద || ని స ని ద మా | దా - ని సా ||
నీ మ - | న్న - - న - - - || లె - ల్లా - - | చూ - - చి ||

- - సా | మ గ మ గ సా || గ గ స ని స | స స ని ద ని ని ||
- - ప | కృ - - - న || సి - - - - | మీ - - - ద టి ||

ని ని ద మ | ద ద మ గ మ మ గ స || గ మా | దా - ని సా - ని ||
ప - దా - | - - - - లు - - - || వా - | డీ - - - - - ||

గ గ సా సా | స ద ని ద మా ||
ని - - నీ | వే - - - ల ||

||నీవేల||

**అవతారిక :**

ముగ్ధ యగు నాయిక చేతలను నాయకుడైన శ్రీ వేంకటేశ్వరునకు ఆమె చెలి, విన్నవించుచు, "మీ ఉద్దండపు చేతలు కట్టిపెట్టుడు. మోవిచ్చి చేతులెత్తి మ్రొక్కిన యాపెకు మీయందు ప్రియముండదా? అంతకుమించి దగ్గరినచో కాలుచేతులు తాకి దేవరలు ఎక్కడ పవిత్రులగుదురోయని భయపడుచున్నది. కొలువులో తమరుండగా గోరింట పూవులను అందించి నది. ప్రియములేకున్న ఇట్టివి ఇత్తురా? పలుకబోయిన పలుకుల యందలి వ్యంగ్యములు ప్రియములౌనో అప్రియములౌనో ఎఱుగని ముద్దరాలు మా చెలి. తమకు ఆరతి పట్టి సర్వాంగ శోభలను అందించినది. అట్టి మా చెలి యందు తప్పులు పట్టుదురా? ఆమె ముగ్ధత్వమును ఎరుగని వారా తమరు?" అని నాయిక భావములను స్వామికి విశదీకరించుచున్నది.

**హిందోళ_రూపకం**

పెద్దలు మీ రంతేసి పెనగ నేల
పుద్దండపు నీ చేతలు వుట్టిబెట్టవయ్యా ॥పల్లవి॥

మోవిపండు గానుకిచ్చె మొక్కె నీకు జేతులను
సేవ లింకానేమి యాపె సేసునయ్యా
కావిరించి దగ్గరితే కాలుదాకు జేయి దాకు
దేవర వంటి నీ కంతేసి తగదయ్యా ॥పెద్దలు॥

గోరంట పూవంది ఇచ్చె కొలువున నిలుచుండె
పేరి యిచ్చకము లేమి పెంచునయ్యా
వేరె మాటలాడబోతే వెంగెమౌనో వెగటౌనో
ఆ రీతి దొరవు నీ కవి చెల్లవయ్యా ॥పెద్దలు॥

ఆరతిచ్చె నానాంగాల నన్నిటికి సమ్మతించె
కూరిమి నిన్నెట్లాను కొసరునయ్యా
యీరీతి శ్రీ వేంకటేశ యింపు లేదో సొంపులేదో
అరితేరినట్టి నీకు ఆస మానదయ్యా ! ॥పెద్దలు॥

శ్లో॰ : 27_91

ప. మ ద ని సా - || ని ద ని ద మా - గ మా ||
పె ద్ద లు మీ - || రం - - - - తే - - సి ||

స గ మా మ ద మ గ సా - ని || ని ధ నీ సా - - ||
పె - న గ - - - నే - - || - - - లా - - ||

- మ దా - ని స స || గ గ సా స ని ద ని స స ||
- వు ద్దం - - డ పు || నీ - - చే - - - త లు ||

స గ స ని స ని ద ని ద మ ద మ || గ మ గ స గ స ని ధ ని స గా ||
ఉ - - ట్టి - - బె - - ట్ట - - || వ - - - - - - - య్యా - - ||
||పెద్దలు||

చ. - ద ని ని ద దా మ || గా - మ ద మ గ మ గ గ ||
- మో వి పం - - డు || గా - ను - - కి - - చ్చె ||

- స స స గ మ గ స || గ గ స ని ని ధ నీ సా ||
- మొ క్క నీ - - - కు || జే - - - - తు ల ను ||

- ని ద సీ సా - || గ స గ మా మ || ద ని ద మా మ || గ మ గ గ మా - ||
- సే - వ లిం - || కా - - నే మి || యా - చె సే సు || న - - - య్యా - ||

- మ గ మ దా మ || స ని ద ని ని సా ||
- కా - వి రిం చి || ద - - గ్గ రి తే ||

- స గ మా గ మ గ గ స || ని స ని ని ద ని స స ||
- కా - లు దా - - - కు || చే - - - యి ద్దా - కు || ||పెద్దలు||

**అవతారిక :**

నేను తేటతెల్ల మగునట్లు నా గుట్టు చెప్పుకొనవలెనా? నీ యందు నాకు గల ఆశ తెలియని వాడవా? చేయిబట్టి చేరదీసిన వాడవు నన్నేలుకొనజాలవా? సేసవెట్టి సంతసించిన వాడవు నన్నేలు కొనజాలవా? సేసవెట్టి సంతసించిన వాడవు చెనకి నన్నేలక మానేవా? తమకము నాపుకొనజాలక వేడుకొనుచుంటినిగాని, నన్ను ఏలిన వాడవు నా యింటికి రాక మానేవా? శ్రీ వేంకటేశ్వరుడా! నీ యందు గల మక్కువ ఎక్కువై బ్రతిమాలుకొందునే గాక వేరేమి గలదు?'' అని అనురాగ పరవశయగు నాయిక నాయకునితో చేలన మొనరించుచున్నది.

**రాగ లక్షణము :**

రీతిగౌళ ఒకప్పుడు 20వ మేళకర్తగా భావించబడుచుండెడిది. కాని వక్ర సంపూర్ణ మగు దీనిని తరువాతి కాలమున మేళముగ భావింపక 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా ప్రచారమునకు తెచ్చియున్నారు. ఘనరాగ ఉత్తర పంచకమునందు గల రాగములలో నిది యొకటి. ఇందు సకృత్తుగా శుద్ధధైవతమును పలికించెడి సంప్రదాయమున్నదట. కాని ఇప్పుడు వాడుక యందు ఇది కనబడదు. తాళ్ళపాకవారే యిందు శృంగారపదములు చెప్పి యున్నారు. తరువాతి పదకర్త లెవ్వరును ఇందు పదములు చెప్పినట్లు తెలియవచ్చుటలేదు. స గ రి గ మ ని ని స | స ని ద ప ద ని ద మ గ స అనునవి ఆరోహణా వరోహణములు.

రీతిగౌళ — రూపకం

తెలిపి చెప్పేనంటే తేటతెల్లమి నాగుట్టు
కలసిన వాడవు కరుణించవయ్యా ॥పల్లవి॥

మోము చూచిన వాడవు మోహించక మానేవా
కోమలపు దాననై కొసరే గాక
చేముట్టిన వాడవు సేవగొనక మానేవా
దామెన కోరికలతో దమకించేగాక ॥తెలిపి॥

సేస వెట్టిన వాడవు చెనకక మానేవా
ఆసపడ్డదాననై యడిగే గాక
బాస యిచ్చిన వాడవు పైకొనక మానేవా
ఛే ఘాటి వలపుల జిమ్మిరేగే గాక ॥తెలిపి॥

ఝూడ నన్నేలిన వాడ వింటికి రాక మానేవా
జోడైన దాననయి సొలసే గాక
కూడితి విట్టె నన్ను గొబ్బున శ్రీవేంకటేశ
జాడెఱగక మానేవా చాటి చెప్పే గాక ||తెలిపి||

శృం : 24-323

ప. పప పా ని ద ద మ || మా ప మ గ రి రి గ రి స సా ||
తెలి పి - - చె - || ప్పే - - - - నం - - - శే ||

- ని స ని ఫ నీ || స స మ మ గ రి గ మ ||
- తే - ట - తె || ల్ల మి నా - - - గు ట్టు ||

- గ మ ని స ని ద మా || మ ని నీ సా - ని సా ||
- క ల సి - - - న || వా - - డ - - వు ||

- ని ద ని స ని ద ద మ || మా ప మ గ రి ని స గ రి || గ మ
- క రు ణిం - - - చ - || వ - - - - - - - - - || య్యా - ||తెలిపి||

చ. - స పా మా || గా ప మ గ రి రి గ రి స ||
- మో ము చూ || చి న - - - వా - - - ||

సా సా రి స ని సా || - ని ఫ నీ సా ||
డ వు - - - - || - మో - హిం చ ||

నీ సా మా ప మ గ రి || గా మా - - ||
క మా నే - - - - || వా - - - ||

- గ మ ని ని సా || ని ద ప ద ని స ని ద మా ప మ గ రి ||
- కో - మ ల పు || దా - - - న - - - నై - - - - ||

గా గ మ పా ని ప ప మ గ రి || రి గా రి సా - - ||
- కొ న రే - - గా - - - || క - - - - - - ||

- గ మ ని ని ప || - ని ని సా - ని సా ||
- చే - ముట్టి - || - న - వా - - డ ||

సా రి స ని ప ని సా || - ని సా గ గ ||
వు - - - - - - || - సే వ గొ న ||

మా - - గ రి || రి గా రి సా - - ||
క - - మా - || నే - - వా - - ||

- ని స గ రి సా || ని స ని స ని ద ద ని ద ని ద మ ప మ గ రి ||
- దా - మె న కో || రి - క - - - ల - - - - - - తో - - - ||

గ గ మ పా ని ప ప మ గ రి || రి గా రి సా - - ||
- ద మ కిం - - చే - - - || గా - - క - - ||

|| తెలిపి ||

**అవతారిక :**

ఇందలి నాయిక మానవతి, ప్రౌఢ. నాయకుని యందుగల అనురాగముచే, ఆతని దుడుకు చేతలను తెలిసిన దైనను, కటువైన మాట యన జాలని కోమలి. ''నెయ్యాని పోసుకోరాదు. నీళ్ళను చల్లగరాదు. జాము రాత్రి గడచిన వెనుక నీవు వచ్చి, నాయందనురాగము చూపు చున్నావు. ఎట్లు నీ కొడబడుదును! నీతో నవ్వుచు మాటలాడుదమని యత్నించినను నీవు పరాకున నుందువు. నీరాక కలయో నిజమో తెలియకున్నది. నా వలపు విచ్చల విడియాయె'' నని అనునయముగా శ్రీ వేంకటేశ్వరునకు విన్నవించుకొనుచున్నది.

**రీతిగౌళ — రూపకం**

నెయ్యాని పోసుకోరాదు నీళ్ళని చల్లగరాదు
చెయ్యార గంటిమి నేడు చేరి నీతో పొందుట ॥పల్లవి॥

ప్రేమము చాలా జేసి పెక్కు సతుల నీతోను
మోము చూడ సిగ్గువడి ముసుగుతో నున్నదాన
జాముపోయి వచ్చినీవు సరసములాడేవు
యేమని నేనియ్యకొందు నేటిజన్మమయ్యా ॥నెయ్యాని॥

పలుమారు నీతోనవ్వి పరాకై వుండిన నీతో
పలుకగ సిగ్గువడి భావింపుచు నున్నదాన
కలగన్నట్లా వచ్చి కందువలంటేవు నన్ను
బలిమి యేమున్నదీ నాబదుకు నీ చేతిది ॥నెయ్యాని॥

మచ్చికతో నిన్నుగూడి మన్నించిన నీతోను
పచ్చిసేయ సిగ్గువడి పదరక వున్నదాన
యెచ్చుగా శ్రీ వేంకటేశ యిట్టైనన్ను నేలితివి
విచ్చన విడాయ నా విభవము లెల్లను! ॥నెయ్యాని॥

శ్లం : 14—25

**ప.** పా ప స ని ద మా || గ రి గ రి సా ||
నె య్యా - ని - పో || సు కో రా - దు ||

సా సా రి స ని ఫ || ని స గ రి గ మ ||
నీ ళ్ల ని - చ - || ల్ల గ రా - దు - ||

ని ప ని ని సా || ని ద మ ప మ గ రి ||
చె - య్యా - ర || గం టి మి నే - - డు ||

రి గ మ ప ని ద మ || మ గ రీ గ రి సా ||
చే - రి నీ - తో - || పొం - - - దు లు || ||నెయ్యని||

**చ.** గా మ పా ని ప ప మ గ రి || సా రి స ని ఫ సీ ||
ప్రే మ ము - - చా - - - || లా జే - - - సి ||

ఫా ని స గ రి || గా మా మా ||
పె క్కు స తు ల || నీ తో ను ||

గా మ పా ని ప మా ప మ గ రి || సా రి స ని ఫ సీ ||
మో ము చూ - - - - - డ - || సి గ్గు - వ - డి ||

ఫ ని ని సా ని || స గ గ మా మ || గా మ ని ద మ || ని ప ని సా స ||
ము సు గు తో - || ను - న్న దా న || జా ము వో - యి || వ - చ్చి నీ వు ||

ని ప ని ని సా || గ మ గ రి రి సా రి సా ||
స ర స ము లా || డే - - - - - - వు ||

ని స గ రి స రి స రి నీ || ని ద ప ద ని సీ ని ద మా ||
యే - - - మ - ని - నే || ని - - య్య కొం - - - దు ||

రి గ మ ప ని ద మ || మ గ రీ రి గా రి సా ||
నే - టి జ - - న్మ || మ - - - - - య్య || ||నెయ్యని||

**అవతారిక :**

శ్రీమె స్వీయ ప్రౌఢ. నాయకుని చేష్టలను చక్కగా నెరిగినది. ఐనను తనయందు మక్కువ గలిగిన నాధుఁడు రాగా, "నిన్నునే నేమియు జంకించను. నీ చేష్టలకు కోపించుకొనను. భయపడను. నీకు నాసర్వస్వమును ఎప్పుడో అర్పించియున్న దానను. నీవు కోరినచో ఇందందునా నీసేవచేయుచు సన్నిధిని యుండుమన్నను యుండెడిదాననేకదా! నీయందు యెగ్గుపెంచి నీతో వాదులాడి నిన్ను నొప్పించెడి దానను కాదుసుమా! ఓ శ్రీ వేంకటేశ్వరుడా! నేను నీఅలమేలు మంగనేకదా!" అని 'నాయిక స్వామివారికి విన్నవించుకొనుచున్నది.

**రాగ లక్షణము :**

మాళవశ్రీ ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియజన్యము ప్రాచీనరాగము. ఇందు ముద్దుస్వామిదీక్షితులవారు, త్యాగరాజస్వామివారు చేసిన రచనలు ఒకటి రెండు కానవచ్చుచున్నవి. దీక్షితులవారి రచనయందుగల రాగస్వరూపము నిశ్చితమై మనోజ్ఞముగా కనబడు చున్నది. దీని నాధారముగా నుంచుకొనియే తాళ్లపాకవారి రచనల నూహించుటకు ప్రయత్నము జరిగినది. ఇంతమనోజ్ఞమగు రాగమునం దితరులెవ్వరును రచనలేల చెప్పలేదు? లేక చెప్పినను దొరకలేదేమో! ఇది పరిశోధించవలసిన యంశము. స గ గ మ ప ని ని స, ని ని ద ప మ ప ని ద మ మ గ స అనునవి ఆరోహణావరోహణములు. అయినను ఈ రాగమును మధ్యస్థాయి గాంధారము, తారస్థాయి పంచమము వరకు పాడుట పద్ధతియని తోచుచున్నది. అనగా దీనిని కురంజి, పున్నాగవరాళివంటి రాగములవలె మధ్యమ శృతియందు పాడుకొనవలసి యుండును.

మాళవశ్రీ—రూపకం

అప్పణిచ్చేనిదె నీకు ననుమానించకు మిక
చిప్పిల మోహించిన నీ చేతిలోని దానను ॥పల్లవి॥

యెంత నవ్వినా మేలే యెరిగిన విభుడవు
చెంత నుండి మరియేమి సేసినా మేలే
యింతమాత్రమునకే యెగ్గులెంచ తప్పులెంచ
సంతోసాన నీకులోనై సమ్మతించే దానను ॥అప్పణి॥

అలయించినా మేలే ఆయము లెరుగుదువు
కొలువు యిట్టె సేయించు కొన్నా మేలే
మలసిన మాత్రానకే మచ్చరించ నెచ్చరించ
చెలగుదు నీపాదాల సేవచేసేదానను ॥అప్పణి॥

చేరి కూడితివి మేలే శ్రీవేంకటేశుడవు
యీరీతి నలమేల్ మంగ నేమన్నా మేలే
సారె యీమాత్రానకే జంకించ బొంకించ
మేరతో నుండుదు నిన్ను మెచ్చేటిదానను! ॥అప్పణి॥

శృం : 14–88

ప. గ మ పా మా ॥ గ మ ప మ గ గ సా ॥
అ ప్ప ణి చ్చే ॥ ని - దె - నీ - కు ॥

సా గ స ని ధ పా ॥ మ ప ని ని స స ॥
అ ను - మా - - ॥ నిం - చ కు మి క ॥

గ మ పా - మ గా ॥ ప మ గా స ని సా ॥
చి ప్పి ల - - మో ॥ హిం - - చి న నీ ॥

ధ ని సా స ని స గా స ॥ స ని ధ ని ని ప మ ప ని స ॥
చే - - తి లో - - ని ॥ దా - - - - - - న - ను - ॥ ॥అప్పణి॥

చ. ధ ని సా స గ స ॥ నీ - ధ పా పా ॥
యెం త న వ్వి - - ॥ నా - - మే లే ॥

మ ప ని ద ని స ॥ గ మ గ గ సా - - ॥
యె రి గి న వి భు ॥ డ - - - వు - - ॥

సా గ స ని ద పా ॥ ని ద మ గ మా ॥
చెం త - నుం - డి ॥ మ రి యే - మి ॥

ని ద పా ని ని సా ॥ గ మ గ గ సా - - ॥
సే - - సి - నా ॥ మే - - - లే - - ॥

గ మ పా - ప ॥ మ గ మా - - । ని స గా మా ॥ ప మ గా మా ॥
యిం త మా - త్ర ॥ ము న కే - - । యె గ్గు లెం చ ॥ త ప్పు లెం చ ॥

గ మ పా - మ గా ॥ ప మ గా సా - ని సా ॥
సం తో సా - - న ॥ నీ - కు లో - - నై ॥

ద ని సా ని సా స గా ॥ స ని ని ద ని ప మ ప ని స ॥
స - మ్మ తిం - - చే ॥ దా - - - - - - న - ను - ॥ ॥అప్పణి॥

**అవతారిక :**

ఒకరితో నొకరు వంతులు పడుచు, తమ తగవులను దీర్చమని నాయకుని వేడుకొనుచు, వలపు మత్సరమున వాదులాడుకొను చెలులు నాయకుని అనుగ్రహము తనపైననే కలదను తగవులు తీర్చలేక నవ్వుచున్నాడేమోనని, ఆ నవ్వును తననుగాక ప్రక్కనున్న చెలిని హేళన చేయుటకేనని భావించుకొనుచున్న ఇరువురు ప్రేమగర్భితలగు నాయికల చర్యలను, ఇందు అన్నమయ్యవారు వర్ణించుచున్నారు. ఇందు నాయకుడగు శ్రీవేంకటేశ్వరుడు నవ్వుట తప్ప వేరేమియు పలికినట్లు కనబడదు. ఆ నవ్వులయందెట్టి మర్మములు గర్భితమై యున్నవో రసహృదయలగు ఆ భామలకే యెరుక.

**రాగ లక్షణము :**

ఫలమంజరి ప్రాచీనరాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము 22 వ మేళమగు ఖరహరప్రియజన్యము. 'స గ మ ద స । స ని ద ప మ గ మ రి స' అనునవి ఆరోహణావరోహణములు. దీనికి దగ్గరగా 'కానడ' రాగముకలదు. ఇందుగల సంచారములు తెలుసుకొనుటకు త్యాగరాజస్వామి వారివి రెండుకీర్తనలు మాత్రమే వినబడుచున్నవి. ఒకప్పుడిదియు మంచి ప్రచారముననున్న రాగమేగాని, ఇందు ఇతర వాగ్గేయ కారుల రచనలు దొరుకుటలేదు. దీనిని ఫళవంజరము అనుటయు కలదు.

పళవంజరం — ఝంపె

ఎదురు గుదురుగాను యేల నవ్వీనే
యెదుగా తడవునుండి యేల నవ్వీనే ॥పల్లవి॥

వరుసలు వంతులును వనితలమాడుకోగా
యిరవైన విభుడు తానేల నవ్వీనే
తరమిడి నిద్దరము తన్ను దగ వడిగితే
యెరవులు సేసుకొని యేల నవ్వీనే ॥ఎదురు॥

వొక్కరొక్కరము సొమ్ములొనర సిరిచూడగ
యిక్కువైన రమణుడు యేల నవ్వీనే
చక్కగామాలోనే మమ్ము సంతముసేయిమంటాను
యిక్కడా మామోము చూచి యేల నవ్వీనే ॥ఎదురు॥

మోవిమీది గుఱుతులు మూసుకొనే మమ్ముఁజూచి
యీవేళ శ్రీవేంకటేశుడేల నవ్వీనే
భావించి మమ్మేలితివి పాడి దిద్దుమంటేను
యే వెలదులతోనైన నేల నవ్వీనే ! ॥ఎదు

శ్రు౦ : 19—48

ప. - గ మ ప ప ప | ప మ గ మ రి స || - స ని ధ సా | గా మా - ||
- ఎ దు రు గు దు | రు - - - గా ను || - యే - ల న | వ్వీ నే - ||

- గ మ ద స స | స ని ద సా స ||
- యె దు గా త డ | వు - - నుం డి ||

- స ని ద ప మా | గ మ ప మ గ మ రి స ||
- యే - ల - న | వ్వీ - - - నే - - - || ॥ఎ

చ. - మ ద ని ని ప | ప మ గ మ ప మ గ మ రి ||
- వ రు స లు - | వం - - - తు - లు - ను ||

- స స స స ని ధ | ని ద సా గా మ ||
- వ ని త ల - - | మా - డు కో గా ||

- గ మ ద స స | స ని ద ప మ గ మా ||
- యి ర వై - న | వి - భు - డు - తా ||

గ మ పా ప మ గ మ | రి సా - || - గ మ ద సా | స ని ద స స స ||
నే - ల న - వ్వి - | నే - - || - త ర మి డి | ని - - ద్ద ర ము ||

- ని ద స గ గ | మ రి రి సా || - ద స గ మ రి రి | సా ని ద స |
- త - న్ను త గ | వ డి గి తే || - యె ర వు - లు - | చే సు కొ ని |

మ ద సా ని ద ప మ గ మ | రి సా - ||
యే - - ల - న - - - | వ్వీ నే - || ॥ఎ

**అవతారిక :**

విభుడు, చనవిచ్చిన వాడు, వినయము చేసేవాడు, ప్రియములు చెప్పేవాడు, దయ గలవాడు, మెచ్చి సరసము లాడేవాడు. "ఈతనిని కోపించి విరసములాడి వెంగెములాడి నొప్పించి తప్పించుకు తిరుగ గలనా? ఇటువంటివాడె నా విభుడైన శ్రీ వేంకటేశ్వరుడు!" అని చెలితో నాయిక చెప్పుచున్నది.

**రాగ లక్షణము :**

శుద్ధదేశి ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యము. ఇందు త్యాగ రాజస్వామివారి కీర్తన ఒకటి మాత్రమే కనబడుచున్నది. స గ రి గ మ ప మ ని ద ప ద ని స | స రి గ స ని ద ప మ రి మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. వక్ర సంపూర్ణముగా యీ రాగ మును మా గురువులు చెప్పియున్నారు. రాగ సంచారములు రచన యందు గమనించి గుర్తించు కొన వలసి యున్నది. ఇందు తాళ్ళపాకవారి రచనలు కనబడు చుండుటచే, ఒకప్పుడు బహుళ ప్రచారము నందుండి క్రమముగా లుప్తమై పోయిన రాగములలో ఇదియు నొకటియై యుండునని తోచుచున్నది.

**శుద్ధదేశి — రూపకం**

ఇటువంటివాడు తాను యెదురాడేనా నేను
చిటుకన జెప్పినట్టు సేసేనే తనకు ॥పల్లవి॥

వినయము సేసే చోట వెంగెము లాడగ రాదు
చనవిచ్చిన చోటను జరయరాదు
మనసొక్కటైన చోట మంకులు చూపగరాదు
ననుపులు గలిగితే నమ్మకుండరాదూ ॥ఇటువంటి॥

ప్రియము చెప్పేయప్పుడు బిగిసె ననగరాదు
క్రియగల పొందులు తగ్గించగరాదు
నయమిచ్చి మాటాడగా నవ్వక మానరాదు
దయతో దగులగాను దాగగ రాదు ॥ఇటువంటి॥

పచ్చిదేర గూడగాను పంతము లడుగరాదు
కచ్చుపెట్టి చెనకగా గాదనరాదు
ఇచ్చట (శ్రీ) వేంకటేశు డింతలోనే నన్ను గూడె
మెచ్చి సరస మాడగా మితి మీఱరాదు ! ॥ఇటువంటి॥

శ్రుం : 18–219

ప. ని స గ రి గా ॥ ప మ గ రి సా ॥ మ ప ని ద నీ ॥ సా ని ద ప మ గ రి సా ॥
ఇ టు వం - టి ॥ వా డు తా - ను ॥ యె దు రా - డే ॥ నా నే - - - - - - ను ॥

మ ప ని ద నీ ॥ స స ని సా సా ॥
చి టు క - న ॥ చె ప్పి - న ట్టు ॥

రి గ మా గ రి సా ని ద పా ॥ ని ద ద ప ప మ మ గ గ రి రి స ॥
సే - - సే - - నే - - ॥ త - - - న - - - కు - - - ॥ ॥ఇటువంటి॥

చ. ప ప పా ని ద ద ప ॥ మ మ రి గ రి రీ ॥
వి న య ము - - - ॥ సే సే - చో - ట ॥

ని స రి గ రి గ మా ॥ ప మ మ గ రీ రి స ॥
వెం - గే - ము - లా ॥ డ గ రా - - దు - ॥

స ని ద ని ప ద మ ॥ ప ని ద నీ సా ॥
చ - న వి - చ్చి న ॥ చో - - - ట ॥

ధ ని సా రి గ మా ప మ గ రి ॥ సా - ని సా - - ॥
జ - ర య - - - - - - - ॥ రా - - దు - - ॥

మ మ ని ద ని ప ॥ ని ద నీ సా ॥
ఘ న సౌ ఖ్య మై - ॥ న - చో ట ॥

ద ని సా రి గ మా గ రి || గ రి సా సా ||
మం - - కు - లు చూ - || ప గ రా దు ||

ద ని స గ రి గ మా గ రి సా || మ గ గ రి రి స స ని ని ద ద ప ||
న - ను - వు - లు గ - లి || గి - - - తే - - - - - - - - ||

సాం స ని ద ప మ || పా ని ద ద ప ప మ మ గ గ రి ||
న మ్మ కుం - - డ || రా - - - - - - - - - - డు - ||

||ఇటువంటి||

**అవతారిక :**

నాయిక తన అనుంగు దూతికలకు తన నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని తోడి తెమ్మని అతనికి చెప్పవలసిన ప్రియములు చెప్పి పంపగా, ఆ చెలుల సౌందర్యమునకు ఆనందించిన స్వామి, వారి మనోభావముల నెరిగిన ఆ పరమాత్ముడు వారికి పరవశములు దీర్చి ఆనందింప జేసెను. వారు "మేము పెదవులపైగల పలు గాటులతోను, అంగములపైగల నఖక్షతములతోను కస్తూరి యంటిన వదనములతోను మా చెలికడ కెట్లు పోగలము? పోయి యేమని బొంకగలము? ఆమె నీకొరకు ఎదురు తెన్నులు చూచుచున్నది. నీవు మనసు పట్టజాలక యిట్లు చేసితివి· మీ యిద్దరి తమకములును బాగున్నవి. ఇప్పుడేమి చేయవచ్చును? ప్రొద్దు ప్రొద్దుటనే ఎట్లబద్ధము లాడవలెను?" అని మొరబెట్టుకొనుచున్నారు.

**రాగ లక్షణము :**

మధ్యమావతి ప్రాచీన రక్తి రాగములలో నొకటి. దీనిని భాషాంగమని కొందరు లక్షణకారులు చెప్పుకొన్నారు. కాని భాషాంగ లక్షణములు యిప్పుడీ రాగములో కానవచ్చుటలేదు. ఇది 22వ మేళ జన్యముగా కనబడుచున్నది. స రి మ ప ని స | స ని ప మ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇందు ప్రాచీన వాగ్గేయ కారుల రచన లనేకములు గలవు. సుమారు మూడు నాలుగు వందల యేడ్ల క్రిందటివగు రచనలయందుకూడ యీ రాగ స్వరూప మిప్పటి యట్లే కనబడుచున్నది. దీనిని మధుమాద్ సారంగ్ అని ఉత్తరాది సంగీతజ్ఞులు చెప్పుదురు.

**మధ్యమావతి — ఆది**

ఇద్దరి తమకము నిటువలెనే
పొద్దున నేమని బొంకుదుమయ్యా ? ॥పల్లవి॥

లలినీ కధరము లంచమియ్యగా
పలుసోకులయి పరగెనవే
పిలువగరాగా బెరసి నిందవడె
పొలతికి నేమని బొంకుదమయ్యా ? ॥ఇద్దరి॥

అడుగు కొలుచు నిన్నంటి పెరగగా
తడయక నఖములు తాకెనవే
తొడుకొని రాగా దూలు మీదబడె
పొడవుగ నేమని బొంకుదమయ్యా? ॥ఇద్దరి॥

పెక్కులు చెవిలో ప్రియములు చెప్పగ
ముక్కున జవ్వాది మోచె నిదే
యిక్కడ శ్రీ వేంకటేశుడ నడి వడె
పుక్కటి నేమని బొంకుదమయ్యా? ॥ఇద్దరి॥

శృం : 19—33

ప. రీ ప మ రి రి స స । ని స రి స రీ - - ॥
1. ఇ ద్ద రి త మ క ము । ని టు వ లె నే - - ॥

రీ మ మ పా ని ప । స ని ప మ రి స ని స ॥
పొ ద్దు న నే మ ని । బొం - కు ద మ - య్యా - ॥ ॥ఇద్దరి॥

2. రీ ప మ రి రి స స । ని స రి స రీ - - ।
ఇ ద్ద రి త మ క ము । ని టు వ లె నే - - ।

రీ మ మ ప ని స రి । మ రి స ని ప మ రి స ॥
పొ ద్దు న నే - మ ని । బొం - కు దు మ - య్యా - ॥ ॥ఇద్దరి॥

చ. మ మ మా ప ని ప మ । రి మ ప మ రి రి సా ॥
ల లి నీ క ధ ర ము । లం - చ మి - య్యా గా ॥

ని స రి మ రి స రి మ । ప ని స ని ని ప పా ॥
వ లు స్తో - కు ళ్లు - । వ ర గె న వే - - ॥

ప ని స రి మ రి రి స । స రి స ని ప ని ని స ॥

పి లు వ గ రా - గా - । బె ర సి నిం - ద వ డె ॥

ప ని స రి ని స ప ని । మ ప రి మ రి ని సా ॥

పొ ళ తి కి నే - మ ని । బొం - కు దు మ - య్యా ॥ ॥ఇద్దరి॥

**అవతారిక :**

ఇందు నాయిక విరహార్తయై యున్న విధమును నాయకునికి విన్నవించుచు, ఆమెను ఆదరింపుమని చెలులు శ్రీవేంకటేశ్వరునకు చెప్పుచున్నారు.

మధ్యమావతి — ఝంపె

ఎటువంటి వలపో యెవ్వరి కోలది గాదు
ఘటనతో దమకించీ గనుగొనవయ్యా ! ॥పల్లవి॥

తళుకున నిన్నుజూచి తలవంచుకొని యింతి
తలపోసీ నీ రూపు తనలోననె
నిలువు జెమటతోడ నిట్టూరుపులతోడ
చెలరేగి గుబ్బతిలీ జిత్తగించ వయ్యా ! ॥ఎటు॥

కోరినీపై నాస పడి గొబ్బునను సిగ్గుపడి
పేర బెట్టి మాటలాడీ బెదవుననె
సారపు తురుముతోడ జవ్వనభారముతోడ
ఆరితి నివ్వెరగందీ నాదరించవయ్యా ! ॥ఎటు॥

కాగిటికి జెయ్యి చాచి కన్నులనే నీకు మొక్కి
మూగిన మోవి యిచ్చి మతకాననె
చేగదేర నిన్నుగూడె శ్రీవేంకటేశుడ
వీగ దలమేలుమంగ వినోదించవయ్యా ! ॥ఎటు॥

శృం : 25—24

ప. - రి మ పా ప మ | రి రి స స ని ధ || ని స రీ మ రి రి స | రి మ పా - ||
- ఎ టు వం టి - | వ ల పో యె - - || వ్వ రి కో ల - ది - | గా - దు - ||

- ప ని స స రి ని స | ప ని మ పా మ ||
- ఘ ట న తో - - - | ద - మ కిం చీ ||

రి మ ప ని ని ప మ | రి రి సా - ||
క ను గొ న - - - | వ - య్యా - || ||ఎటువంటి||

చ. - మ మ మ ప మ రి స | రి స ని ధ నీ స ||
- త ళు కు న - - - | ని - న్ను - జూ చి ||

- ధ ని స రి మ రి | రి మ ప మ రి స స ||
- త ల వం - - చు | కొ - ని - యుం - తి ||

- రి మ ప ని ని | స ని ప మ రి రి || ని ప రి మ ప మ | పా - - - ||
- త ల పో - సి | నీ - - - రూ పు || త న లో - - న | నే - - - ||

- ని స రి మ ప మ రి | రి స ని స సా స ||
- ని - ట్టూ - - - రు | పు - ల - తో డ ||

- ప ని సా స | ని స ని పా మ || - మ మ ప ని ప మ | రి మ ప మ రి స స ||
- చె ల రే గి | గు - బ్బ తి లీ || - చి త్త గిం - - - | చ - - - వ - య్యా||
||ఎటువంటి||

**అవతారిక :**

పాంచభౌతికమగు శరీరమునందు విహరించు జీవుడొకడు, వానిని నడిపించెడి నాధుడొకడు వుండగా, మంటి ముద్దవంటి ఈ దేహమునకు బంధములను తగుల్చుకొని వాని కొరకై పడరాని పాట్లు పడుచుండెడి జీవుని తెలివి తక్కువ తనమునకు విచారించుచు, వెలుగు వెల్లువ వంటి వేంకటేశ్వరుని కృపా దృష్టిని పొందవచ్చునని అయ్యావారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

ఈ ముఖారి రాగము అతి ప్రాచీనము. భాషాంగము. ఇప్పటి వాడుక ప్రకారము 22వ మేళమగు ఖరహరప్రియ జన్యముగా చెప్పుకొనవచ్చును. ఆరోహణమున చతుశ్రుతి ధైవతమును, అవరోహణమున శుద్ధధైవతమును వచ్చుట పరిపాటి. 'స ని ద మా' 'ప ని ద మా'– 'ప ద మా' అను సందర్భములలో అవరోహణమే అయినను, చతుశ్రుతి ధైవతమే పలుకును. వెంకటమఖి సంప్రదాయమున చెప్పిన ముఖారియు, క్షేత్రజ్ఞుని పదములయందలి ముఖారియు ఇంచుమించు ఒకటిగానే యున్నవి. భాషాంగ స్వరము చతుశ్రుతి ధైవతమైనచో ఈ ముఖారి నటభైరవి జన్యముగను, భాషాంగ స్వరము శుద్ధ ధైవతమైనచో ఖరహరప్రియజన్యముగను చెప్పుకొనుటకు అవకాశము కలుగుచున్నది. వెంకటమఖి సంప్రదాయమున ఈ రాగము నారీ రీతిగౌళ జన్యము. కొందరు ఇతర గ్రంధకర్తల మతములో నిది ఖరహర ప్రియ జన్యము. ఇటువంటి రాగములకు జనకరాగములను నిర్ణయించుటకు పాటింపదగిన ఒక నియమము మా గురువుల వలన తెలుసుకొంటిని. సకృత్తుగా వచ్చి భాషాంగ స్వరూపమును నిర్ణయించుటకు మాత్రము తోడ్పడు స్వరమును వదలి, అన్యస్వరములను గమనించి, జనకరాగమును నిర్ణయించవలెను. ఈ నియమము చెప్పుటకు సులభముగానే యున్నది. కాని నిర్ణయము చేయుటకు దిగినప్పుడు మాత్రము కష్టముగానే యున్నది. కారణము ముఖారి రాగమునందలి రెండు ధైవతములును, ప్రత్యేకమైన ఒడుగులు, బరువులు, మొదలగు వాటితో రాగ స్వరూపమును నిర్ణయించునదిగాను, 'ఇది ఎక్కువగా వచ్చును, ఇది తక్కువగా వచ్చును' అని చెప్పుటకు వీలు లేకుండగను, వుండుటవలన వెంకటమఖియు, ఆధునికులును కూడ సరిగానే చెప్పి యున్నారనక తప్పదు. కాని ఇంకొక్క సంప్రదాయమున్నది. ఇటువంటివే గాక ఔడవ షాడములైన కొన్ని రాగములకు జనక నిర్ణయము చేయునప్పుడు 72 మేళకర్తలలో ఒకటి నుండి ప్రారంభించి, ముందుగా ఏ మేళకర్తకు యీ రాగము అన్వయించుటకు వీలుగా నున్నదో, ఆ మేళకర్త జన్యమని చెప్ప

వచ్చునను మతము కూడ ఒకటి యున్నది. ఏది యెట్లున్నను ముఖారి చతుశ్శ్రుతి ధైవతముతో ఎక్కువగా రాగస్వరూపమును వ్యక్తము చేయుచు ఒప్పుచున్నది.

**ముఖారి — ఆది**

ఎట్టు దరించీ నిదె యీ జీవుడు
బట్ట బయలుగా బరిచీ నొకటి ॥పల్లవి॥

చెడని మంటిలో జేసిన ముద్దే
నడుమ ముంచు కొన్నది వొకటి
తడియని నీరై తడి వొడ మింపుచు
వడసీని వేపుర వడితో నొకటి ॥ఎట్టు॥

పాయని తను దీపనములుగా నటు
చేయుచు మదివేచీ నొకటి
కాయపు చుట్టరికమ్ములు సేయుచు
రేయుబవలు విహరించీ నొకటి ॥ఎట్టు॥

ఇన్నియు దానే యేచి కపటములు
పన్నీ నిదె లోపల నొకటి
వెన్నెల చూపుల వేంకటేశ నిను
యెన్నికతో గడు నెదరీ నొకటి ! ॥ఎట్టు॥

అ : 11(2)–61

ప. పా ప ప దా సా | రీ రీ గ రీ | సా ని ద ||
ఎ ట్టు ద రిం చీ | ని దె యీ - | జీ వు డు ||

పా ద ప మ మ ప మ | గ రి మా | ప ప పా ||
బ ట్ట బ య లు గా - | బ ర చీ | నొ క టి || ॥ఎట్టు॥

చ. ప ని ని ని ద ద ద మ | మ ప ప ద | మ ప ప ప ||
ఇ - న్ని యు తా - నే - | యే - చి క | ప ట ము లు ||

రి మ ప ప ద ప ప మ | గ రి మ మ | పా - - ||
ప - న్ని - ని దె లో - | ప ల నొ క | టి - - ||

మ మ ప ద సా స̇ రి̇ | రి̇ మ̇ గ̇ రి̇ | స̇ స̇ రి̇ రి̇ ||
వె - న్నె ల చూ పు ల | వేం క టే - | శ - ని సు ||

స̇ రి̇ గ̇ రి̇ సా ని ద | మ మ ప ద | స̇ స̇ సా ||
యె న్ని క తో క డు | నె ది రీ - | కొ క టి || ॥ఎట్టు॥

**అవతారిక :**

పరమార్థము నెరుగక దానములు చేయుట, పూజలు, వ్రతములు మొదలగు పుణ్యకార్యములు చేయుట, సత్సంతానములు, సంసారములు చేసుకొనుట, ధనకనక వాహనాదులను సంపాదించుట, చదువులు చదివి విజ్ఞానమును పొందుట, అన్నియు తనలో గల శ్రీహరిని తెలుసుకొననిచో వృథాయే కదా! శ్రీ వేంకటనాథుని నమ్మి భజింపని వానికి ఎన్ని యున్నను అన్నియు నిష్ఫలములే యగునని అన్నమయ్యవారు చెప్పుచున్నారు.

**ముఖారి — ఆది**

వెరపులు నొరపులు వృథా వృథా
ధరపై మరియంతయును వృథా! ॥పల్లవి॥

తడయక చేసిన దానంబులు వృథ
యెడనెడ నెఱిగిన యెఱుక వృథా
ఒడలిలోన హరి నొనరగ మతిలో
దడవని జీవమె తనకు వృథా! ॥వెరపులు॥

జగమున బడసిన సంతానము వృథ
తగిలి గడించిన ధనము వృథా
జగదేక విభుని సకలాత్ముని హరి
దెగి కొలువని బుద్ధియును వృథా! ॥వెరపులు॥

పనివడి కూడిన పరిణామము వృథ
వొనరగ నుండిన వునికి వృథా
ఘనుడగు తిరువేంకటగిరి హరిగని
మననేరని జన్మములు వృథా! ॥వెరపులు॥

అ: 11(2)—88

ప. ని ధ స స స స రి రి | రి మా మ | పా ద ప ||
వె ర పు లు వొ ర పు లు | వృ థా వృ | థా - - ||

మ మ పా ద ప మా | గ రి స స | సా - - ||
ధ ర పై మ రి యుం | త యు ను వృ | థా - - || ॥వెరపులు॥

చ. మ మ ప ప ప ని ని ద దా | ప ద సా | ని ద స స ||
త డ య క చే - సి - న | దా - నం | బు లు వృ థ ||

స రి గ రి సా రి స ని ద | మ మ ప ద | పా - - ||
ఎ డ నె డ నె రి - గి న | యె రు క వృ | థా - - ||

ప ద స స స స స స | స ని ని ద | ద ప ప మ ||
ఒ డ లి లో - ని హ రి | నొ స ర గ | మ తి లో - ||

ప ప ద ప మా ప మ గ రి | స రి గ రి | గ స సా ||
ద డ వ ని జీ - - వ మె | త న కు వృ | థా - - || ॥వెరపులు॥

**అవతారిక :**

మానవులకు సహజముగా నుపకరించు మంచి గుణములను చెప్పుచు నేర్పు, ఓర్పు, కరుణ, సరసత, కూరిమి, వెరవు మొదలగునవి కలిగిన వారికి సర్వ సుఖములు చేకూరుననియు, కలిమి, బలము మొదలగు వానికంటె ఆపదలు వేరేమియు లేవనియు, శ్రీహరి కటాక్షమును కోరుకొనుచుండెడి యభిమతముకన్న యింకేమియు లేదనియు అన్నమయ్యవారు ఈ రచన యందు వివరించుచున్నారు.

**ముఖారి — చాపు**

నేర్పుకంటె ఇన్నిధి గద్దా
ఓర్పుకంటె సుఖమొకటిక గద్దా? ॥పల్లవి॥

కరుణకు నెక్కుడు గతి యిక గద్దా
సరసత కెక్కుడు సరిగద్దా
గురుమతి జిత్తము కూరిమి నిలిపిన
వెరవుకంటె విధమిక గద్దా? ॥నేర్పు॥

కలిమికంటె జీకటి మరి కద్దా
బలిమి కంటె నాపద గద్దా
గెలుపు (గ) దెలిసి లంకించిన మతితో
జెలగుకంటె నిజసిరి యిక గద్దా? ॥నేర్పు॥

పాయము కంటె నపాయము గద్దా
కాయపు రోతకు గడ గద్దా
పాయక వేంకట పతికృప గోరిన
యీ యభిమతమున కెదురిక గద్దా? ॥నేర్పు॥

అ : 11(2)–68

ప. ని ద స̇ | రి̇ గ̇ రి̇ || సా̇ స̇ | ని ద ద మ || పా - | పా - - ||<br>
నే - ర్పు | కం - చె || పె న్ని | ధి - క - || గ - | ద్దా - - ||

మ ప మ | పా ద ప || మ మా | గ రి రి స || రీ మ | పా - - ||<br>
ఓ - ర్పు | కం చె - || సు ఖ | మొ క టి - || గ - | ద్దా - - || నేర్పు ||

చ. మా మ | మా మా || ప ద ప | ప మ గ రి || స రీ | మా మా ||<br>
పా య | ము కం || చె - - | న - పా - || య ము | క ద్దా ||

మ ప ప | ప ని ని ద దా || ద మా | ప ని ని ద దా || సా̇ - | సా̇ సా̇ ||<br>
కా - య | పు - రో - - || త కు | గ - డ - - || గ - | ద్దా - ||

మ పా | ప ద సా̇ || ద స̇ రి̇ | గ̇ రి̇ రి̇ స̇ || రి̇ రీ̇ | మ̇ మ̇ గ̇ రి̇ ||<br>
పా - | య క వేం || క ట - | ప - తి - || కృ ప | గో - రి న ||

రి̇ స̇ రీ̇ | గ̇ రి̇ రి̇ స̇ || స̇ సా̇ | ని ద ద మ || ప నీ | ని ద దా సా̇ ||<br>
యీా - య | ఖి - మ త || ము న | కె - దు - || రి గ | క - - ద్దా ||<br>
|| నేర్పు ||

**అవతారిక :**

ఇందలి నాయిక విరహోత్కంఠిత. నాధుని రాకకై ఆర్తితో వేచియున్న సమయమున "పూవులేల బెట్టేరే అవి రతిరాజు బాణములుగదా! గంధమేల పూసేరే, అది మలయ పవనుడు జల్లు మత్తుమందు గదా! సొమ్ములేల బెట్టేరే, ఇవి అన్నియు నా నాధుడైన శ్రీ వేంకటేశ్వరుడు బెట్టినవే గదా! నాధుని రాకకై పరితపించుచున్న నాకు ఇవి అన్నియు బాధాకరములు గదా!" అని యామె చెలులతో మొరబెట్టుకొను చున్నది.

**ముఖారి — త్రిపుట**

తతిగాని తతినేల తమకించేరే
మతిలోని నొప్పి గొంత మాన నియ్యరే! ॥పల్లవి॥

పతి బాసి వున్న దాన బలు విరహపు వేళ
యిత వంటా విరులు నాకేల యిచ్చేరే
రతిరాజు నమ్ములివి రంట దెప్పరపు వేళ
కతుకున నాటు జేసు గవిశన నిడరే! ॥తతి॥

కందువ జవ్వనమున గావరించి వున్న వేళ
యింద మంటా గందము నాకేల పూసేరే
మంద మారుతాన కవి మచ్చు చల్లే చొక్కుమందు
యిందుకేల పెట్టె గట్టి యింటిలోన నిడరే! ॥తతి॥

శ్రీ వేంకటేశువొద్ద సిగ్గువడి వున్న దాన
చేవదేర నిప్పు డేమి సింగారించేరే
యీవల నాతడు గూడె యీ సొమ్ము లిన్నియును
వేవే లాతడిచ్చినవె వేగిర పడకురే! ॥తతి॥

శ్లో : 17–221

ప. - - గ రి | సా సా || స స స ని ద | ద మ మా ||
- - త తి | గా ని || త తి - - - | నే - ల ||

- - రి మ | పా స ని ని ద దా || సా - | సా - - ||
- - త మ | కిం - - - - - || చే - | శే - - ||

- - ప ద | స రి గ రి రి గ సా || సా ద రి స ని | ని ద దా పా ||
- - మ తి | లో - - - ని - - || నొ - ప్పి - - | కొం - - త ||

- - రి మ | పా ద ప ప మ గ రి || రి స రి మా - | పా స ని ని ద దా ||
- - మా - | న - - ని - - - || య్యా - - - - | రే - - - - - ||

||తతి||

చ. సా ప ద | పా ప మ గ రి || రి స రి | ప మ గ రి రి స ||
- ప తి | జా సి - - - || వు - న్న | దా - - - న - ||

సా ధ స | రి మ మా || మా ద ప మ గ రీ | రి స సా ||
- బ లు | వి ర హ || పు - - - - - | వే - ళ ||

- - రి మ | పా ద ప || ప మ పా ద ప | ప మ ప మ గ రి రి ||
- - ఇ త | వం ట - || వి - రు - - | లు - - - - - - ||

మా ని ద | దా ని ద రి సా ని || ని ద దా | పా - - ||
నా కే - | ల - - యి - - || చ్చే - - | శే - - ||

- - ప ద | సా రీ || రి స రీ | ప మ గ రి రీ గ స ||
- - ర తి | రా జు || న - మ్మి | లి - - - వి - - ||

సా స | సా రీ గ రి రి స || స ని ని ద ప ద | సా సా ||
- రం | ట ధె - - - - || ప్ఫ - ర - పు - | వే ళ ||

- - ప ద | సా సా || సా ద రి స ని | ని ద దా పా ||
- - క తు | కు న || నా - టు - - | జే - - సు ||

- - రి మ | పా ద ప ప మ గ రి || స రి మా | పా స ని ని ద దా ||
- - గ వి | ళ - - న - - - || ని - డ | రే - - - - - || ||తతి||

**అవతారిక :**

ఇందు నాయిక ప్రేమోత్కంఠిత, ప్రౌఢ. "నీవు నాయందు దయకలిగి నాతో నుండి నప్పుడు విరసములైన ఎన్ని తిట్లు తిట్టినను అవి వెగటుగా నుండవు. నీవు నన్ను ఎన్ని విధములుగా ఆదరించినను అవి యన్నియు ఇష్టములే యగును. ఇద్దరమొకమై యున్నప్పుడు నన్ను ఎన్ని విధముల కౌగిళులయందు అలయించినను అవి ఆనందములే యగును. అట్టి వేళల యందు యెంగిళులనుకొనరాని పనులు ఎన్నిచేసినను, అవి ఇంపులై మనసునకు గిలిగింతలే పెట్టును. వెయ్యేల నీ వెగటులన్నియు వేడుకలాయ"నని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని నెయ్యపు చేతలను మెచ్చుకొనుచు ఈమె ఆనందించు చున్నది.

**రాగ లక్షణం :**

వేళావళి ప్రాచీన రక్తిరాగములలో నొకటి, ఇప్పటి వాడుక ప్రకారము 23వ మేళమగు గౌరీ మనోహారి జన్యము. 'స రి గ మ ప ద స | స ని ద ప మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు. ఇందు ప్రాచీన వాగ్గేయకారుల రచనలు అచ్చటచ్చట కనబడుచున్నవి.

**వేళావళి — ఆది**

తగు తగు నీ దొరతనము లిక
వెగటు లన్నియును వేడుకలాయ ! ॥పల్లవి॥

విరసపు తిట్లు వేవేలు దిట్టిన
సరసపు వేళల చవులాయ
యెరవుల చేత నీ వేమి సేసినా
సరినా కౌగిట చందములాయ ! ॥తగు॥

బొమ్మ జంకెనలు బోరి నెసైనా
సమ్మతించితే చవులాయ
దిమ్మరివై యెందు దిరిగి వచ్చినా
నెమ్మి నన్నేలగా నేరుపులాయ ! ॥తగు॥

అంగము లలయగ నంటబెనగినా
సంగడి రతులను చవులాయ
రంగు (శ్రీ) వేంకట రమణ నన్నెనసితి-
వెంగిలి మోవుల కిచ్చకమాయ ॥తగు॥

శ్రుం : 25–74

ప. - గ రీ స రీ గా మ ప | గ మ పా ద ప మా ప మ గ రి | సా - - ||
- త గు త గు నీ దొ ర | త - న - - ము - - లి - | క - - ||

- ప పా మ ప ద స నీ | ప ద స ని ద ప | మ గ రీ గ రి రి స ||
- వె గ టు ల న్ని యు ను | వే - - - డు క | లా - - య - - - || ॥తగు॥

చ. - ద పా మ పా దా ద ప | ద స స ని స రి | గ రి గా గ రి రీ ||
- వి ర స పు తి ట్లు వే | వే - లు - తి - | - - ట్టి నా - - ||

- రి గా మ గా రి గ రి స | స ని దా ద సా ని | సా - - ||
- స ర స పు వే - శ ల | చ - వు లా - - | య - - ||

- స స ని ద పా ద ప మ ప ద | మ ప ద స ద ప మ రి | గ గ గ రి రీ ||
- యె ర - వు ల చే - - త నీ | వే - - - మి - సే - | - సి నా - - ||

- స నీ ధ ధా సా స ని స రి | స రి గ మ పా ప మ | మ గ రీ గ రి రి స || స
- స రి నా - కౌ - - గి ట | చం - - - ద ము - | లా - - య - - - ||
||తగు||

**అవతారిక :**

ఇందు స్వాధీనపతిక యగు నాయికయు ఆమె పతియును, ఆనందించెడి విధమును చూచి పొలయలుకలలో వారు ఒకరిపై నొకరు తనతో చెప్పుకొను మాటలను విని "వ్యంగ్యములగు మాటలాడి చనవులు చూపుకొనుచున్నావు. ఇందలి వ్యంగ్యములు మీకన్నియు తెలుసును. నన్నేల న్యాయమడిగేరే? మీ యిద్దరి సుద్దుల మరుగులు మీవే కావా? ఆ గిలిగింతలు నవ్వులు మీ నేర్పులకు తార్కాణములు. క్రిందు మీదేల జూచేరే? నిలువెల్ల మీ నేర్పులు తెలియుచునే యున్నవి. నాకేమి అప్పగింతలు పెట్టేరే? మీ కొలదిలేని వలపులు గుంభనములు కావా? భావములయందు చొక్కుచు పైపైని చేతులు వేసుకొనుచు శ్రీ వేంకటేశ్వరుడును, నీవును సిగ్గులేల పడేరే ? గూటిని పడ్డ గువ్వల జంటవలె నుండరే! మిక్కిలి విచ్చి చెప్పితే మేడిపండు బోన నయ్యానే" అని వ్యంగ్యముగా చెప్పుచు నాయికా నాయకులను చెలి అనునయించి ఆనందించుచున్నది.

**వేళావళి — త్రిపుట**

మిక్కిలి విచ్చి చెప్పితే మేడిపండు బోన మిది
తొక్కు మెట్టు సందడెల్ల తో దోపులే కావా? ॥పల్లవి॥

చాయలకే మాటలాడి చనవులు నెఱసేవు
యీ యెడ దెలుసునే మీ కిద్దరికిని
నాయమే మడిగేవే నన్ను నీ వింతటి లోనే
మాయదారి సుద్దులెల్ల మఱుగులే కావా? ॥మిక్కిలి॥

గిలిగింత నవ్వు నవ్వి కిందు మీదు జూచేవు
నిలువుల నున్నవే మీనేరుపు లెల్లా
మలసి మీ సరితలు మాకేమి అప్పగించేరే
కొలది లేని వలపు గుమితమే కాదా? ॥మిక్కిలి॥

భావపు రతి గరగి పై జేయి వేసేవు
వావిరి దేటపడె మీ పగలెల్లను
శ్రీ వేంకటేశుడు నీవు సిగ్గు లిందేల పడేరే
కూవలై వున్నవి మీగుట్టింతే కావా? ॥మిక్కిలి॥

శృం : 27–192

రీ రి మ | ప స స ని ని ద || ద ని పా | - - - - ||
- మ న | కే - ల - - - || - - - | - - - - ||

- - రి మ | పా ప స || సా రి స నీ - - | సా సా ||
- - ఇ త | వై యా - || పె - - - - - | గుం పె ||

సా ప ని | సా రీ మ గ || గ రి సా | ని ద పా సీ ||
న కి త | డు లో - - || గు - చుం | డ - - గా ||

సా స రి | మ గ గ రి స స || సా రి స ని ద ప | సీ సా ||
- కు తి | ల - - - కు డు || వ - - - - - | నే లే ||

- - రి మ | ప స సా రి స ని ద || పా ద ప మ గ గ రి | మ గ గ రి సా || రీ
- - కో - | మ్మ - లా - - - - - || ల - - - - - - - | మ - న - ము || -

॥చూతమే॥

**అవతారిక :**

ఇందలి నాయిక దివ్య. పతివ్రతయగు ఈమె తన నాయకుడు పలుతావులయందు ఎట్లు మసలివచ్చినను తాను పట్టించుకొనదట. తనయందు ప్రేమను మాత్రము పోగొట్టుకొనక యాతడుండిన చాలునట. "నీవు కూరిమి గలిగ నాపై కోపము చేసుకొన్న మేలే. నీ మనసు నందు నన్ను మరువకుండిన చాలు. నీవేడ నున్నను, ఎవతె గూడినను నాకేమియు కష్టము గలుగదు. పానుపుపై నాయందు మక్కువలు చూపినచాలు. నీవెన్ని బింకాలు పోయినను నేను బాధపడను." అని ప్రేమతో నాయకునికి విన్నవించుచున్నది.

కేదారగౌళ — రూపకం

కూరిమి గల్గితే జాలు కోపించినా మేలువో
అరయ నోరమణుడ అంతాను మేలువో ! ॥పల్లవి॥

మనసున నీవు నన్ను మఱవకున్నా జాలు
యెనసి నీ వేడ నున్నా వియ్యకోలే పో
నను వలపు నీవు నాపై జల్లితే జాలు
వెనక నీవేమన్నా వేడుకవే పో ! ॥కూరిమి॥

పాయము నీ మేని మీద పచ్చిగా నుండితే జాలు
రాయడి విరహమైన రాజ్యపదవి
యే యెడ నీ చూపొక మాటిటు పై జారితే జాలు
నాయములు దప్పి నీవు నడచినా మేలువో ! ॥కూరిమి॥

పానుపుపై కూడి నాకు పంతమిచ్చితే జాలు
కానని కన్నుల నీ బింకాలు మేలేపో
ఆనిన శ్రీ వేంకటేశ అంతలో నన్నేలితివి
కోనల నీ కొనగోరి గుఱుతులు మేలువో ! ॥కూరిమి॥

రేకు : 26—98

ప. సా స ని దా పా || మ ప ని ద ద ప మ గ గ రి ||
కూ రి - మి గ || ల్లి - తే - చా - - - లు - ||

రి మ గ స రి మ ప || పా స స ని సా ||
కో - - పిం - చి నా || మే - లు - వో ||

ప ని స రి రీ || రి ప మ గ రి గ రీ సా ||
అ - ర య వో || ర - మ - ణు - - డ ||

స రి మ రి ని స రి స ని ద పా || ద ప మ గ రి మ ప నీ ||
అం - - - తా - - - ను - - || మే - - - లు వో - - || ||కూరిమి||

చ. రి రి రి రి ప మ గ రీ || రి మ రి స సా రి స ని ద పా ||
మ న సు న - - - - || నీ - - వు న - - - - న్నా ||

మ ప ని స రి స || రి మ గ రి రీ ||
మ ఱ వ కు - న్నా || - - చా - లు ||

రి మ ప ప స ని ద పా || మ ప ని ద ద ప మ గ ||
ఘ న సి నీ - - - - || వే - డ - ను - - న్నా ||

రి రి రి మ గ గ రి || సా - - - - ||
ని య్యా కో లే - - - || పో - - - - ||

రి మ ప ప స ని || - స రి స రి రీ ||
న ను ఫు వ ల పు || - నీ - వు నా పై ||

రి ప మ గ రీ రి మ రి స || సా రి స ని సా - - ||
జ - - - ల్లి తే - - - || చా - - - లు - - ||

ప ని స రీ గ రి సా || సా రి స ని ద పా ద ప ప ||
వె న క నీ - - - || వే - - - - - మ - న్నా ||

మ ప ని ద ద ప మ గ రీ || మ గ గ రి స రి మ ప నీ ||
వే - - - డు - క - లే || పో - - - - - - - - ||

॥కూరిమి॥

**అవతారిక :**

వదనము చంద్రబింబమును పోలిన పూవనియు, ఆ పూవునందు కన్నులనే తామరలు విరిసెననియు, ఆతామరల నడుమ నాసిక చంపకపుష్పమై యున్నదనియు, ఆ పూవునకు దిగువ ముప్పదిరెండు మొగ్గలు వరుసగా అవతరించెననియు, నాయిక సౌందర్యమును మనోజ్ఞమైన ఉపమాలంకారముల అన్నమయ్యవారు యీ పదమునందు వర్ణించుచున్నారు.

కేదారగౌళ—ఝంపె

భామ శృంగారించు భావమే యందము
కాముని రతిసాటి కాంతలీలాగు ! ॥పల్లవి॥

పూవొకటి వికసించె పున్నమి చంద్రుని వలెనే
పూమీద మరిరెండు పూలుబూసె
రెండుపూవుల నడుమ పూసెనొకపువ్వు
పూవు కింద ముప్పదిరెండు మొగ్గలెత్తె ! ॥భామ॥

పక్షి యొక్కటి వాలె భద్రేభమనగాను
పక్షిమీదను రెండు పక్షులాయెన్
రెండు పక్షుల నడుమనే గ్రాలెనొక పక్షి
పక్షితో జోడుగా పలికె నొకపక్షి ! ॥భామ॥

చిగురునే రెంటి చెందామరోయనగ
చిగురు మీదను రెండు చిగురులెత్తె
చిగురుబోణి యింట శ్రీ వేంకటేశుడు
చిగురు లోపలితేనె చెలగి చవిచూచె ! ॥భామ॥

ప. సీ స రి | రి గ మ గ గా మ రి రీ ||
భా మ శ్యం | గా - - - రిం - - చు ||

రి మ ప ని ద ద ప | పా ద ప మ గ గ రి మ రి సా ||
భా - వ మే - - - | యం - - - - ద - ము - - ||

రి మ ప ప ని | స రి మ గ గ రి సా ||
కా - ము ని - | ర తి సా - - - టి ||

సా రి స ని ద పా పా ద ప మ గ | రి మ రీ సా - || సి స రీ
కాం - - - - త లీ - - - - | లా - - గు - || భా మ శ్యం

చ. - ప ప ప ప | మ ప ని ద ద ప మ గ గ రి ||
- పు వ్వొ క టి | వి - క సిం - - - - చె - ||

రి రి మ గ గ రి సా | స స ని స స స ||
పు న్న మి - - - చం | ద్రు ని - వ లె నె ||

- స స స ని ధ ని | ధ మ ఫా సా స ||
- పూ మీ - - - ద | మ - రి రెం డు ||

రి మ ప స స స ని ద | దా ని ప పా - ||
పూ - - లు పూ - - - | సే - - - - ||

- రి మ ప ని | స రి రి రి రి || రి ప మ గ గ రి రి మ రీ | సా - ని సా - ||
- రెం డు పూ - | వు ల న డు మ || పూ - - - నె - నొ - క | పూ - - వు - ||

ప ని సఀ రిఀ మ గఀ గఀ రిఀ | సాఀ సఀ ని రిఀ సఀ ని ద ప ||
వూ - వు కిం ద - ము - | ప్వ ది - రెం - - - డు ||

ప ని సాఀ సాఀ రిఀ సఀ ని ద పా | పా ద ప మ గ గ రి మ రి సా || నీ స రీ
పూ - - మొ - - - - గ్గ | లె - - - - - - త్తె - ను || భా మ శ్యం

**అవతారిక :**

ఇందలి నాయిక ప్రౌఢ, చతుర. ఈమె తనతో కలసి యలసి సొలసిన నాయకుని వ్యంగముగా "నిన్నుచూచి నేను నవ్వినందుకు సంతసించవలదా? మెరుగులు పోయిన నీమోవికి నేనువిడియ మిచ్చితే తప్పా? అలసి చెమటలతోనున్న నీపై గంధపుపొడి చల్లితే ఆనందించవలదా? నీకన్నుల కంటిన కుంకుమలు పోవునట్లు పన్నీరు చిలికితే పాపమా? పిప్పియైన నిన్నుతిరిగి పురికొల్పితే సంతసించిపై కొంటివి. చప్పుడు సేయక యూరకున్నానుసుమా" అనితన య శందమును స్వామికి నివేదించుచున్నది.

కేదారగౌళ—త్రిపుట

మాఱు మోవిదేటికి మంకుదన మేటికి
జాఱువడ నే నవ్వితే సంతసించవలదా ? ॥పల్లవి॥

వడి నీకెమ్మోవి మీది వన్నెదీసినది చూచి
తొడరి పీడెమిచ్చితే దోసమాయిది
కడుచెమటల నీపై గందవొడి చల్లి తేను
జడియక నీవిందుకు సంతసించవలదా ? ॥మాఱు॥

కులికి నీకన్నులపై కుంకుమ వన్నెలుచూచి
బలిమి బన్నీరిచ్చితే పాపమాయిది
కలసిన పేడి వేడి కాకలమే నటుచూచి
చలిగా నే విసరితే సంతసించ వలదా ? ॥మాఱు॥

పిప్పియైన నీమేని పెక్కులాగులటు చూచి
ముప్పిరి గళలంటితే మోసమాయిది
అప్పటి శ్రీ వేంకటేశ అలమితి విటునన్ను
చప్పుడు గాకియ్యకొంటే సంతసించవలదా ? ॥మాఱు॥

శృ : 13–43

ప. – – ప | సా – ని ఠి సని ద || పా ని ద ద ప | మ గ గ రి సా ||
– – మా | ఉ – – మో – వి – || దే – – – – | టి – – – కి ||

– – ధ ని | స రి మ గ గ రి సా || స ని రి స ని ధ | ధ ని పా నీ ||
– – మం – | కు – – – త – – || న – – – – – | మే – – టి ||

సా ధ ని | సా రి రి || రీ – మ గ స | రీ మా ||
కి జా – | ఉ వ డ || నే – – – – | న వ్వి ||

పా ప | సా సా ఠి స ని ద || ద మా పా – | నీ సా ||
తే సం | త సిం – – – – || చ . వ – | ల దా || ||మూఉ||

చ. – – రి రి | రీ రీ || రి మ పా ద ప మ గ | గ మ రీ రి మ రీ ||
– – వ డి | నీ కె || మో్మ – వి – – – – | మీ – – – – – ||

సా ధ ని | సా రీ గ రి సా || సా రి స ని ధ పా | నీ సా ||
ది వ – | న్నె దీ – – – || సి – – న – – | చూ చి ||

– – రి రి | రి మ గ గ స || రీ – | మా పా ||
– – తొ డ | రి – – వీ డె || మి – | చ్చి తే ||

– – రి మ | ప స ని ద ద ని పా || పా ద ప మా | పా – – ||
– – దో – | స – – – మా – – || యి – – – | ది – – ||

– – ప ప | ని ద ద ప మ గ గ రి || గ సా | రి మ పా ||
– – క డు | చె – మ – ట – ల – || నీ – | పై – – ||

– – రి మ | ప స సా ఠి స ని ద || ద మా పా – | సా స ని సా ||
– – గం – | ద – వొ – – – – – || డి – చ – | ల్లి – – తే ||

సా ప ని | స రి రీ || రి ప మ గ మ రి | రి మ రీ సా ||
ను జ డి | య – క || నీ – విం – – – | దు – – కు ||

– – ని స రీ గ రి | సా సా రి స ని ద ||
– – సం – త – – | – సిం – – – – – ||

మ ప దా ని ద పా | పా ద ప మ గ రి మ రి స ||
చ – వ – – – | ల – – – – దా – – – ||

రి మ పా
– – –

||మా యి||

**అవతారిక :**

రామాయణ గాథలను అన్నమయ్యవారు కీర్తనలుగా రచించినట్లు వాడుక. ఇందు శ్రీరామ చంద్రుని రాక్షస సంహార సంరంభము వర్ణించుచు, ఆ స్వామి పరాక్రమములను కొనియాడుచున్నారు.

**రాగ లక్షణము :**

శంకరాభరణము ప్రాచీన మేళము. సర్వగమక వరి కాదులతో నొప్పుచు అత్యంత మనోహరముగా నుండెడి రక్తి రాగములలోనిది నొకటి. ఈ రాగము సంపూర్ణ సంపూర్ణము. వెంకటమఖి సంప్రదాయమునను ఇదే విధముగా చెప్పియున్నారు. ఇప్పుడిది 29వ మేళకర్త ధీర శంకరాభరణముగా వాడుక.

**శంకరాభరణం — ఆది**

వినుడిదె రఘుపతి విజయములు
ఘనుపడి రాక్షస బాధలుడిగెను ! ॥పల్లవి॥

కులగిరులదరెను కుంభినివడకెను
ఇల రాముడు రథమెక్కినను
కలగె వారిధులు కంపించె జగములు
బలు విలునమ్ములు వట్టినను ! ॥వినుడిదె॥

పిడుగులు దొరిగెను పెనుగాలి విసరె !
తొడిబడ బాణము దొడిగినను
ముడివడె దిక్కులు మొగ్గె దిగ్గజములు
యెడపక రావణునేసినను ॥వినుడిదె॥

చుక్కలు డుల్లెను స్రుక్కె భూతములు
తొక్కి యసురతల దుంచినను
గక్కన శ్రీ వేంకటగిరి నిలువగ
అక్కజమగు శుభమందరి కొదవె ! ॥వినుడిదె॥

అ : 11(1)–223

ప. స ని̣ స రి గ గ గ రి | గ మ ప మ | గా మ రి ||
వి ను డి దె ర ఘు ప తి | వి జ య ము | లు – – ||

గ మ ప మ గ రి స ని̣ | స రి గ స | రి స స ని̣ ||
ప ను ప డి రా – క్ష స | బా – ధ లు | తొ ల గె ను || ||వినుడిదె||

చ. గ మ ప మ గ రి స ని̣ | స రి గ స | రి రి రి రి ||
కు ల గి రు ల ద రె ను | కుం – భి ని | వ డ కె ను ||

గ మ పా ద ప ప మ | మ ప ద ని | సా – – ||
యి ల రా ము డు ర థ | మె – క్కి న | ను – – ||

ప స ని స రి స ని స | రి గ మ గ | రి రి స ని ||
క ల గె వా – రి ధు లు | కం – పిం చె | జ గ ము లు ||

ద ని స ని ద ద ప మ | ద ప ప మ | గ రి సా ||
బ లు వి లు న – మ్మె లు | వ – – ట్టి | న పు డు || ||వినుడిదె||

**అవతారిక :**

వేద వేదాంతములను చదువుట, పురాణములను, వినుట పెద్దలను కొలుచుట, మొదలగునవి యెన్ని చేసినను పాపచింతలు, పాపకార్యములు, చీకటి బ్రతుకులు విడవాడని మనసుండినచో ఏమి ప్రయోజనము ? తిరువేంకటనాథుని సేవించి తరించని బ్రతుకులకు పాపములే సంబళములని అయ్యవారు చెప్పుచున్నారు.

**శంకరాభరణం—ఆది**

పాపములే సంబళ మెపుడు - యీ
యాపద బడి నే నలసేనా ! ॥పల్లవి॥

ఎన్ని పురాణము లెటువలె విన్నా
మన్న మనువు దిమ్మరి తనమే
నన్ను నేనె కానగ లేనట నా
విన్న వినుకులకు వెఱచేనా ! ॥పాపము॥

ఎందరు పెద్దలనెట్ల గొలిచినా
నిందల నామతి నిలిచీనా
కందువెఱిగి చీకటికి దొలగనట
అందపు బరమిక నందేనా ! ॥పాపము॥

తిరువేంకట గిరి దేవుడె పరమని
దరగని తెలివిక దాగీనా
తిరముగ నిను జింతించిన చింతే
నిరతము ముక్తికి నిధిగాదా ! ॥పాపము॥

అ : 11(3)–16

ప. రి గ మ గ రి రి సా | ని స ధ ని | సా సా ||
పా - ప ము లే - సం | బ ళ మె పు | డు యా ||

స ధ నీ స స రి రి స ని | స రి గ స | స రి రి స ||
యా - - ప ద బ డి నే - | న ల సే - | నా - - - || ॥పాపము॥

చ. మ గ మ ప ద ప ప ప | ద ని స ని | ద ద ప ప ||
ఎ - న్ని పు రా - ణ ము | లె టు వ లె | వి - న్నా - ||

ద ని స ని ద ప ప మ | గ రి గ మ | పా - - ||
మ - న్న మ ను వు ది - | మ్మ రి త న | మే - - ||

స స ని స రి రి స ని | స రి గ మ | గ రి స ని ||
న - న్ను నే - నె కా - | న గ లే - | న ట నా - ||

ద ని స ని ద ప ప మ | గ రి స ని | సా - - ||
వి - న్న వి ను కు ల కు | వె ర చే - | నా - - || ॥పాపము॥

**అవతారిక :**

ఇందు నాయిక విరహోత్కంఠిత. ఈమె విరహావస్థలను చెలులు వేంకట నాథునితో విన్నవించుకొని అలుకలు వలదనియు యీతరుణిని కరుణించమనియు వేడుకొను చున్నారు.

**శంకరాభరణం — ఝంపె**

తరుణి నీ యలుక కెంతటిదింత యీ వేళా
గరుణించ గదర వేంకటశైల నాథా ! ॥పల్లవి॥

ఒక మారు సంసార మెల్లంబొమ్మని తలంచు
నొక మారు విధిసేత లూహించి పొగడు
నొక మారు తనుం జూచి వూరకె తలవూచు
నొక మారు హర్షమున బొందిమై మఱచు! ॥తరుణి॥

నిన్నుంజూచి వొకమారు నిలువెల్లంబులకించు
తన్నుం జూచి వొకమారు తలపోసినగును
కన్ను తెరచి నినుం జూచి కడు సిగ్గువడి నిలిచి
యిన్నియునుం దలపోసి యింతలో మఱచు ! ॥తరుణి॥

వదలైన మొలనూలు గదియించు నొకమారు
చెదరిన కురులెల్లం బెరుగునొక మారు
అద నెరింగి తిరు వేంకటాధీశ పొందితివి
చతురుండవు నినుబాయం జాలదొకమారు ! ॥తరుణి॥

శృం : 3—455

ప. - స రి గ మ ప మ గ | రి రి స సా ||
- త రు ణి నీ ా - - | య లు క కెం ||

స ని గ రి సా ని | స ధ నీ సా స ||
త - టి - దిం త | యీా - - వే ళ ||

- స ప ప ప మ గ మ రి | గ మ ప ప ద నీ ||
- క రు ణిం - - - చ - | గ ద ర వేం - - ||

స ని ద ప మ | గ రి సా - ||
క ట కై - ల | నా - థా - ||

॥తరుణి॥

చ. - స ని ద ప మ | గా మ ప మ గ మ రి రి ||
- వ ద లై - న | మొ ల - నూ - - - లు ||

- మ గ సా స ని | స రి గ స రి రి ||
- గ ది యిం చు - | నో - క - మా రు ||

- మ గ మ పా | పా స ని ద ప ప ||
- చె ద రి న | కు రు - లె - ల్ల ||

మ ద ప మ గ ప మ గ గ రి | స రి గ మ పా - ||
చె - రు - గు - నో - క - | మా - - - రు - ||

- స ని స రి రి | రి స రి రి గ ||
- అ ధ నై రి గి | తి రు వేం - క ||

స మ గ రి గ రి స | స ని సా ద ని స ||
టా - - ధీ - - శు | పొం - - ది తి వి ||

- స స స స స ని | ద రి స ని ద ప మ ||
- చ తు రు డ వు - | ని - ను - బా - య ||

గ మ పా ద ని ద ప మ గ | రి మ గ రి సా - ||
జా - - ల - దొ - క - | మా - - - రు - ||

||తరుణి||

**అవతారిక :**

ఇందు విరహార్తయగు నాయిక విరహ వేదనను గమనించి చెలికత్తెలు ఒకరితో నొకరు చెప్పుకొనుచున్నారు. "నాయకుని పిలుచుకొని రండమ్మా! ఈమెకు వెన్నెల పోగుల కాకలు ఎక్కువై చెమటలచే ఒడలు తడిసి యున్నది. పూపాన్పుపై తొల్లిటి పనులను తలచి తలచి కాకలకులోనై పొరలుచున్నది. ఈమె విరహమును శ్రీ వేంకటేశ్వరునకు విన్నవించ గదరమ్మా! అతడు వచ్చి చలువలు చల్లగలడు." అని యనుకొనుచున్నారు.

**శంకరాభరణం — ఆది**

పిలువా గదరే ప్రియునిని
చలువా లాతడు చల్లీ గానీ! ॥పల్లవి॥

తలపా రాదింతి తమకము రేగి
చెలపా చెమటాయ చెక్కులను
పొలపా వెన్నెల పోగులకు మతి
గొలుపా దీకె కెక్కుడు విరహమునా ॥పిలువా॥

కెరలి మును మరిగిన పొందూ, లోలో
మరలీ కాకలై మనసుననూ
పొరలీ బూఁబానుపున నీపెకు, వాడు
దొరలీ దియ్యారె తొలు విరులెల్లా ॥పిలువా॥

అలసె మోహపు టాసల, కడు
బలిసె జన్నులు పైపై నే
కలసె శ్రీ వేంకట పతి మారు
మలసే విదివో మరు బలములకూ! ॥పిలువా॥

రేకు: 24–167

ప.　రి రి గా రి గ మా | గ గ గ రి | సా - - ||
　　పి లు వా గ ద రే | ప్రి యు ని - | నీ - - ||

　　ని̣ స రీ రి రి రి స | స రి గ మ | గా గా ||
　　చ లు వా లా త డు - | చ - ల్లి - | గా నీ ||　　॥పిలువా॥

చ.　ప ప పా ప మ గా రి | స ని̣ స రి | గ మ పా ||
　　త ల పా ర - దిం తి | త మ క ము | రే - గీ ||

　　మ ప ద ని సా స̇ ని ద ప | పా ప మ గా మ రి | గ మ పా ||
　　చె ల పా - చె మ - టా - | య - - చె - - | క్కు లు ను ||

　　స̇ ని స రి̇ రి̇ స̇ స̇ ని | స̇ రి̇ గ̇ మ̇ | గ̇ రి̇ స̇ స̇ ||
　　పొ ల పా - వె - న్నె ల | పో - - గు | ల కు మ తి ||

　　ప ప సా స̇ ని ద ప పా | ప మ గ రి | స ని̣ సా ||
　　గో లు పా దీ - - కె కె | క్కు డు వి ర | హా ము న ||　　॥పిలువా॥

**అవతారిక :**

ఇందు నాయిక కోపోద్దీపిత. నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని చిలిపి చేతలను చెప్పుచు మందలించుచున్నది. "దొరవగు నీతో సంగతి యెంతదొరికితే అంతే చాలును లేవయ్యా. తెరలోనుండి ఏల నయగారముల నొలుకబోయుచున్నావు? నిజమగు తమి నాపై కలిగిన తెరదీసుకు రావయ్యా! నీవు వేరొకతెతో నుండి నన్ను రమ్మనుట చెల్లునా?" యని అతని పనులను మొగమాటమిలేకుండ చెప్పుచున్నది.

శంకరాభరణం—రూపకం

దొరతో సంగాతము దొరికిన పాటే చాలు
వొరసి మీరగ బోతే నొక్కరీతి నుండునా! ॥పల్లవి॥

యేకతాన లోన నుండి యేలనన్ను బిలిచేవు
వాకిటికి రావయ్యా వలసితేను
చేకొని యొకతె యుంటె సిగ్గువడి వెళ్ళి వచ్చి
కూకలు వత్తులుగాను కూళదాననా! ॥దొరతో॥

మరగించి మరగున మాట లేలాడించేవు
తెరదియ్యవయ్యా అంత తీట గలితె
వరుసకు వచ్చి నాపె వాదు నాతో బెట్టుకొంటె
విరసమై యూరకుండ వెఱ్ఱిదాననా? ॥దొరతో॥

పట్టె మంచముపై నుండి పైగాలు చాచనేల
యిట్టె వుర మెక్కవయ్యా యింత గలిగె
జట్టిగా శ్రీ వేంకటేశ సరినొకతె గూచుంటె
వట్టి యితవు సేసుకో వ్రాసిలేని ద్దాననా! ॥దొరతో॥

ప. - స పా ప మ గ మా ॥ పా మ ప దా ప ప ॥
- దొ ర తో - - - ॥ సం గా - - త ము ॥

- ప ద ని సా - స ద నీ ॥ పా - మ ద ప మ గ ప మ గ రి ॥
- దొ రి న - - పా - - ॥ ఛే - - చా - - - లు - ను - ॥

స స రీ గ మా గ రి గా ॥ సా స ధ నీ సా ॥
- వొ ర సి మీ ర - గ ॥ బో - - - తే ॥

పా గ రి సా - ని ద ప మ గ ॥ మ ప ద ని సా - ని ద ప మ గ ॥
నొ క్క - రి - - తి - - - ॥ నుం - - - - - డు నా - - - ॥దొరతో॥

చ. - ప ప పా ప ॥ ప ద ని ప ద ప మ ॥
- ఏ క తా న ॥ లో - - న నుం - డి ॥

- గా మ ప గ మ రి గ ॥ స రి గ మ పా ॥
- యే ల - న - - న్ను ॥ బి లి చే - వు ॥

- మ పా ద నీ సా ॥ గ మ ద ప గ రి సా ॥
- వా - కి టి కి ॥ రా - వ - - - య్యా ॥

ని రి స ని స స ధ నీ ॥ సా - - - - ॥
వ - ల - సి తే - - ॥ ను - - - - ॥

ప ప ప ప మ గ మ రి ॥ మ గ మ పా ప ॥
చ్చే కొ న్ని - - - - - ॥ యొ్క క తె యుం టె ॥

మ పద నిద ॥ పదని సా స ॥
సి గ్గు వ డి - ॥ వె - ళ్లి వ చ్చి ॥

- గ గ గ రి ప మ గ రి ॥ స స స ధ నీ సా ॥
- కూ కు లు - - - వ - ॥ త్తు లు గా - - ను ॥

స రి గ మ గ రి స ని ద ప ॥ మ ప ద ని సా - ని ద ప మ గ ॥
కూ - - - - - - - - - శ ॥ దా - - - - - - న నా - - - ॥ ॥దొరతో॥

**అవతారిక :**

లోకులు కాకులవంటివారు. ఏమనుకొందురు ? వీరి నోళ్ళు మూయించుటకు ఎవరి వశము ? చెరువు మూయుటకు మూకుడున్నదా ? నీవు దానవసతుల మానములను కొల్ల గొట్టి వారి పతులను సంహరించుటకు కల్లలాడి యుందువు. కాని మాతో నసత్యములు పలుకుటకు మేమంత వారమా ?" అని నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని చేష్టలను వక్కాణించుచు నాయిక చెప్పుచున్నది.

శంకరాభరణం — త్రిపుట

ఏమైనా నాడేవారి నేమందును
మోము చూచితే చెరువునుయ్యే మూకుడున్నదా ? ॥పల్లవి॥

అడియాలముగ నీవు ఆడేవి సత్యాలేకాక
కడు మావంటి వారితో గల్లలాడేవా
జడిసి తొల్లి అసురసతులతో నేమోకాక
తడవితే నేటి వేళ తప్పు నీయందున్నదా ? ॥ఏమైనా॥

చిమ్మిరేగ నీ విన్నిటా జేసేవి పుణ్యాలేకాక
పమ్మి నీ వొళ్ళ నెంచితే పాపమున్నదా
కుమ్మరించి యీ సుద్దులు గొల్లతలందేమో కాక
నెమ్మది నీ పొద్దుకు నింద నీయందున్నదా ? ॥ఏమైనా॥

దగ్గరితే నీ వల్లను దయ దాక్షిణ్యాలేకాక
కగ్గిన నిష్ఠూర మించుకంత గలదా
వెగ్గళించి నన్నును శ్రీ వేంకటేశ కూడితివి
వొగ్గి నిన్ను దూరబోతే వొచ్చము నీకున్నదా ? ॥ఏమైనా॥

రేం : 14–67

ప. - - స | స ని ద ని పా || ప పా - మ | ద ప మ గ మా ||
- - ఏ | మై - - - న || నా దే - - | వా - - - రి ||

పా గ మ | పా ప ద నీ || సా - | స ని ద ప మ గ మ ప ||
నే - - | మం దు - ను || - - | - - - - - - - - ||

ద ని సా ని స | రీ రి స || స గ రి గా - | మ గ గ రి సా ||
- - - మో - | ము చూ - || చి - - తే - | చె - రు - వు ||

- - స | స ని ద ని పా || ప మ ద పా మ | గా మ రి గ మ ||
- - ము | య్యా - - - మూ || కు - - - - | డు - - న్న - ||

ప ద ని స | స ని ద ని పా ||
దా - - ఏ | మై - - - న ||

చ. - - ప ప | పా పా || ప మ ద పా మ | గా మ రి గ స ||
- - అ డి | యా ల || ము - - గ - | నీ - - వు - ||

రీ మ గ | సా సా || స రి సా - ధ | ని ప ప ధ నీ ||
- అ - | దే వి || స - త్యా - - | లే - గా - - ||

సా స ని | సా రీ || గా - సా - | రీ గా ||
క క డు | మా వం || టి - వా - | రి తో ||

- - గ మ | పా ద స ద ప || ద ప మ గ మా | పా - - ||
- - క - | ల్లు - - లా - || దే - - - - | వా - - ||

- - ప ప | ప ప మ గ మా || పా - | మ ప ద ని ||
- - జ డి | సి - - - తో || ల్లి - | అ - సు - ||

సా ని స । రీ ‌ఠి స ॥ ని ఠి స ని సా । స ద నీ సాం ॥
ర స తు । ల తో - ॥ నే - మో - - । కా - - క ॥

- - ని స । ఠి గ మ ప గ ఠి సా ॥ ని ఠి స ని స ద । ని ప ద ని సా ॥
- - త ద । వి - - - తే - - ॥ నే - టి - - - । వే - - - ళ ॥

- - గ మ । ప ద ద మ ॥ పా మ ద పా । ప ప మ గ మా ॥
- - త - । ప్పు - నీ - ॥ యు ం - - - । దు - - - - ॥

ప ద నీ స । స ని ద ని పా ॥
న్న - దా ప । మై - - - న ॥

**అవతారిక :**

నాయిక ముగ్ధ, విరహోత్కంఠిత. ఆమె సౌందర్యమును వర్ణించుచు ఆమె మోము వాడుటకు, పలుకు సన్నగిలుటకు, ఊర్పులు వేడియగుటకు, కురులు చెదరుటకు, మోవినలగుటకు కారణములు విరహముతో వ్యథ నొందుచుండుటయే గాని మన్మథుని సంపదలగు చంద్రుడు, కోవెల, గంధపుగాలి, తుమ్మెదలగుంపు, లేజిగురులు వంటి వానికి తీసిపోవునవి కావని, వేంకట నాథునికి చెలులు విన్నవించున్నారని అయ్యవారు చెప్పుచున్నారు.

శంకరాభరణం—ఝంపె

అతను సంపద కంటె నసదా చెలియూపు
మతి చింత చేత వేమరు నలగె గాక ! ॥పల్లవి॥

తగు జందురుని నణచ దగదా చెలి మోము
వగలచే నొకయింత వాడెగాక
పగటు గోవెల మించి పాఱదా సతి పలుకు
జగడమున బతి బాసి సన్నగిలె గాక ! ॥అతను॥

కదలు గందపు గాలి గా (వ) దా చెలియూర్పు
కదిమేటి మదనాగ్ని గ్రాగె గాక
కొాదమ తుమ్మెద గమికి గొఱతా చెలి తురుము
చెదరి మరు బాణముల చేజాఱె గాక ! ॥అతను॥

లీల బన్నిటికిని లేతా చెలి చెమట
లోలి బూబానుపున నుడికె గాక
యేల చిగురున కంటె నెరవా చెలి మోవి
గేళి వేంకట విభుడు గీలించెగాక ! ॥అతను॥

శ్రృం : 4-7

ప. స రి గ మ గ | గ రి సా ని || స ధ నీ సా - | ప మ గ రి స ని ||
1. అ త ను సం - | ప ద కం పె || న - న దా - | చె లి రూ పు - ||

2. స రి గ మ గ | గ రి సా ని || స ధ నీ సా - | ద ప మ గ ప మ గ రి స ని ||
అ త ను సం - | ప ద కం పె || న - స దా - | చె - లి - రూ - - - పు - ||

3. స రి గ మ ద ప మ | గ ప మ గ రి మ గ రి స ||
అ త ను సం - - - | ప - ద - కం - - - పె ||

స ధ నీ సా - | స ని ద ప ప మ గ రి స ని ||
న - స దా - | చె - లి - రూ - - - పు - ||

4. స రి గ మ ప ద ని | స రి స ని ద ప మ గ మ రి ||
అ త ను సం - - - | ప - ద - కం - - - పె - ||

స ధ నీ స రి గ మ ప | స ని ద ప ప మ గ రి స ని ||
న - స దా - - - - | చె - లి - రూ - - - పు - ||

స ప ప ప మ గ మా | ప ప ద నీ స ని ||
మ తి చిం - - - త | చే - - త వే - ||

స గ రి స ని ద ప | రి స ని ద ప మ గ రి స ని ||
మ రు - న - ల గె | గా - - - క - - - - - || ॥అతను॥

చ. - ప ద పా | ప మ గ మ రి మ గ రి గా ||
- లీ ల వ | స్నె - - - టి - కి - ని ||

మ ద పా - | మ గ మ ప ద మ రి స ||
లే - ఖా - | చె - లి - చె - మ ట ||

- స స సా | స ధ నీ స రి స || స రి గ మ ద ప మ | పా - - - ||
- లో లి బూ | పా - - ను పు న || ను డి కె గా - - - | కా - - - ||

- సే స స ద ని | స స ని ద ప మ || గ మ ప ద ప | ప ద ని సా స ||
- యే ల చి - గు | రు న - కం - టె || నె ర వా - - | చె - లి మో ని ||

స గ రీ రి మ గ రి | సా స ని స ద ని స ||
గే - లి వేం - - - | క ట - వి - భు డు ||

స రి స ని ద ప ప మ | ద ప మ గ ప మ గ రి స ని ||
గీ - - - లి - చె - | గా - - - క - - - - - - ||

॥అతను॥

**అవతారిక :**

ఇందు విరహార్తయగు నాయిక అవస్థలను చెలులు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరునితో విన్నవించుచున్నారు. "ఆమెకు సందేశమేదైనా చెప్పెదవా! ఆమె పంపిన పూలబంతి సువాసనల నాఘ్రాణించి ఆనందించితివా! ఆమె పెట్టిన సేసలకు నీకు పులకలు నిండినవా! ఈమె అలమేలుమంగయై నీ చెంతనుండగా నీవు అప్పటి చేతలను చూపులను తలచుకొనుచుంటివా, చెప్పవయ్యా!" అని అడుగుచున్నారు.

**రాగ లక్షణము :**

కురంజి ప్రాచీన రక్తిరాగములలో నొకటి. ఇది దైవతాంత్యములగు రాగముల యందలిది. ఇందు 'ని స రి గ మ ప', ద ప మ గ రి స ని అనునవి ఆరోహణావరోహణములుగా చెప్పబడియున్నను క్రింది పంచమమును 'స ని నీ ధ' అని పట్టుట వాడుక యందు కలదు. దీనిని నవరోజు రాగముతో వేరుపరచుట లక్ష్యజ్ఞానము గల వారి నుండి తెలుసుకొనవలసి యుండును. ఇది యిప్పటి వాడుక ప్రకారము 29వ మేళమగు, శంకరాభరణ జన్యము. ప్రయోగములు, స్వర సందర్భములు, గమక వరికాదులు మాత్రమే రాగములను గుర్తించుటకు ఆధారములుగా నుండెడి రోజులలో జనించిన కొన్ని రక్తిరాగములకు ఆధారములు అందలి ప్రాచీనుల రచనలు మాత్రమే!

**కురంజి — త్రిపుట**

అంగన నిన్నడిగి రమ్మనె నీ మాట
సంగతిగ మరుమాట సరి నాన తీవయ్యా! ॥పల్లవి॥

చెలులచే నింతి నీకు చెప్పిపంపిన మాటలు
తలచుకొన్నాడవా దయతో నీవు
తొలుత గాను కంపిన దొడ్డపూవుల బంతి
లలిమించిన పరిమళము గొంటివా! ॥అంగన॥

చాయల నాసతో నాపె సారె జూచిన చూపులు
ఆయములు గరచెనా అంటుకొనెనా
చేయెత్తి సిగ్గుతోడ చేరి మొక్కిన మొక్కులు
ఆయనా నీకు శలవు అందరిలోనా! ॥అంగన॥

తెరసి తెరమాటున బెట్టిన నీపై సేసలు
శిరసుపై నిండెనా చిందెనా నీపై
అరుదై శ్రీ వేంకటేశ అలమేలుమంగ యీకె
గరిమ నిన్ను గూడి గద్దెపై గూచున్నది! ॥అంగన॥

శృం. : 18–461

ప. - - ని | సా సా || స రి గా స | రి రి గా ||
- - అం | గ న || ని - - - | న్న డి గి ||

మ పా - గ | మ గ గ రి || రి మ రి స | సా సా ||
ర మ్మ - - | - - నె - || నీ - - - | మా ట ||

- - ని | స స సా || స ని నీ ఫ | ఫా స ని సా ||
- - సం | గ తి గా || మ - రు - | మా - - ట ||

- - స రి | గ స రీ || ప మ గా | మ గ రీ సా ||
- - స రి | నా - న || తీ - - | వ - - య్యా || ||అంగన||

చ. - - మ గ | సా స స || సా - | స ని నీ ని ఫ ||
- - జె ర | సి తె ర || మా - | టు - - న - ||

ఫా ఫ | స ని సా || స రి గ స | రి స స న ||
- జె | ట్టి న నీ || పై - - - | సే - స లు ||

సా స రి | గ స రీ || గా - | మ గ గ రి ||
- శి ర | సు - పై || నిం - | డె - నా - ||

రీ గ | మ ప ప ప మ గ || గ రి రి మ రీ | సా - - ||
- చిం | దె - నా - - - || నీ - - - - | పై - - ||

- - స ప | ప ప మ గ గా ప మ గ రి || మ గా మా - | పా పా ||
- - అరు | దై - - - (ి) - - - - || వేం - క - | టే శ ||

- - మ గ | మా ప ద పా ప ప మ గ || రి గా మా గ | రీ రీ ||
- - అల | మే - - - లు - - - || మం - గ - | యీా కె ||

రీ మ గ | మ ద పా || ప ప మ గా - | గా మ రి రీ ||
- గ రి | మ - ని || న్ను - - - - | గూ - - డి ||

- - స ని | సా స రి గ మ || పా - | గ రి స ని || సా ని | సా సా ||
- - గ - | ద్దె పై - - - || గూ - | చు - న్న - || ది అం | గ న ||

**అవతారిక :**

ఇందు కోపోత్కంఠితయగు నాయికను చెలులు మందలించుచున్నారు. "అతని తప్పేమియు లేదు. అతడు కొలువుండి యుండుట నేరమా ? నీతో చనవున నుండి సరసమాడుట నేరమా ? వాకిలి తెరిచి ఆతనిని పిలిచి ఆదరించరాదా !" అని దగ్గరి వారగు చెలులు తరచి తరచి నాయికకు చెప్పుచున్నారు.

కురంజి—రూపకం

దండనున్న చెలుల మిందరము సాక్షి
నిండు దొర యీతనికి నేరమేమి లేదు ! ॥పల్లవి॥

వట్టి చలములుమాని వాకిలి దెరవరాదా
యిట్టె విభుడు వచ్చి యీడనున్నాడు
వొట్టినట్టు కొలువై వుండిన దొక్కటే కాని
నెట్టన నితని వల్ల నేరమేమీ లేదు ! ॥దండ॥

దిచ్చరి కోపము మాని తెర దియ్యరాదా
చొచ్చి వచ్చి రమణుడు చూచీ నిదే
అచ్చముగ సరసము లాడిన దొక్కటే కాని
నిచ్చలు నితని వల్ల నేరమేమీ లేదు ! ॥దండ॥

పంతపు వేసాలు మాని పయ్యెద దెడలించరాదా
చెంత శ్రీ వేంకటేశుడు చేయిచాచీని
యింతలోన నిన్నుగూడె నిదియొక్కటే గాని
నింతము సేసలితని నేరమేమీ లేదు ! ॥దండ॥

శృం : 19-49

ప. రి మ గ సా స || - ని స రి సా ని || - ధ స ని సా రి || గ స రీ - - ||
దం - డ ను న్న || - చె లు ల మిం - || - ద ర ము సా - || కీ - - - - ||

- స రి గ మా || పా ప ప మ గ మా ||
- నిం డు దొ ర || యా త - ని - కి ||

- రి మ గ సా స || స ని నీ సా ప మ గ రి || స రి మ గ సా స ||
- నే - ర మే మి || లే - - దు - - - - || - దం - డ ను న్న ||

చ. - స స స స స || ని స గ రి రి స సా స ని నీ ||
- వ ట్టి చ ల ము || లు - - - మా - - ని - - ||

- ధ స సా ని స స || రి రి గ స సా || - ని సా రి రి || గ స రీ గా ||
- వా - కి లి - తె || ర వ రా - దా || - యి ట్టె వి భు || డు - వ చ్చి ||

- గ మా పా || గ మ రీ సా - - ||
- యా డ ను || న్నా - - డు - - ||

- ప పా ప మ గా || గ మ రీ మ గ మా ||
- వొ ట్టి న - - || ట్టు - - కొ లు వై ||

- ప ప ప ప మ గా || మ ద ప మ గ రి ||
- వుం డి న దొ - క్క || చే - కా - ని - ||

- మ గ మ గ మ || పా - మ గా - రి రీ ||
- నె ట్ట న ని త || ని - - వ - - ల్లి ||

- ధ స ని స రి గ స || రీ సా - - || - రి మ గ సా స ||
- నే - ర మే - - మీ || లేదు - - || - దం - డ ను న్న ||



**అవతారిక :**

ఇందు బాలకృష్ణుని చేతలను తల్లి యశోదమ్మకు చెప్పుచు, తమలో తాము ఆనందించుచు గోపికలు గానము చేయుచున్నట్లు అయ్యవారు చెప్పుచున్నారు.

ఇందు ఉద్దగిరి యను క్షేత్రమును పేర్కొన్నారేమోనని తోచుచున్నది. బిళ్ళగోళ్ళు, సముద్ర బిళ్ళలు, పుట్టచెండులు, సిరిసింగన వత్తి, అను ఆటల పేర్లను చెప్పియున్నారు. వీటిలో ఏవైన ఆటలిప్పుడు మనబాలురు ఆడుచున్నారో యేమో !

**రాగ లక్షణం :**

ఒకప్పుడు యీ దేవక్రియ రాగము మంచి ప్రచారమున యుండి యుండవచ్చును. ఇది ప్రాచీన రాగము. దీనికే తరువాతి కాలమున 'శుద్ధ సావేరి' యను పేరువచ్చినట్లు తోచుచున్నది. దీక్షితులవారి సంప్రదాయమున ఇంకను దీనిని 'దేవక్రియ' యనియే చెప్పియున్నారు.

స రి మ ప ద స  ఆరోహణము

స ద ప మ రి స  అవరోహణము

ఇది యే పేరుతో పిలువ బడినను 29వ మేళమగు శంకరాభరణ జన్యముగానే వాడుక యందున్నది.

**దేవక్రియ — తిశ్రఏక**

విచ్చన విడిసె యాడీ వీడె కృష్ణుడు
వొచ్చము లేనివాడు వుద్దగిరి కృష్ణుడు !  ॥పల్లవి॥

గల్లు గల్లు మనగాను గజ్జెలు నందెల తోడ
బిల్లగొట్లాడీని పిన్న కృష్ణుడు
కెల్లురేగి వీధులను గేరి పుట్ట చెండులాడీ
బల్లిదుడు గదవమ్మ బాలకృష్ణుడు !  ॥విచ్చన॥

తమితోడ గోపాలులు తాను గూడి ముంగిటను
సముద్ర బిల్ల లాడీ సాధుకృష్ణుడు
చెమటలుగార సిరిసింగన వత్తియాడీ
గుమ్మితాన వీడేయమ్మా గోపాలకృష్ణుడు ॥విచ్చన॥

వుదుటున బారి సారి వుద్ద గచ్చకాయలాడీ
ముదము దొలకగాను ముద్దు కృష్ణుడు
అదివో శ్రీ వేంకటేశుడాట లెల్లా దానెయాడీ
పదివేలు చందాల శ్రీపతియైన కృష్ణుడు ॥విచ్చన॥

అ : 10–172

ప. దా సా రి స దా | ప మ ప పా పా || మ ద ప మ రి స | రి మ పా - - ||
వి చ్చ - - న | వి డి నెయా డీ || వీ - డె - కృ - | ష్ణ - డు - - ||

మా ప ద పా | పా ద ప మ రీ స || స ధ స రి మా | పా ద పా - ||
వొ చ్చ - ము | లే - - ని వా డు || వు - ద్ద గి రి | కృ ష్ణు డు - || విచ్చన ||

చ. దా ద దా ద | పా ద ప మా మ || రి మ రి స నీ | మ మ పా పా ||
గ ల్లు గ ల్లు | మ న - గా నె || గ - జ్జె లు అం | దె ల తో డ ||

దా స పా ద | మా ప రి మ || స ధ స మ రి మ | పా - - - - ||
బి ల్ల గో - | ట్లా - డీ ని || పి - న్న కృ - ష్ణు | డు - - - - ||

ప మ ప స ద స | రీ మ స రీ || రీ మ సా రి | దా స పా ద ||
పె - ల్లు రే - గి | వీ ధు ల ను || గే రి పు ట్ట | చెం డు లా డీ ||

ప మ ప ద సా రి స | ద ప ద రి సా || స ద స మ రి మ | పా - - - - ||
బ ల్లి దు ధు - - - | గ ద వ - మ్మా || బా - ల కృ - ష్ణు | డు - - - - ||
||విచ్చన||

**అవతారిక :**

ఇందు 'మానవులు చేయు సర్వ కర్మములును పరమాత్ముడగు శ్రీ వేంకటేశ్వరుని లీలలే. దానములు, తపములు, మోనములు, జ్ఞానములు, జపములు వినుతులు, వేదాధ్యయనములు, ఉపవాసాది దినములు దుటయు, తీర్థయాత్రలు చేయుటలు, ఘనమగు పుణ్యములు చేయుటయు, చదువులు చదువుటయు, యోగాభ్యాసాదులను జేయు ఫలము యివన్నియు మానవులకు భగవంతుడగు శ్రీ వేంకటేశ్వరుని కృపాకటాక్షమే. ఇవి యన్నియు నిజమునకు ఆతనికే చెందుచున్నవి' అని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణము :**

బంగాళ ప్రాచీన రాగము. ఇందు అన్నమయ్యవారి రచనలు అక్కడక్కడ ఉన్నను, వారి తరువాతి వారైన క్షేత్రజ్ఞులు, రామదాసు, నారాయణ తీర్థులు, మొదలైన వారి రచనలు దొరకుటలేదు. ఇటీవలి వారైన త్యాగరాజస్వామివారి రచనలు ఒకటిరెండు యిప్పుడు వాడుక యందున్నవి. రాగస్వరూపమును ఈ రచనల వలననే తెలుసుకొనుటకు వీలున్నది. ఇది యిప్పుడు 29వ మేళమగు శంకరాభరణ జన్యముగా వాడుచున్నారు.

స రి గ మ ప ద ప స : ఆరోహణము.

స ని ప మ గ మ రి స : అవరోహణము.

'ప ద ప ని స' అను ప్రయోగమును కనబడుచున్నది. దీనిని ఇప్పుడు వాడుక యందు వినబడుచున్న పూర్ణచంద్రిక, జనరంజని మొదలగు రాగముల నుండి వేరుచేసి అభ్యసించుట కొంత కష్ట సాధ్యమే.

**బంగాళ—త్రిపుట**

భావించి తెలుసుకొంటే భాగ్యఫలము
ఆవలీవలి ఫలము లంగజ జనకుడె ॥పల్లవి॥

దానములలో ఫలము, తపములలో ఫలము
మోనములలో ఫలము ముకుందుడె
జ్ఞానములలో ఫలము జపములలో ఫలము
నానా ఫలములును నారాయణుడె ॥భావించి॥

వినుతులలో ఫలము వేదములలో ఫలము
మనసులోని ఫలము మాధవుడె
దినములలో ఫలము తీర్థయాత్రల ఫలము
ఘన పుణ్యముల ఫలము కరుణాకరుడె ||భావించి||

సతత యోగఫలము చదువులలో ఫలము
అతిశయోన్నత ఫలము యచ్యుతుడె
యతులలోని ఫలము జితకామిత ఫలము
క్షితి మోక్షము ఫలము శ్రీవేంకటేశుడె ||భావించి||

అ: 10–291

ప. సా రి | గా మా || ప ప మ | రీ సా ||
భా - | విం చి || తెలుసు | కొం టే ||

స ని ధ | ని స రీ || గ మ ప మ రీ | సా - - ||
భా - గ్య | ఫ లము || - - - - - | - - ||

పా ప | ప మ గ మ రి స || రి గ మ | పా ద ప ||
ఆ వ | లీ - - - వ లి || ఫ ల ము | లం గ జ ||

ప స ని | సా - - || స ని ప మ గ మ | రీ సా ||
జ న కు | డే - - || - - - - - - - | - - || ||భావించి||

చ. స రి గ | మ ప పా || ప మ గ మ | రీ - - ||
దా - న | ము ల లో || ఫ - ల - | ము - - ||

స ని ధ | ని స రీ || గ మ ప మ గ మ | రీ సా ||
త ప ము | ల - లో || ఫ ల - - - | ము - ||

పా ప | ప మ ప మ రీ || స రి గ మ ప ద | పా - - ||
మో న | ము - ల - లో || ఫ - ల - - - | ము - - ||

ప స ని | ప మ రీ || గ మ ప మ గ మ | రీ సా ||
ము కుం - | దు - డే || - - - - - - | - - ||

గ మ ప | ద ప పా || ప స ని | సా - - ||
జ్ఞా - న | ము ల లో || ఫ ల - | ము - - ||

స రి గ | గ మ రీ || స ని పా | సా - - ||
జ ప ము | ల - లో || ఫ - ల | ము - - ||

పా - | సా స ని || ప స ని | పా - - ||
నా - | నా ఫ ల || ము లు - | ను - - ||

స ని ప మ గ మ | రి రి || గ మ పా - ద | ప మ రి సా ||
నా - రా - - - | య ణు || డే - - - - | - - - - || ||భావించి||

**అవతారిక :**

ఇందు కోరికలను పూర్తిగా అనుభవించి విడిచెదమనుకొను వారిని మనసునందుంచు కొని అట్టివారికి తృప్తి యెట్లు కలుగును, వారెట్లు మృగతృష్ణలను విడువగలరని అన్నమయ్యా వారు చెప్పుచున్నారు. కోరికలు తీరని దాహము వంటివని వారి భావము.

**రాగ లక్షణం :**

ప్రాచీనములగు రాగములకు ఆరోహణావరోహణ క్రమము అంత నిష్కర్షగా కనబడదు. అట్టి రాగములలో శుద్ధవసంత మొకటి. దీనిని యిప్పటి వాడుక యందు గల మేళకర్తలలో 29వ దగు శంకరాభరణ జన్యముగా చెప్పియున్నారు. కాని శంకరాభరణము నుండి దీనిని వేరు చేయుట కొంచెము కష్టసాధ్యమే. ఇతరుల రచనలు యీ రాగమునందు కానవచ్చుటలేదు. బహుశ; శంకరాభరణము నుండి దీనిని విడదీయుట నావశ్యము, అసాధ్యము అని ఇతర వాగ్గేయకారులు తలచి యుండవచ్చునని తోచుచున్నది. వక్రములగు కొన్ని దాటు స్వరప్రయోగములను గమనించి రాగభావమును పోషించు కొనవలెను.

ఆరోహణ : స రి గ మ ప ద ని స.

అవరోహణ : స ని ద మ ప మ గ రి స.

శుద్ధవసంతం – ఝంపె

కడలుడిపి నీ రాడగా దలంచు వారలకు
కడలేని మనసు నకు గడమ యెక్కడిది ॥పల్లవి॥

దాహమణగిన వెనక తత్వ మెరిగెదనన్న
దాహమేలణంగు తాతత్వమే మెఱుంగు
దేహంబుగలయన్ని దినములకు బదార్థ
మోహమేలుడుగు దాముదమేల కలుగు ॥కడలు॥

ముందరెరిగిన వెనుక మొదలు మరచెదనన్న
ముందరే మెరుంగు దా మొదలేల మఱచు
అందముగ దిరు వేంకటాద్రీశు మన్ననల
కందు వెరిగిన మేలు కలనైన లేదు ||కడలు||

అ : 2_215

ప. ప ప | ద ద మ || ప ప | ద ద మ || పా | ద ద మ || గా | రి రి స ||
క డ | లు డి పి || నీ - | రా - డ || గా | ద ల చు || వా | ర ల కు ||

ని ని | సా స || రి రి | గ గ రి || స రి | గ గా || మ గ | మా - ||
క డ | లే ని || మ న | సు న కు || గ డ | మ య్యో || క్కు డి | ది - ||
||కడలుడిపి||

చ. ప ద | ద ద మ || ప ద | ద ద మ || పా | ద ద మ || గ గ | రి రి స ||
దా - | హా మ ణ || గి న | వె న క || త | త్వ మె రి || గె ద | న - న్న ||

స ని | స స రి || గ గ | స రీ || గా | మ మ ప || ద మ | పా - ||
దా - | హ మే - || ల ణ | గు తా || త | త్వ మే - || మె రు | గు - ||

రి గ | మ గ మ || గ మ | పా ప || మ ప | ద ద ద || దా | నీ ని ||
దే - | హం - బు || గ ల | య న్ని || ది వ | ము ల కు || ప | దా ర్థ ||

ని స | రి రి స || స రి | గ గ రి || మ గ | సా ని || ద ని | సా - ||
మో - | హ మే - || లు డు | గు తా - || ము ద | మే ల || గ లు | గు - ||
||కడలుడిపి||

**అవతారిక :**

ఇందు దక్షిణ నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని కృష్ణావతారపు కథలు జ్ఞాపకము చేయుచు "స్వామీ నీవు కోరి రాక్షస వివాహము చేసుకొన్నావు. రుక్మిణీదేవి యున్నది. చనవు లిచ్చి నిన్ను మన్నించి నీచే మన్నింపబడిన సత్యభామ యున్నది. నీవు కోరి యేలుకొన్న 16 వేల మంది గోపికలు, రాచకన్యలు ఇంకను గోపికలు, ఇందరుగాక నీకు రాజవీధిలో గంధములు, పుష్పమాలికలు మొదలగునవి తమ మనసుతో నిచ్చి ఆదరించిన కుబ్జ మొదలగు వారున్నారు. ఇందరు సతులను లాలించి ఏలిన నీకు నేను కావలసి వచ్చితినా ఇది నిజమగు ప్రేమయా లేక నాతో నవ్వులాటలా" అని నాయకునడుగు చున్నది. ఈమె యందు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహము పూర్తిగా ఉన్నట్లు తోచు చున్నది.

శుద్ధ వసంతం — రూపకం

నేనెంత నీవెంత నిక్కమా యిది
కానీ లేరా యిది యొక్క కాకు నేనే జాడలా ॥పల్లవి॥

కోరి వేడి తగిలిన గోపసతు లుండగాను
అరయ నా కొంగు పట్టే వలసతినా
మేరతో బెండ్లాడిన రుక్మిణిదేవి వుండగాను
యేరా నాతో నవ్వేవు యెగసక్కెమూ ॥నేనెంత॥

చనవిచ్చి మన్నించిన సత్యభామ వుండగాను
చెనకేవు నే నీకు జిక్కితినా
పనివడి తెచ్చుకొన్న పదారువే లుండగాను
నను జెక్కు నొక్కేవు నాటకములా ॥నేనెంత॥

గంద మిచ్చి మెప్పించిన కలికి యొకతె యుండ
అంది నన్ను గాగిలించే వాగడములా
కందున శ్రీ వేంకటేశ కలసితి విటు నన్ను
చిందేవు మోహము నాపై చిత్తమింత వచ్చెనా ॥నేనెంత॥

శృం : 17—271

ప. గా మ గ గ రి గ రి సా || ని రి స ని స ధ నీ సా ||
నే - - నెం - - - త || నీ - - - వెం - - త ||

- స రి గా || మ గ గ రి స రి ||
- ని క్కె మా || - - - - యి ది ||

- గ మ పా ప ద ని || సా ని రి స ని స ద ని ||
- కా - నీ తే - - || రా యి - ది - యొ - క్క ||

- స సి ద మ పా || ద మ ప గ మ రి ||
- కా - కు - సే || సే - జా - డ లా || ||నేనెంత||

చ. - ద ద పా ద || ప ద ని ప దా || - మ ప మ గ మ || రి గ మ పా ప ||
- కో రి వే డి || త గి లి న - || - గో ప స తు లుం || - - డ గా ను ||

- గ మ ప ప ద ద || ని ప ద ని సా || ని రి స ని స ద నీ సా ||
- అ ర య నా - - || కొం - గు ప ట్టే || వ - ల - స - తి నా ||

స రి గ స రి || గా మ గ రి | రి మ గ గ రి సా || స ద నీ సా సా ||
మే ర తో - బెం || డ్లా డి వ రు | క్ష్మి - ణీ దే - వి || యుం - డ గా ను ||

- మ పా ప ద నీ || స రి స ని ద మ పా ||
- యే రా నా - తో || న - - - వ్వే - వు ||

ద మ ప గ మ రి ||
యె గ సె క్క - మా || ||నేనెంత||

**అవతారిక :**

అమాయకురాలైన నాయిక నాయకునితో తనకు పొందు సమకూర్చుమని చెలికత్తెను వేడుకొనుచు అతడు నిన్ను గమనించి నీ మనవి యాలకించి అభయమిచ్చు వరకు విడువక సేవించి కొనియాడి కొలిచి, నీ జాణతన మంతయు కనుబరచి నాపై కరుణ కలుగునట్లు చేయవలెను సుమా అని లాలించి చెప్పుచున్నది.

**రాగలక్షణం :**

ఆరభి ప్రాచీన ఘన రాగములలో నొకటి. ఇందు శృంగార రసమునకు తావున్నదా అనిపించు రాగస్వరూపము మాత్రమే నేడు మనకు కనబడు చున్నది. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 29వ మేళమగు శంకరాభరణ జన్యము.

ఆరోహణము : స రి మ ప ద స

అవరోహణము : స ని ద ప మ గ రి స.

ఇందు పూర్వా చార్యుల రచనలనేకములు కనబడు చున్నవి. మత భేదములు లేక ఒకే విధమగు స్వరూపము కలిగియున్న ప్రాచీన రాగములలో నిది యొకటి.

**ఆరభి—త్రిపుట**

చెలియా నాకు నీవు సేసే వుపకారముది
వెలలేని గుణముల వేడుకకాడతడు ॥పల్లవి॥

వచ్చిన దాకా నీవు వద్దనే కాచుకుండు
మెచ్చిన దాకా గొలువు మిగులాను
ఇచ్చగించి నందాకా నింపుగ సేవలు సేయు
అచ్చపు బొందులు సేయుమాతనికి నాకును ॥చెలియా॥

సమ్మతించి నందాక సారె విన్నపాలు సేయు
నెమ్మది బత్తైన దాకా నేర్పులు చూపు
కొమ్మని యిచ్చిన దాకా గుట్టున జేయెత్తి మొక్కు
యిమ్ముల బొందులు సేయు మిద్దరికి నీవు ॥చెలియా॥

నవ్విన దాకా నీవు నను పు లెల్లా జేయు
మివ్వలి మోమైన దాకా నింపులు చల్లు
రవ్వగా (శ్రీ) వేంకటరాయడిదే నన్ను గూడె
మవ్వపు బొ౦దులు సేయు మాకు నీ వెప్పుడును

శృం : 19–22

ప. - - - ద రి | సా స ని దా || ద పా | ద ప మ గ రీ ||
- - చె లి | యా నా - - || కు - | నీ - - - వు ||

- - స | రీ రి ప మ గ || రీ స | స ని ధా సా ||
- - సే | సే వు - వ - || కా ర | మి - - ది ||

- - రి మ | పా దా || సా స ని దా | రి స రీ ||
- - వె ల | లే నీ || గు ణ - - | ము - ల ||

- - స రి | మ గ రీ సా || స ని దా | ప మ పా ||
- - వే - | డు - - క || కా - - | డ త డు || ||చెలియా||

చ. - - రి | ద ప పా || పా - | పా ద ప మ గ ||
- - వ | చ్చి - న || దా - | కా నీ - - - ||

రీ స | రీ రి ప మ గ || రీ రి | స ని ధా సా ||
వు వ | ద్ద నే - - - || కా చుం | - - - డు ||

- - స | స ని ధా ధా || సా - | రి స రీ ||
- - మె | చ్చి - - న || దా - | కా - - ||

రి ప మ గ రీ | రీ రి స || స రి ధ | సా - - ||
కొ - లు - - | వు మి గు || లా - - | ను - - ||

- - రి | ద ప పా || పా - | పా ద ప మ గ ||
- - ఇ | చ్చు - గిం || చి - | నం దా - - - ||

రీ స | రీ రి ప మ గ || రీ రి | స ని ధా సా ||
క ఇం | పు గ - - - || సే వ | లు - - సే ||

సా రి మ | పా పా || ద ప మ ప ద ప | దా సా ||
య అ - | చ్చ పు || పొం - దు - - - | లు సే ||

రీ స రి | మ గ రీ సా || స ని దా | ద ప మ పా ||
యు మ - | త - - నీ || కి - - | నా - - కు ||

పా ద రి | సా స ని దా ||
ను చె లి | యా నా - - ||

**అవతారిక :**

స్త్రీపు నాయకుడైన శ్రీ వేంకటేశ్వరునితో నవ్వుచు నయగారములు చూపి సరసములాడి మరగియుండి, అతని ఇచ్చ వచ్చినట్లు వెల్లచేసి మర్మములు చూపి మనసు రంజంపవలెను గాని రట్టు చేసికొని రభస చేసుకొందుకటవే, అట్లుండిన అతనికి ప్రియము లెట్లు పుట్టునే అని చెలిమికత్తె నాయికను మందలించుచున్నది.

**రాగలక్షణం :**

నీలాంబరి ప్రాచీన రక్తి రాగములలో నొకటి. ఇది యిప్పటి వాడుక ప్రకారము ఇరవై తొమ్మిదవ మేళమగు ధీరశంకరాభరణ జన్యము. 'ప ని ద ని ప' అను ప్రయోగమున కైశికి నిషాదము పలుకుచున్నది. అదియే భాషాంగ-స్వరము. కొందరు లక్షణకారులు దీనిని 28వ మేళమగు హరికాంభోజి జన్యమనియూ చెప్పియున్నారు. అది న్యాయము కాదు. ఇందు కాకలి నిషాద ప్రయోగము ప్రధానముగా నుండి సకృత్తుగా కైశికి నిషాదము పలుకుచుండుట వలన ఇది 29వ మేళకర్త జన్యమనుటయే ఉచితముగా తోచుచున్నది. విలంబకాలమున దీర్ఘములగు స్వరములను ఒదుగులతో పలికించుకొనుచు ప్రస్తరించునప్పుడే ఈ రాగచ్ఛాయలు ఒప్పి నిండుదనము నిచ్చుచున్నది.

**ఆరోహణ :** స రి గ మ ప ద ప ని స

**అవరోహణ :** స ని ద ని ప మ గ రి గ స ।

కొన్ని ప్రాచీన రాగములు ఆరోహణావరోహణముల పైనను జనక రాగముల పైనను అంతగా ఆధారపడక కొన్ని స్వతంత్రములగు సంచార సందర్భములు కలిగి శోభించుచుండుట కర్నాటక సంగీతము నందు పరిపాటి, బేగడ, నీలాంబరి, ఆనందభైరవి. అఠాణా, దేవగాంధారి మొదలగు రాగములు ఇటువంటి కోవకు చెందినవి.

నీలాంబరి — త్రిపుట

నవ్వవే యెక్కడి సుద్ది నయముగా నతనితో
రవ్వలు చేసుకొంటేను రాపు కెక్కదా ॥పల్లవి॥

సరసములాడగానే చనవులెల్ల బుట్టుగాక
యెరవులు చేసుకొంటే నెనసుండునా
మరిగి వుండగానే మనసు లెనసు గాక
వొరటులు చూపితేను వొడబాటు గలదా ॥నవ్వవే॥

ఇచ్చకాలు సేయగానే ఇంపులు రేగుకాక
మచ్చరాన బెనగితే మట్టు పడునా
మచ్చికలు చూపగానే మర్మములు సోకుగాక
పచ్చిగా గాతాళించితే భావాలు గరగునా ॥నవ్వవే॥

చుట్టరికాన మించితే సులభమౌగాక మేలు
అట్టులు చేసుకొంటే మఱగు సేయవచ్చునా
ఇట్టే శ్రీ వేంకటేశు డెనసె దానే నిన్ను
గుట్టులు చూపకుండితే కొంకుదేరునా ॥నవ్వవే॥

శృం : 19–53

ప. - - గ మ | పా - ద ప ప మ గ || రి గ మ ప మ గ | గ రి గా సా ||
- - న - | వ్వ - - వే - - - - || యొ - క్క - - - | డి - - సు ||

సా స ని | స ధ నీ సా || సా ప ప ప మ గా - | గా మ గ గ రి గా మా ||
ద్ది - న య | ము - - గా || న - త - - - - | ని - - - - - తో ||

- - గ మ | పా పా ద ప మ || పా స స ని ద ని | స ని ద ని పా ||
- - ర - | వ్వ లు - - - || చే - - - - - | కొం - - - టే ||

పా గ మ | పా ద ని ద ని పా || మ గ రి గ మ ప | మ గ గ రి గా ||
ను రా - | పు - - - - కె || క్క - - - - - - | - - - - - దా || నవ్వవే||

చ. - - | ప ప | పా ని ప ప ప మ గ || గ రి గా మ ప మ గ | గ రి గా గ స ||
- - | స ర | స - - ము - - - || లా - - డ - - - | గా - - నే - ||

సా స స | సా స ధ ని || సా స | పా ప ప మ గ ||

- చ న | వు తె - - || ల్లు బు | ట్టు గా - - - ||

మా గ మ | పా ప ప మ గ || గ రి గా మ ప మ గ | గ రి గా సా ||

క యొ ర | వు లు - - - || చే - - సు - - - | కొం - - షే ||

సా స ప । ప ప మ గ రి గ మ ప ॥ స స ద ప మ గ । గ రి గ సా ॥

- నె - । న - - - సు ం - - ॥ - - - - - - - । డు - - నా ॥

- - స స । సా - స ॥ సా - । స ద నీ సా ॥

- - మ ర । గి - వుం ॥ డ - । గా - - నే ॥

- - స ని । స రి గ స ॥ సా - । స ద నీ సా ॥

- - మ న । సు - తె న ॥ సు - । గా - - క ॥

- - గ మ । పా పా ॥ ప సా సా ని । స ద నీ పా ॥

- - వా ర । టు లు ॥ చూ - పి - । తే - - ను ॥

- - గ మ । పా ద ని ద ని స ద ॥ మ ప మ గ రి గ । మ ప మ గ గ రి గా ॥

- - వా డ । టా - - - - - టు ॥ గ - - - - - । ల - - - - - - - ॥

సా గ మ । పా - ద ప ప మ గ ॥

దా న - । వ్వ - - వే - - - ॥

**అవతారిక :**

"నేను స్వామికి లోబడి యౌవనము నిచ్చుకొన్నాను. గనుకనే నాతని దానను. ఇంకా గొణుగుటలు, సణుగుటలు, కోరికలు, వొడబడికలు ఇవన్నియు ఎందులకు, అతని కిష్టమైనపుడు నన్నేలు కొనవచ్చును అట్లు పలుకొనుచునే యున్నాడు. ఎన్నడైనా వేరుమాట నేనాడితినా? ఊరకుండుమనవే, జవ్వనపు బరువులు మోయుచున్న దానను, గనుక అతనితో జగడములాడ నేరను" అని నాయిక తన చెలితో చెప్పినా నాయకునికి కబురంపు చున్నది.

**రాగలక్షణం :**

సామ ప్రాచీన రక్తి రాగములలో నొకటి ఇది యిప్పటి వాడుక ప్రకారము 29వ మేళమగు ధీర శంకరాభరణ జన్యము. కాని కొందరు 28వ మేళమగు హరికాంభోజి జన్యమనియు చెప్పియున్నారు. ఇది నిషాద వర్జ్యమగు రాగము గనుక ఎల్లైనను అనవచ్చును. కాని ఇందుగల సంగతుల కూర్పు, స్వరముల స్వభావములు పరిశీలించినచో ఇది శంకరాభరణ జన్యమనుటయే న్యాయమని తోచుచున్నది. ఇందు తాళ్లపాక వారి తరువాత దీక్షితులవారు, త్యాగరాజస్వామి తప్ప పేరొకరు రచనలు చేసినట్లు కనబడదు.

**ఆరోహణ :** స రి మ ప ద స

**అవరోహణ :** స ద ప మ గ రి స.

'స రి మ గ రి మ ప', 'రి ప మ ప', 'మ ద స', ద రి స', 'ప స ద ప', 'మ గ గ రి', వ టి ప్రయోగములు రక్తిని కలిగించుచున్నవి.

సామ — త్రిపుట

ఊరకుండు మనవే వొడబాటులిక నేలే
కోరికలు గోరుకొంటా గొణగే గాని ॥పల్లవి॥

అగ పడితిమి తొల్లే ఆయను తన పొందు
యెగసెక్కె లాడక తానిక నెన్నడే
జగడించ నోపము జవ్వనము మోచుకొని
మొగము చూచి చూచి మూలిగే గాని ॥ఊరకుండు॥

సేవలెల్లా జేసేము చెల్లు బడి గలవాడు
యీ వలనవ్వులు నవ్వకిక నెన్న డే
చేపట్టి తియ్యనేల సిగ్గులుపై వేసుకొని
దేవరంటా మొక్కుకొంటా దీవించే గాక ॥ఊరకుండు॥

కూడితిమి కౌగిటను గురుతు చన్నుల నంటె
యీడనే ప్రియాలు సేయకిక నెన్న డే
జోడై (శ్రీ) వేంకటేశ (శు) చుట్టరికపు దనాన
మేడెపు రతులలోన మెచ్చేము గాక ॥ఊరకుండు॥

శ్రం : 20—7

ప. - - ధ । సా రీ ॥ మా - । మ గ గ రి రి స ॥
- - ఊ । ర కుం ॥ డు - । మ - - - న - ॥

రీ రి మ । పా - ద స ద ప ॥ మ మ గ గ రి । స రి గ స రి ॥
వే వొ డ । బా - - - - టు ॥ లి క - - - । నే - - తే - ॥

ధ స ప మ । ద ద సా ॥ ॥ స రి ప మ మ గ । గ రి గా రి ॥
- - కొ - । రి క లు ॥ ॥ కో - రు - - - । కొం - - టా ॥

- - ప స । ద రి సా ద ప ॥ పా ద స ద ప మా । మ మ గ రి స రి గా ॥
- - గొ - । ణ - - గే - ॥ గా - - - - - - । ని - - - - - - ॥
॥ఊరకుండు॥

చ. - - మ మ । మ మ మా ॥ మ ప ద మ । మ మ గ రి రి స ॥
- - అ - । ప డి తి ॥ మి - - - । తొ - - - ల్లే - ॥

రీ స ధ । సా రీ ॥ స రి ప మ మ గ । గ రి గా రీ ॥
- ఆ - । య ను ॥ త - న - - - । పొం - - దు ॥

రి స రి మ । పా పా ॥ ప ద సా । ద ద పా ॥
- - యె గ । సె క్కే ॥ లా - - । డ - క ॥

- - రి మ । ప ద సా ద ద ॥ పా - । మ మ గ రి రి ॥
- - తా - । ని - - క - ॥ నె - । న్న - - - డే ॥

- - ప మ । దా సా ॥ సం రిం గ సం । రీం రీం ॥
- - జ గ । డిం ప ॥ నో - - - । ప ము ॥

- - సం రిం । పం మం మం గం గం రిం రిం సం ॥ సం రిం గం సం । రిం సం ద ప ॥
- - జ - । వ్వ - - - న - ము - ॥ మో - - చు । కో - ని - ॥

దా ప స । ద రిం సా ద ప ॥ పా ద ప మ ప । ప ద సా ॥
- మొ - । గ - - ము - ॥ చూ - - - చి । చూ - చి ॥

- - రి మ । పా ద సం ద ప మా ॥ మ మ గ రి రి । స రి గా స రి ॥
- - మూ - । - - - - - లి ॥ గే - - - - । గా - - - - ॥

సా ధ । సా రీ ॥ మా
ని ఊ । ర కుం ॥ డు

**అవతారిక :**

"వటురూపుడగు వామనుని సౌందర్యమును వర్ణించుచు "హేమ కౌపీనమును ధరించి గొడుగు, కఱ్ఱ, కమండలము, అజినము, మొదలగునవి గైకొని, బలిచక్రవర్తిని దానమడుగుటకు వచ్చిన యాత్రి విక్రముడు" వేంకటగిరి యందు నివసించి శ్రీ వేంకటేశ్వరుని రూపమున విరాజిల్లుచు లోకములకు శుభములను చేకూర్చుచున్నాడు" అని అయ్యవారు చెప్పుచున్నారు.

**రాగ లక్షణం :**

బిలహరి రాగము ప్రాచీనము. భాషాంగము, రక్తిరాగము. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 29వ మేళమగు ధీరశంకరాభరణ జన్యమని చెప్పుకొనవలెను. 'ప ని ద పా'– 'గ ప ద ని పా' మొదలగు ప్రయోగములలో కైశికి నిషాదము పలుకుచున్నది. వెంకటమఖి సంప్రదాయమందును యిట్లే చెప్పియున్నారు.

**ఆరోహణ :** స రి గ ప ద స

**అవరోహణ :** స ని ద ని ద ప మ గ రి స ।

**బిలహరి—ఆది**

పృథుల హేమ కౌపీన ధరః
ప్రథిత వటుర్మేబలం పాతు ! ॥పల్లవి॥

సూపా సప్తః శుచిస్సులభః
కోప విదూరః కులాధికః
పాప భంజనః పరాత్పరోయం
గోపా లోమే గుణం పాతు ! ॥పృథుల॥

తరుణః ఛత్రీ దండ కమండలు
ధరః పవిత్రీ దయాపరః
సురాణాం సంస్తుతి మనోహరః
స్థిరస్సుధీర్మే ధృతిం పాతు ! ॥పృథుల॥

త్రివిక్రమః శ్రీ తిరువేంకటగిరి
నివాసోయం నిరంతరం
ప్రవిమల మస్సృణ కబళ ప్రియోమే
దివా నిశాయాం ధియం పాతు ! ॥పృథుల॥

అ : 11(2)–72

ప. ప మ గ ప దా స స ని | ద ప మ గ | రి గ రి ||
పృ - థు ల హే మ కా - | పీ - న ధ | రం - - ||

స ని ధ ధ సా రి | గ ప ద స ని ద ప | మ గ రి గ రి రి ||
ప్ర థి త వ టు ర్మే | బ లం - - - - - | పా - - - - తు || ||పృథుల||

2. ప మ గ ప దా స ప ద స రి | గ మ గ రి స ని ద ప | ద ప మ గ రి గా రి ||
పృ - థు ల హే మ కా - - - | పీ - - - న - ధ - | రం - - - - - - ||

చ. ద దా ద దా ద ప మ గ | గ రి గా పా | ద ప మ గ రి రి ||
త్రి వి క్ర మః శ్రీ - - - | తి - రు వేం | క - ట - గి రి ||

స స ని ధ ధ సా రి | స రి గా గ రి గా | పా - - ||
ని వా - - - సో యం | ని - రం - - త | రం - - ||

స రి గ రి గ ప ద ప | ద సా స ని | ద ప దా ||
ప్ర వి మ ల మ శృ ణ క | బ ళ ప్రి - | యో - మే ||

ద దా గ రి సా - ని ద ప | గా ప ద స ని ద ప | మ గ రి గ రి రి ||
ది వా ని - శా - - యాం - | ధి యం - - - - - | పా - - - - తు ||
||పృథుల||

**అవతారిక :**

నాయిక సౌందర్యమును ఉత్ప్రేక్షాలంకారములతో వర్ణించుచు ఆమె లావణ్యము సముద్రము వంటిదనియు, దాని నుప్పొంగించుటకు ముఖచంద్రుడుద్భవించెననియు, మన్మథుడను విషమునకు విరుగుడుగా ఆమె అధరామృతము జనియించెననియు, ఇట్లే భవజలధి యనెడు పాలసముద్రమున లక్ష్మివలె ఆమె యవతరించినదనియు. శ్రీ వేంకటేశ్వరుడు ఆ మహా సౌందర్య రాశిని యేలుకొని ధన్యుడైనాడనియు అయ్యవారు యీ పదమునందు వర్ణించి యున్నారు.

**రాగ లక్షణం :**

దేశాక్షి ప్రాచీనములగు ప్రసిద్ధ రాగములలో నొకటి. ఇప్పటి వాడుక ప్రకారము ఇది 29వ మేళమగు ధీరశంకరాభరణ జన్యము. ప్రాచీన రాగములలో కొన్ని కాలక్రమమున మరుగుపడి వాటికి సన్నిహితములుగా నుండిన కొన్ని ఇతర రాగములు ప్రచారమునకు ఎక్కువగా వచ్చుట జరుగుచున్న ఒక సత్యము. ఉదాహరణకు 'స ని ద ని ద ప' అనునప్పుడు కైశికి నిషాదపు ప్రయోగము కలిగి బిలహరియను పేరుతో భాషాంగముగా ఉండిన రాగము దేశాక్షిని ప్రక్కకు నెట్టినది. ఇట్లే సామంతమును కేదారము, ఈ కేదారమును నీలాంబరి ప్రక్కకు నెట్టివేయుట జరిగినది. ఇటువంటి రాగములు కర్నాటక సంగీతమున ఎన్నియోగలవు. ఇప్పటికిని దేశాక్షి రాగస్వరూపమును తెలియజేయుటకు మహానుభావులైన పురందర దాసుల వారి గీతమొక్కటి ఆధారముగా నున్నది. ఇంకను కొన్ని గ్రంథములయందు శైలదేశాక్షి, నారాయణ దేశాక్షి మొదలగు రాగములు కనబడుచున్నవిగాని, దేశాక్షి రాగమునకును, వీటికిని నామ సారూప్యము తప్ప, ఇతర సంబంధములు కనబడుటలేదు.

ఆరోహణ : స రి గ ప ద స

అవరోహణ : స ని ద ప మ గ రి స ।

దేశాక్షి — ఝంపె.

అటువంటి వైభవము లమర- జేసిన దైవ
మిట్టువంటి భోగ బు లిన్నియును జేసి ! ॥పల్లవి॥

జలజాక్షి లావణ్య జలధినుప్పొంగింప
నలివేణి ముఖచంద్రు డభ్యుదయ మాయె
కలికి వలరాయడను కాలకూటంబుతో
దలకొన్న యధరామృతంబు జన్మించె ! ||అటువంటి||

వనిత సౌభాగ్యంబు వనధిలోపల దోచె
గొనకొన్న గుఱుతైన కుచపర్వతములు
తనివోని కోరికల తగు తురంగములతో
ననువైన విరహ బడబానలము గలిగె ! ||అటువంటి||

భామయవ్వన మనెడి పాలజలనిధిలోన
వామాక్షి యైన యవ్వన లక్ష్మి గలిగె
యీ మంచి తిరువేంకటేశ్వరుం డిందులో
ప్రేమమున సుఖియించి పెంపొందగలిగె !

శృం : 4–164

ప. - ద రి సా స ని || ప ద స ని ద ప ప ||
- అ టు వం టి - || వై - - - భ వ ము ||

- మ గ పా ప ప మ గ || గ రి గా పా ద ||
- అ మ ర చే - - - || సి - న దై వ ||

- ద రి సా స ని || ప ద స ని ద ప ప ||
- మి టు వం టి - || యో - - - గం - బు ||

ద ప మ గ ప ద స || స ని ని ద ద సా ||
లి - - - న్ని యు ను || జే - - - సి - || ||అటువంటి||

చ. - గ ప దా ద || ద ప మ గ గ రి గ రి ||
- జ ల జా క్షి || లా - - - వ - ణ్య - ||

- గ ప ద సా || స ని ని ద ప ప ద ప ||
- బి ల ధి ను || పొ్ప - - - గిం - - ప ||

- గ ప పా ద ప || ద ప మ గ గ రి గ రి సా ||
- అ లి వే ణి - || ము - ఖ - చం - - - ద్రు ||

స ని ధా స రి గ || మ గ రి గ పా - ||
డ - - భ్యు ద య || మా - - - యె - ||

- మ గ ప ద స || స ని ని ద ద ప ద ||
- క లి కి వ ల || రా - - - య డ ను ||

- ప ద స రి గ మ గ రి || స ని ప ద స సా ||
- కా - ల - కూ - - - || టం - - - బు తో ||

- ద రి సా స ని || ప ద స ని ద ప ప ||
- త ల కొ న్న - || య - ధ - రా - మృ ||

ద ప మ గ ప ద స || స ని ని ద ప ద సా ||
తం - - - బు జ - || న్మిం - - - చె - ను || ||అటువంటి||

**అవతారిక :**

ఇందు నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని సేవలు చేయించుకొనుచు ఆనందించెడి విధమును చెప్పుచు "జలకములాడునిప్పుడును, కప్పురపు కాపుపెట్టించుకొనునప్పుడును, పువ్వులు ముడిపించుకొనునప్పుడును, పునుగు జవ్వాదులు అలదుకొనునప్పుడును నీవు అలమేలు మంగను ఆదరించి పలుకులాడుచు, సేవలు చేయించుకొనుట నీ కలవాటే కదా, ఆమెను పెండ్లాడేవేళ కొలువులోనివారు చేయు వినతులు నీకు సొంపులే కదా" అని చెలులు ఎకసెక్కెములాడుచున్నారు.

దేశాక్షి — ఆది

కంటిమయ్యా నీ చేతలు కన్నులపండుగ గాను
పెంటలైన ముచ్చటలే ప్రియమునీకు ! ॥పల్లవి॥

మంతన మాడేటివేళ మజ్జన మాడేటివేళ
ఇంతితోడి సరసము లింపులు నీకు
అంతలో గప్పురకాపు అవధరంచేటివేళ
సంతతపు వసంతము చవులు నీకు ! ॥కంటి॥

పొందుల వేళల దట్టు పునుగు పూసేటివేళ
ఇందుముఖి తోడిమాట లితవు నీకు
చెందమ్మి పూవుదండలు సింగారించుకొనే వేళ
విందుల మోవి యీవులు వేడుక నీకు ! ॥కంటి॥

సొలసి నవ్వేటి వేళ సొమ్ము లిడుకొనే వేళ
అలమేల్మంగ కూటమి అనువు నీకు
యెలమి శ్రీ వేంకటేశ ఇద్దరు పెండ్లాడే వేళ
కొలువులోని మొక్కులు కొసరు నీకు ! ॥కంటి॥

శృం : 25–136

ప. - స సా ని ని ద ప | ద ప మ గ | గ రి సా ||
- కం టి మ - య్యా - | నీ - చే - | త - లు ||

- స రి గ ప మ గ గ రి | స ని ధ ప | ధా సా ||
- క - న్ను - ల - పం - | డు - గ - | గా ను ||

- స రి గా పా ద ప | ప మ గా గ రి | రి స రి ||
- పెం - ట లై న - | ము - - - చ్చ | ట - లే ||

- గ ప దా సా - - | స ని ని ద ద ప దా | సా - - ||
- ప్రి య ము నీ - - | - - - - - - - | కు - - || ||కంటి||

చ. - ప పా పా ప మ గా | గ రి గా పా | ద ప పా ||
- మం త న మా - - | దే - - టి | వే - ళ ||

- గ ప ద స ని ద ప పా | ద ప ప మ గా | గ రి రి సా ||
- మ జ్జ - - - న - మా | దే - టి - - | వే - - ళ ||

- స స ని ధా సా రి | గ స రి | గా పా ||
- ఇం తి - - తో డి | స ర స | ము లు ||

- మ గ పా - ద సా - ని ద ప | ద ప మ గ రి స రి గ | పా - - ||
- ఇం - పు - - లు - - నీ - | - - - - - - - - - | కు - - ||

- ద దా దా ప ద స ని | ప ద పా | ద ప మ గ పా ||
- అం త లో క - - - | ప్పు - ర | కా - - - పు ||

- మ గ పా - ద సా సా | స ని ని ద ద ప దా | సా - - ||
- అ వ ధ - - రిం చే | టి - - - వే - - | ళ - - ||

- స రి̇ గ ప మ గ రి̇ మ గ రి̇ సా | గ రి̇ సా స ని̣ | ద ప దా ||
- పం - త - - - త - - - పు | వ - సం - - | - త ము ||

- ప ప ద ప ప మ గా గ రి సా | స ని̣ ధా సా | రి గ ప ద సా ||
- చ పు లు - - నీ - - - - | - - - కు | - - - - - || ||కంటి||

**అవతారిక :**

శ్రీ వేంకటేశ్వరుల అనుగ్రహమును పొందిన నాయికల అదృష్టమును కొనియాడుచు, సతిపతులకు మన్మథు డొక్కడే సాక్షి, గురువు. అన్యోన్యత కలిగిన వారికి అన్యులతో పనిలేదు. మనసులు కలిసిన వారికి అడ్డు ఆపులు, ఎగ్గుసిగ్గులు, హెచ్చుతగ్గులు, ఉచితానుచితములు, పిన్న పెద్ద తారతమ్యములు వుండవు. మన్మథుడు వారిని ఆటలాడించునని అయ్యవారు లోక వ్యవహారమును దృష్టియందుంచుకొని యీ పదము పాడినట్లు తోచుచున్నది.

**దేశాక్షి — తిశ్రగతి రూపకం**

ఇతరు లేమెరుగుదు రేమని చెప్పగ వచ్చు
పతులకు సతులకు భావజుడే సాక్షి ! ॥పల్లవి॥

తలపు గలిగితేను దవ్వులేమి చేరువేమి
అలరు సమ్మతించితె నడ్డాకలేమి
కొలది మీరినప్పుడు కొంచమేమి దొడ్డయేమి
సెలవిచ్చి యేకతాన జేసినది చేత ! ॥ఇతరు॥

యిచ్చకమె కలిగితే యెక్కువేమి తక్కువేమి
హెచ్చిన మోహములకు నెగ్గు సిగ్గేది
పచ్చిదైన పనులకు పాడియాల వంతమేల
చెచ్చెర దమకు దాము చెప్పినది మాట ! ॥ఇతరు॥

అన్నిటా నొక్కటియైతే నైన దేమి కానిదేమి
యెన్నికల కెక్కితేను యీడు జోడేది
వున్నతి శ్రీ వేంకటేశు డొనగూడె నేర్పులివి
కన్నెలు దా గూడిన గతులే సంగతులు ! ॥ఇతరు॥

శృం : 17—26

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రౌఢ, శాంత స్వభావిక. తన చెలిమి కత్తెతో "అభిప్రాయములు గలసిన వారి మధ్య నవ్వులాట లుండక మానవు. మనసులు కలిసిన వారిమధ్య తగులాటములు తప్పవు. చనువులు హెచ్చైన కొలది సరసములును హెచ్చుగానే యుండును. సతీపతులు తమలో తాము ముచ్చటలాడకుండ జరుగదుగదా! మొగమాటములు గలచోట యొకరిపై యొకరు అనుచుకొనుటలును నుండవు. దంపతుల మధ్య పగలేని యప్పుడు పంతములును పనికిరావు. నాపై తప్పుల నెంచుచున్నాడు. నాథుడగు శ్రీ వేంకటేశ్వరుడు కొంకుకొసగులు లేని కూటములు గల మా యిద్దరిలో నొకరు పాటించి మ్రొక్కితే రెండవవారు సమ్మతింప వలదా! ఇప్పుడు ఏకాంతము దొరకినది, నా భాగ్యమెట్లుండునో"? అని అమ్మవారు చెప్పుకొనుచున్నదని అన్నమయ్యవారు పాడుకొనుచున్నారు.

వరాళి — ఝంపె

ఏకతంబాయ నిదె యిద్దరికి నొకచోట
యేకొలది బడునొ వలపే మందునే! ॥పల్లవి॥

ననుపు గలవారికిని నవ్వకుండగ రాదు
మనసు లెనసిన తగులు మానరాదు
చనవు వెగ్గళమైన సరసముల కొదలేదు
తనివి దీరదు విభుడు తనకునే నెదురా! ॥ఏకత॥

మగలకును సతులకును మాటలాడక పోదు
మొగమాట గలచోట మొఱగరాదు
పగలేని తావుకును పంతంబు పనిలేదు
తగవులెంచీనతడు తనకు నేనెదురా! ॥ఏకత॥

కూటములు గల యపుడు కొంకు గొసరే లేదు
పాటించి మొక్కగా బదర దగదు
యీటుతో శ్రీ వేంకటేశుడిటు నను గలసి
తాటించి పొగడీని తనకు నేనెదురా! ॥ఏకత॥

రేకు : 13–15

ప. పా ద ని ద ప ప మ || గా రి స స ని ||

ఏ క - తం - - - || బా య ని దె - ||

స ని ధా గ గ గ || ప మ పా ద ని ద పా - ||

ఇ - - ద్ద రి కి || నొ - క చో - - ట - ||

ద ప మా ద ద ద || సం ని ద ప ద ని సం సం ||

యే - - కొ ల ది || బ - డు - నొ - వ ల ||

స ని దా ద గ రీ || సా - ని ద ప ప మ గ మ ||

పే - - మం . దు || నే - - - - - - - - ||  ||ఏకత||

2. ప ద ని సం రీ సం ని ద ప మ || గ గ ప మ ద ప ప మ గ రి ||

ఏ - - - క - తం - - - || బా - - - య - ని - దె - ||

చ. - ప ద పా ప ద ప మ || గా ప మ గ గ రి స ||

- న ను పు గ - ల - || వా - - రి - కి ని ||

- సా స ని స రి స ని || ధ ఫ ధ ని సా స ||

- న వ్వ - కుం - - - || డ - గ - రా దు ||

- స గ రీ గ మ || పా ద ని ద ప పా ప మ ||

- మ న సు తె న || సి న - త - గు లు - ||

ప ద ని సం రీ సం ని ద ప మ || పా - - - ||

మా - - - న - రా - - - || దు - - - ||

- స రి స ని ద ప మా || ద ని సా స ||
- చ న వు - వె -  - || గ్గ ళ మై న ||

- స ని స గ రి గ ప మ || గ గ రీ సా స ||
- స ర స - ము - ల - || కొ - ద లే దు ||

- స స స ని ద ని స రి || స ని దా ప ప ప మ ||
- త ని వి - తీ - - - || ర - డు వి భు డు - ||

గ గ ప మ ద ప ని ద ప మ || గ గ రి సా - ||
త - న - కు - నే - - - || నె - దు రా - ||

||ఏకత||

**అవతారిక :**

జీవులకు కామాదులగు గుణములను నిగ్రహించుకొనుడని చెప్పుచు "నీ తలపు కామాతురమై యుంచుకొన్నట్లున్నావు గనుకనే నీకు నాలుగు చేతులున్నను చాలవాయె. ఇరువురు సతుల మధ్య ఇరకాట పడవలసి వచ్చినది. ఇదిగాక పదునారు వేలమంది గోపికలను కలసి ఆనందించుటకు ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపమున నుండవలసి వచ్చినది. ఒక్కొక్కసారి మారుమొగము వెట్టుట, గోళ్ళు నిడివిగా నుంచుకొనుట మొదలగున వన్నియు నీకామాతురత్వమునకు చిహ్నములే! చిరుభోగమునకు అలవడిన నీవు తిరువేంకటాధీశ్వరునిగా నుండవలసి వచ్చినది. నీవు సంసార బద్ధుడవు గనుక సృష్టియందలి జీవాత్మలన్నిటి (స్త్రీల) యందును పరమాత్మవై (పరమపురుషుడవై) నిలువ వలసి వచ్చినది" అని అయ్యవారు మధుర భక్తి తత్త్వమును అత్యంత మనోహరముగా ఇందు చిత్రించుచున్నారు.

వరాళి — ఝంపె

తలపు కామాతురత్వము మీద నలవడిన
నిలనెట్టి వారైన నేలాగుగారు ! ॥పల్లవి॥

ఒలి నిరువురు సతుల నాలింగనము సేయ
లోలుండటుగాన నాలుగు చేతులాయె
వేలసంఖ్యలు సతుల వేడుకల రమియింప
జాలుపడెంగాన రూపములు పెక్కాయె ! ॥తలపు॥

పొలయలుక కూటముల భోగి దానటుగాక
మలసి యొక్కొక వేళ మారుమొగమాయె !
లలితలావణ్య లీలావిగ్రహముగాన
కొలది వెట్టగ రాని గోళ్ళు నిడు పాయె ॥తలపు॥

చిర భోగ సౌఖ్యముల చెందననుభవిగాన
చిరు వేంకటాచలా ధీశ్వరుండాయె
పరగ సంసార సంపదకు బద్ధుండుగాన
అరుదుగా సకలాంత రాత్మకుండాయె ! ॥తలపు॥

అ : 2–105

ప. ప ప ద ప మ | గా రి సా || స రి సా ని | గ రి గ మ ప ||
త ల పు కా - | మా తు ర || త్వ ము మీ ద | న ల వ డి న ||

ప ద నీ స | స ని ద ప మ || ప మ గ గ రి | స ని సా - ||
ని ల వె ట్టి | వా - రై - న || నే - లా - గు | కా - రు - ||

2. గ గ మ ప ద ని ద ప ప మ | గ గ రి సా - ||
ఏ - - - లా - - - గు - | కా - - రు - ||

3. ప ద ని స రి స ని ద ప మ | గ గ రీ సా - ||
ఏ - - - లా - - - గు - | కా - - రు - || ||తలపు||

చ. పా ద ప ప | ప మ గ గ రి || స రి స స ని | గ గ మా ప ||
ఒ లి ని రు | పు రీ స తు ల || నా - లిం - గ | న ము సే య ||

పా ద స ని | ద ప మ ప మ || గ గ మా ప | ద ద పా - ||
లో లు డ ట | గా - న నా - || లు గు చే తు | లా - యె - ||

ప మ ప దా | ని ని స స స || స ని స గ గ | రి రి సా ని ||
వే - ల సం | ఖ్య లు స తు ల || వే - డు క ల | ర మి యుం ప ||

ప ద ని స స | ని ని ద ప మ || ప ప మ గా | గ రి రీ సా - ||
బా - లు ప డె | గా - న రూ - || ప ము లు పె | కా్క - - యె - || ||తలపు||

**అవతారిక :**

"ఐహికములగు కామాదులకు లోనైన మనసు పెనగు లాడుట తప్ప ఇహ మునందేమి యున్నది ? నిజమునకు వత్తియందు నూనెవంటిది, విత్తుమీది పొల్లువంటిదె, ఆకాశము నందుగల శూన్యమువంటిది. పొత్తులు, చంచలములగు విభవములు, అశాశ్వతములగు సంసార బంధములు వీటియందు పొరలాడు దేహధారికి శ్రీహరి కరుణా కటాక్షము కలిగిన మోక్షము లభించు చున్నది. అది కలుగకున్న ఇన్ని యున్నను సుఖము లేదుకదా'' అని అయ్యవారు చెప్పుచున్నారు.

వరాళి — ఝంపె

యేమి గలదిందు నెంత పెనంగిన వృథా
కాముకపు మనసునకు కడ మొదలులేదు ! ॥పల్లవి॥

వత్తిలోపలి నూనె వంటిది జీవనము
విత్తు మీదట పొల్లువిధము దేహంబు
భక్తి సేయుట యేమి పాసిపోవుట యేమి
సొత్తుల సుఖంబులకు పొరలుటలుగాక ! ॥యేమి॥

ఆకాశపాకాశ మరుదైన కూటంబు
లోకరంజకము తమలోని సమ్మతము
చాకి మణుగుల జాడ చంచలపు సంపదలు
చేకొనిన నేమి యివి చెదిరినను నేమి ! ॥యేమి॥

గాదె బోసిన కొలుచు కర్మి సంసారంబు
వేడి విడువని కూడు వెడమాయె బ్రదుకు
వేదనల నెడతెగుట వేంకటేశ్వరు కృపా
మోదంబు వడసినను మోక్షంబుగనుట ! ॥యేమి॥

అ : 2—313

ప. సా ని̣ స గ | గ రి రి సా || పా ప ప మ | గ గ రి సా ||
ఏ మి గ ల | దిం - దు లో || ఎం త పె న | గి న వృ థా ||

ప ద ని స̇ స̇ | ని స̇ ని ద ప || ప మ గ గ రి | స ని̣ సా - ||
కా - ము క పు | మ న సు న కు || క డ ఘు ద లు | లే - దు - || ||ఏమి||

చ. సా స̇ : ని | ద ప ద మ మ || ప మ ప దా | స̇ ని స̇ స̇ స̇ ||
వ త్తి లో - | ప లి నూ - నె || వం - టి దీ | జీ - వ న ము ||

సా స̇ సా | ని ద ప ద మ || ప మ ప దా | స̇ ని సా స̇ ||
వి త్తు మీ | ద టి పో - ల్లు || వి ధ ము దే | హం - బు - ||

స̇ ని స̇ గా | రి̇ స̇ సా ని || సా ని స̇ గ̇ | రి̇ రి̇ సా ని ||
భ - క్తి సే | యు ట యే మి || పా సి పో - | పు ట యే మి ||

ప ద ని స̇ స̇ | స̇ ని ద ప మ || ప మ గ గ రి | స ని̣ సా ||
సొ - త్తు ల సు | ఖం - బు ల కు || దొ ర లు ట లు | గా - క || ||ఏమి||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక ప్రేమోత్కంఠిత. మర్మ గర్భితముగా నాయకునికి తన మనో భావములు వ్యక్త పరచుచు "నా వలపును ఎట్లు చెప్పుకొందును ! ఇది మొయిలు వలె నాడును. ముద్దు సేయరాదు. ఇది బయలు వలె విశాలముగా నుండును. ఇట్టి వలపునకు అదుపులు లేవు ఇది నేరిచిన వారి సొమ్ము. ఈ విషయమును తెలుసుకొన వలెనే గాని నన్ను కవ్వించుట దేనికి ! పాలవలె పొంగెడి మనసు అణగదు గదా ! ఇది గాలివలె పరుగు లిడుచునే యుండును. ఇది గెలుచుటకు సాధ్యమా ? లోలోపల నన్ను ఇంత తరచి చూచుట న్యాయమా ! పరువంపు వయసు వెన్నెలై కాచుండునా ఇది యొక వింతయా ! వసంత ఋతువనునది యెల్ల వేళల నిల చునా ? (శ్రీ) వేంకటేశ్వరుని కృప రాను రాను చవి పుట్టించు చున్నది సుమీ! వేరు మాటలేల నా వలపు ఇసుక పాతర వంటిది. రసికుడవగు నీవు నన్ను రవ్వ చేయుదువా! అని చెప్పుకొను చున్నది.

ఇందు అతి లలితములైన పదములతో నాయిక భావములను అయ్యవారు వ్యక్త పరచి యున్నారు. అవి సంగీత సాహిత్యముల యందును అభినయాది విద్యలయందును ఆరి తేరిన వారికి అనుభవైకవేద్యములు.

**వరాళి—త్రిపుట**

ఇసుక పాతర యిందు కేది కడగురుతు
రసికుడ నన్ను నింత రవ్వ శాయ నేటికి ! ||పల్లవి||

బయలు వలె నుండును పట్టరాదు వలపు
మొయిలు వలె నుండును ముద్ద శాయరాదు
నియతము లేదిందుకు నేరిచిన వారి సొమ్ము
క్రియ యెరుంగుతా నన్ను గెరలించ నేటికి ! ||ఇసుక||

గాలివలె బారుచుండు కానరాదు మనసు
పాలవలె బొంగుచుండు పక్కన నణగదు
యేలీలా గెలువ రాదు యెక్కితే యేనుగ గుజ్జు
లోలోనె మమ్ము నింత లోచి చూడ నేటికి ! ||ఇసుక||

వెన్నెలే కాయుచు నుండు వింతగాదు వయసు
అన్నిటా వసంత రుతువై యుండ బోదు
వున్నతి (శ్రీ) వేంకటేశుడుండ నుండ జవి బుట్టు (ట్ట)
మన్నించె యింక మారు మాటలాడ నేటికి ! ||ఇసుక||

శృం : 13–222

ప. - - ప ద | పా ప మ గా || గ రి రీ - | సా సా ||
- - ఇ సు | క పా - - || త - ర - | యం దు ||

- - స ని | దా గ గ || ప మ పా - ద | ని స రి స ని ద ప మ ||
- - కే ది | - క డ || గు - రు - - | తు - - - - - - - ||

దా ప మ | దా - ని సా || రి సా | రి స ని సా ||
- ర సి | కు - - డ || న - | న్నిం ం - త ||

సా గ | గా గ రి రీ || స ని సా రి గ రి స | స ని ద ని ద ప ప మ || దా
- ర | వ్వ శా - - || య - - - - - - | నే - - - టి - కి - || కి
||ఇసుక||

చ. - - గ గ | గా గా || గ రి రీ - | రి సా ||
- - వె న్నె | లే కా || యు - చు - | నుం డు ||

సా ప ద | పా పా ప మ || గ గ మ ప ద ప | ప మ గా గ రి రీ ||
- విం త | గా దు - - || వ - య - - - | సు - - - - - ||

సా గ గ | మ ప ద ప ద ని సా || సా స ని ద ని | దా - పా ప మ ||
- అ - | న్ని - - - టా - - || వ సం - - - | త - రు తు - ||

పా గ | మా ప ద పా ద ని ద ప ప మ || గా - | గ రి రీ సా ||
వై యుం | డ - - - - - - - - - - || బో - | దు - - - ||

- - ప | పా ద ప ప మ || గ మా | ప ద ని ప ||
- - వు | న్న తి - - - || (శ్రీ) వేం | క - టే - ||

ద ద స రి | సా సా - ని || ద ప మ దా - | నీ సా ||
శు డు ం డ | నుం డ - - || జ - - వి - | బు ట్ట ||

- - ప మ | దా - ని సా || రి సా | రి స నీ సా ||
- - మ - | న్నిం - - చె || యుం క | మా - - రు ||

సా గ | గా గ రి రీ || స ని సా రి గ రి స | స ని ద ని ద ప ప మ || దా
- మా | ట లా - - || డ - - - - - - - | నే - - - టి - - - || కి

||ఇసుక||

**అవతారిక :**

ఇందలి నాయిక ముగ్ధ. ఈమె తనకు పతియందుగల వలపులను దెలియజేయుచు చెలికత్తెలచే కబురు లంపుట, ఆతనిని దర్శించినపుడు అనురాగపు చేష్టలు చేయుట, మొదలగు పనుల వలన తన ప్రేమను నాయకునికి తెలియబరచుచు ఆవేదన పడుచున్నదని, ఇట్టి తమ చెలి కడకు నీవు విచ్చేయకూడదా అని నాయకునికి చెలి విన్నవించుచున్నది.

వరాళి — ఝంపె

విచ్చేయరాదా వెలది కడకు నీవు
యిచ్చ నాసపడు వారి నెలయించదగునా ! ॥పల్లవి॥

నిలిచి నిలిచి నీకు నిక్కి యెదురు చూచీని
వలచిన పతి నీవు వచ్చేవంటా
మలసి మలసి నీ మాటలే ఆలకించీని
యెలమి నేమని యానతిత్తువో యనుచు ! ॥విచ్చేయ॥

చిమ్మి చిమ్మి నీ యింటికి చేతులే చాచీని
తెమ్మల ఆసన్న నీవు తెలుతు వంటా
కుమ్మరించి గుట్టుమాని నవ్వీని
పమ్మినీవు తన కొంగు పట్టుదువో యనుచు ॥విచ్చేయ॥

పూచి పూచి నీ వద్దికి పొలతుల నంపీని
యేచక నీ విప్పుడిట్టె యేలుదు వంటా
రేచి రేచి వలపుల రేసువాయ గూడితిపి
దాచెను శ్రీ వేంకటేశ తమక మేలనుచు ! ॥విచ్చేయ॥

శ్లో : 26—187

ప, - ప సా స ని | స గ రి గా - || ప ప ప మ ప ద ప మ | గా గ రి రి స ||
- వి చ్చే య - | రా - - దా - || వె ల ది - క - డ - | కు నీ - - వు ||

- ప ద పా ప మ | ద ప ద ని స || - స ని ద ప పా ప మ | గ గ రి సా - ||
- యి చ్చ నా న - | ప డు వా - రి || - నె ల యిం - - చ - | ద - గు నా - ||
||విచ్చేయ||

చ. - ప ప ప ప ద ప మ | గా గ రి రి స || - స రి స ని ని | స ధ నీ సా స ||
- ని లి చి ని - లి - | చి నీ - - కు || - ని క్కి యె దు రు | చూ - - చీ ని ||

- స గ రి గ మ | పా ద ని ద ప ప మ ||
- వ ల చి న - | స తి - నీ - - వు ||

- ప ద ని స రి స ని ద | ప గ మా పా ||
- వ - చ్చే - - - - - | వం - - టా ||

- ప ద ప మ ప ద | ని స సా స ని || గా గ రి రి స | స ని ద ని స ||
- మ ల సి - మ ల | సి నీ మా ట - || లే అ - - ల | కిం - - చీ ని ||

- స స స ని స రి స ని | పా ద ని ద ప పా ప మ ||
- యె ల మి - నే - - - | మ ని - యా - - వ - ||

గ ప మ ద ప ప మ గా | గ రి రి సా - ||
తి - - త్తు - వో - - | య - ను చు - ||          ||విచ్చేయ||

**అవతారిక :**

వయ్యారమగు పదములతో, అందముగా అలమేలు మంగ విరహమును అయ్యవారు ఈ పదమునందు వర్ణించుచు, పరస్పర విరుద్ధములగు విషయముల పొత్తు. పొందికలను ఉదాహరణలుగా వాడుకొన్నారు. "ఈమె నవ్వుచునే కోపించుకొనుచున్నదట. ఆమె ప్రణయ కోపము అందముగా నున్నదట. తెలిసినతనమునందలి ఆశ్చర్యముతో కూడిన కోపము వలన మొగమున మెరుపులు గలిగి, అలుకలు చెదరి, చీకట్లు క్రమ్మినట్లున్నదట. నాయకునిపై తన బలమగు భావములను చూపుచున్నను, అందు కొంచెమగు భయము కనబడుచున్నదట. ఆమె చెలిమిలో కొంత వెగటున్నదట! ఆమె యురముల దిగువ నడుము, కలిమి లోపలి లేమివలె నున్నదట. ఇది యెట్లున్నదనగా నిడువు లోపలి కురుచ, నీడ లోపలి యెండ, మడుగు లోపలి మైల వలె నున్నదట. అతి వేగమగు భావములు గల యీమె తిరు వేంకటాధిపుని కౌగిటి యందు నలిగి, అలిగి, యానందించుచున్న"దని అయ్యవారు చెప్పుచున్నారు.

**వరాళి — ఝంపె**

ఇప్పుడిటు విభుజాసి యింతలోననె నేడు
తప్పు లోపలి తప్పు దైవమా చెలికి ! ॥పల్లవి॥

నగవు లోపలి యలపు నంపైన పొలయలుక
పగటు లోపలి వెరగు పచ్చివేడి
మొగము కాంతుల మెఱుపు ముంచు నలుకల చెదరు
పగలు చీకట్లాయె బాపురా చెలికి ! ॥ఇప్పు॥

బలిమి లోపలి భయము పలుకుదేనెల కసరు
చెలిమి లోపలి చేదు చింత చెలికి
బలుపు కుచములలోని బట్టబయలగు నడుము
కలిమి లోపలి లేమి కట కటా చెలికి ! ॥ఇప్పు॥

నిడుపు లోపలి కురుచ నీడ లోపలి యెండ
వడి మంచి తరువు విడువని తమకము
కడు వేంకటేశ్వరుని కౌగిటను పరవశము
మడుగు లోపలి మైల మాన దీ చెలికి ! ॥ఇప్పు॥

శ్రృం : 4—70

ప. - స స రి స స నీ | సా గ రి గా గ ||
- ఇప్పు - డిటు - | వి భు - డా సి ||

- ప ప ప మ గ | గ గ రీ సా స ||
- యింతలో - - | న - నె నే డు ||

- స స స ని దా | ప ప ద పా ప మ ||
- తప్పులో - - | ప లి - త ప్పు - ||

- గ గ మ ప ద ని | ద ప మ గ గ రి స ||
- దై వ మా - - - | - - - - చె లి కి || ||ఇప్పు||

చ. - ప ప ప ప మ గా | గ గ రీ న స స ||
- నిడు పులో - - | ప - లి కు రు చ ||

- స నీ ధా గ గ రీ | రి స సా స ||
- నీ - డ లో - - | ప లి యెం డ ||

- స నీ స గ గ | గ మ ప ద ప || ద ని స స వి దా | పా - - - ||
- వ డి మం - చి | త రు వు వి డు || వ ని త మ - క | ము - - - ||

- ప ద పా ప మ | ప ద ని స స ని || - స ని స గ గ | గ రి స స స ని ||
- క డు వేం క - | టే - శ్వ రు ని - || - కౌ - గి ట ను | ప ర వ శ ము - ||

- స స సా స ని దా | ప ద పా ప మ ||
- మ డు గు లో - - | ప లి మై ల - ||

- గ గ మ ప ద ని | ద ప మ గ గ గ రి స ||
- ఘ్నా న దీ - - - | - - - - చె - లి కి || ||ఇప్పు||

**అవతారిక :**

ప్రహ్లాద రక్షణమునకై నీవు నరసింహావతారమును ఎత్తితివి. అహోబిలము, వేదాద్రి మొదలగు పుణ్యక్షేత్రములలో నవనారసింహుల రూపమున నీవు వెలసి యుండగా శ్రీ మహాలక్ష్మి ఆయాస్థలములయందు నిన్ననుసరించి నీ మనసునకు ఆనందము కలుగునట్లు వేరువేరు రూపములతో నీ ప్రక్కన ఒనరియున్నది.'' అని అన్నమయ్యావారు లక్ష్మీ నరసింహులను అలమేలుమంగ వేంకటనాథుల రూపమున జూచుచు కొనియాడుచున్నారు.

**రాగ లక్షణం :**

రామక్రియ ప్రాచీన రాగములలో నొకటి. ఇప్పుడు ఇది 51వ మేళమగు కామవర్ధని బిన్యముగా లక్షణకారులు చెప్పుచున్నారు. కాని నిజమునకు ఇదియే కాశిరామక్రియ అను నామాంతరముగల 51 మేళకర్తయే యేమో ననిపించును. ఒకప్పుడు వేలకొలది రచనలతో నిండి అఖండ గౌతమివలె సంగీత ప్రపంచమున సవాహినులై ప్రవహించిన ఇటువంటి రాగములు ఇప్పుడు లుప్తమగుటకు గ్రంథస్థము చేసి ఉంచిన లక్షణములలో పొరపాటుండి యుండవచ్చును. ఉదాహరణకు కామవర్ధని ఎప్పుడు పలకాశిరామక్రియయైనదో, తిరిగి అదే పంతువరాళి ఎప్పుడైనదో, ఎందులకైనదో, చెప్పుటకు వలను పడకున్నది. ఇట్లే శ్రీ వేంకటనాథుని అవతారములవలె వస్తువొకటియైనను కొన్ని రాగములు పేర్లు మార్చుకొనుచున్నవోయేమో! ఇందు రామక్రియను కాశిరామక్రియగానే వ్యవహరించడమైనది గనుక ఇది సంపూర్ణ సంపూర్ణము.

స రి గ మ ప ద ని స ।స ని స ద ప మ ద మ గ రి స అనునవి ఆరోహణావరోహణములు.

**రామక్రియ—తిశ్రగతి రూపకం**

అటుచూడు సతినేర్పు లవుభళేళ
అట మటములు గావు అవుభళేళ ॥పల్లవి॥

యెదురు గొండల మీద నెక్కినట్టి లకిమమ్మ
అది వోసి తొడ యెక్కెనౌ భళేళ
వుదుటున నంతలోనే వురముపై నెలకొని
అదిమీ జన్మల నిమ్మ నౌ భళేళ! ॥అటు॥

ముంగోపముతోడను మొక్కలీడవైన నిన్ను
నంగన గద్దెపై బెట్టె నా భళేళ
కంగక వేదాద్రి నిన్ను గరుడాద్రికి దీసె
అంగా లంటె నింటిలోన నా భళేళ ! ॥అటు॥

చేరి నీవు నవ నారసింహరూపులై తే జెలి
ఆ రీతుల నిన్ను గోడె నా భళేళ
గారవాన నీవు శ్రీ వేంకటనుపై నుండగాను
అరసి రతి మెప్పించె నా భళేళ ! ॥అటు॥

శృం : 19–471

ప. స గ మా పా ॥ ప ద పా ప మ ॥ గా ప మ గా రి ॥ స ని స రి స ని ॥
అటు చూ డు ॥ స తి నే ర్పు - ॥ లౌ భ - ళే శా ॥ అ ట మ ట ము లు ॥

ద ప మ పా - ॥ గా ప మ గా రి ॥ సా - - - - ॥
గా - - వు - ॥ అవు భ - ళా - ॥ శా - - - - ॥ ॥అటుచూడు॥

చ. పా ద పా మ ॥ గ మ గ రి సా ॥ సా రి సా ని ॥ స రి గ రి గ గ ॥
చే రి నీ వు ॥ న వ నా - ర ॥ సిం హ రూ పు ॥ లై - తే - జె లి ॥

ప మ ప ద స ని ॥ పా ద పా మ ॥ గ రి గ గ ప మ ॥ పా - - - - ॥
ఆ - రీ - తు ల ॥ ని న్ను గూ డె ॥ నా - భ ళే - - ॥ శ - - - - ॥

గ ప మ పా ద ॥ స ని సా గ రి ॥ స ని స ద ని ప ॥ దా ని సా - ॥
గా - ర వా న ॥ నీ - వు శ్రీ వెం ॥ క ట ము పై - - ॥ నుం డ గా - ॥

స ని స రి స ని ॥ స ని ప ద ప మ ॥
అ ర సి - ర తి ॥ మె - ప్పిం - చె ను ॥

గా ప మ గా రి ॥ సా - - - - ॥ స గ మా పా ॥
అవు భ - ళే - ॥ శా - - - - ॥ అటు చూ డు ॥

**అవతారిక :**

ఇందలి నాయిక దివ్య. ఈమెకు పతిప్రేమ మాత్రమే కావలెను. నాయకునితో "నాగుట్టు బట్ట బయలు చేయకు, నేనునీపై అలుగలేను. నిన్ను మాటలనలేను. నీ కోరికలకు నియ్యకొౕన కుండలేను. నీ చల్లని చూపు, నీ ప్రియమగు వాక్కు నాకు చాలును." అని తన వినయశీలతను చెప్పుకొౕను చున్నది.

ఈమె పరకీయ కావచ్చునేమో గాని భావముల యందు దివ్యత్వమును కనబరచు చున్నది. గనుక పరకీయ లక్షణములు కనబరచు వాక్యములు ఒక్కటియు అనలేదు. గనుక ఈమెను దివ్యయని నిర్ధారించ వలసి వచ్చినది.

**రామక్రియ — రూపకం**

గుట్టు తోడి బ్రదు కొౕక కొౕలదైన జాలురా
గట్టిగా నీవు మన్నించే కరుణే చాలురా ! ॥పల్లవి॥

మొదల నలుగలేను ముంచి నీకు మొక్కలేను
కదిసి యున్న పెద్దరికమే చాలురా
పెదవుల దిట్టలేను పెంచి పంత మియ్యలేను
అదన నీవు నవ్విన ఆపాటే చాలురా ! ॥గుట్టు॥

బిగిసి యుండగలేను ప్రియము చెప్పగలేను
మొగము చూడగలిగే ముచ్చటే చాలురా
తగవులు చెప్పలేను తగ నిచ్చలాడలేను
తగువైన వావులతో తత్తరాలే చాలురా ! ॥గుట్టు॥

అటు పరాకు గాలేను ఆనవెట్టు కోలేను
యిటు నిన్ను గూడితి నాకిది చాలురా
ఘటన శ్రీ వేంకటేశ కరగించి మానలేను
తటుకున నీకు నాకు దక్కినదే చాలును ! ॥గుట్టు॥

శృం : 26–124

ప. ప మ గా ప మ || గ రి సా స రి నీ || స రి గ రి గా || ప మ పా పా ||
గు ట్టు తో డి - || బ్ర దు కో క - - || కొ ల దై - న || చా - లు రా ||

గ మ పా ద ప || ద ని స ని రి స || స ని స ద ని ప || ద మ ప గ మా ||
గ ట్టి గా నీ వు || మ - న్నిం - చే - || క రు ణే - చా - || - లు రా - - ||
||గుట్టు||

చ. స రి గా ప మ || గ మ గ రి సా || స రి సా రి స నీ || స రి గ రి గా ||
మొ ద ల న లు || గ - లే - ను || ముం చి నీ కు - - || మొ క్క లే - ను ||

గ మ ప ద ని సా స ని || ద ని ప ద మ ప ||
క ది సి యు - - న్న - || పె - ద్ద రి క మే ||

ప మ గ మ గ రి గ మ || పా - - - - ||
చా - - - - లు రా - || - - - - - ||

గ మ పా ద ప || ద ని సా సా ||
పె ద వు ల - || ది ట్ట లే ను ||

స ని దా ని స రి స రి || గా ప మ గ రి సా ||
పెం - - చి - - పం త || మి య్యా - లే - ను ||

స గ రీ సా ని స || ద ని స రి నీ సా ||
అ - ద న నీ వు || న వ్వి - - - న ||

స ని స ద ని ప || ద మ ప మ గ రి గ మ ||
ఆ - పా - ఛే - || చా - లు - ర - - - ||
||గుట్టు||

**అవతారిక :**

ఇందు చంద మామను అత్యంత మనోహరముగా వర్ణించుచు విరహార్తులగు వారికి కిట్టనిదియు, పాల సముద్రము నందు బుట్టి నదియు చుక్కల రాశికి భాగ్యమైనదియు, మన్మథుని అజ్ఞచే వలపను విత్తనములు చల్లెడి దియునై వెన్నెల విరాజిల్లు చున్నదని అయ్యవారు చెప్పు చున్నారు.

**రామక్రియ — రూపకం**

సందెకొండ బుట్టి నట్టి చాయల పంట యెంత
చంద మామ జూడ రమ్మ చందమామ పంట! ॥పల్లవి॥

మునుప పాల వెల్లి మొలచి పండిన పంట
నినువై దేవతలకు నిచ్చపంట
గొనకొని హరికన్ను గొన చూపుల పంట
విను వీథి నెగడిన వెన్నెలల పంట ! ॥సందె॥

వలరాజు పంపున వలపు విత్తిన పంట
చలువై పున్నమనాటి బోజర పంట
కలిమి కామిని తోడ కారుకమ్మిన పంట
మలయుచు దమలోని మట్టి మాని పంట ! ॥సందె॥

విరహుల గుండెలకు వెక్కసమైన పంట
పరగ చుక్కల రాసి భాగ్యము పంట
అరుదై తూరుపు గొండ నారగ బండిన పంట
యిరవై శ్రీ వేంకటేశు నింటిలోని పంట ! ॥సందె॥

అ : సంకీ. సం. 2—53

ప, ప ద పా ప మ ॥ గ మ గా రి స ॥ స రి స ని స రి ॥ గా - - గ మ ॥
సం దె కా డ - ॥ పు ట్టి న - ట్టి ॥ చా య ల - పం - ॥ ట - - యెం త ॥

ప ద ని స ని ద ॥ ప ద ప మ గ రి ॥
చం ద మా - మ - ॥ చూ డ ర - మ్మ - ॥

స రి గ ప మ గ రి ॥ సా సా - - ॥
చం ద మా - - మ - ॥ పం ట - - ॥ ॥సందెకాడ॥

చ. ప ప దా పా ప మ ॥ ప ద ప ప ప మ ॥
మ ను ప పా ల - ॥ వె ల్లి మొ ల చి - ॥

గా ప మ గ రి స రి ॥ గ మ గ - - ॥
పం డి - న - పం - ॥ ట - - - - ॥

గ మ ప ద ని స ॥ ని ద ప మ గ రి ॥ గా ప మ గ రి రీ ॥ సా - - - - ॥
ని ను పై - దే - ॥ వ త ల - కు - ॥ ని చ్చ - ల - పం ॥ ట - - - - ॥
గ మ పా దా ॥ ని స ని ద ప మ ॥ గ మ పా ద ప ॥ ద ని సా - - ॥
గో న కో ని ॥ హా రి క - న్ను - ॥ గో న చూ పు ల ॥ పం - ట - - ॥

స ని స గ రి స ని । ద ప ప మ గ రి ॥ స రి గ ప మ గ స । రి సా - - ॥
వి ను పీ - - ధి - । నె గ డి - న - ॥ వె న్నె ల - - ల - । పం ట - - ॥
॥సందెకాడ॥

**అవతారిక :**

ఇందలి నాయిక ప్రౌఢ. జాణ తనములు నేర్చిన కోపిదురాలు. తనపై మక్కువ కలిగి వచ్చి ఏమియు నెఱుగని వానివలె నున్న నాయకునితో "అంగనలు సిగ్గుతో, మోవాట ముతో నెట్లుండినను అమరికలే ఆయెను గాక, పురుషునితో సమముగా పెనగులాడుదురా ఎత ప్రౌఢలైనను! నీకు బోదైన చోట తగలి మాటడ వలదా! చెల్లుబడి గల చోట సిగ్గులు విడు దురా! నమ్మికలు తెలిసిన చోట తమకించి కూడ కుందురా? అట్లు చేయనిచో నీవు సరసు డవని అనుకొందురా? గోడ చేరువున బెట్టిన బొమ్మవో మనుజుని వలెనున్న మ్రాకువోయను కొనరా పోనిమ్ము రఘునాథుడవై నన్ను కూడితివి" అని ముద్దుగా తిట్ట వలసిన తిట్లెల్ల తిట్టి నాయకుడగు శ్రీ వేంకట నాథుని యేలుకొను చున్నది.

రామక్రియ—త్రిపుట

అంగన యెట్టుండినా నమరు గాక
సంగతే నీకు నాపె సాటికి పెనగను ! ॥పల్లవి॥

తనకు బోదైన చోట తగిలి మాటాడకున్న
మనుజుడా వాడు పెద్ద మాను గాక
చనవున చెనగగా సమ్మతించ కుండితేను
ఘనత యేది ? చులక దనమే గాక ! ॥అంగన॥

చెల్లు బడి గల చోట సిగ్గులు విడువ కున్న
బల్లిదుడా వాడు కడు పంద గాక
వెల్లి విరి నవ్వగాను వీడు దోల్లాడ కున్న
చల్లేటి వలపులేవి ? నటలింతే కాక ! ॥అంగన॥

తారుకాణలైన చోట తమకించి కూడ కున్న
చేరగ జాణడా గోడ చేరువు గాక
యీ రీతి శ్రీ వేంకటేశ యిట్టె రఘునాధుడవై
కూరిమి గూడితివిది కొత్త లింతే కాక ! ॥అంగన॥

రేకు: 13—11

ప. - - ప | పా మా || పదమగ | రి సా ||
- - అం | గ న || యె - ట్టుం | డి న ||

- - రి | స ని స రి || గా - | గ మ పా ||
- - అ | మ - రు - || గా - | - - క ||

- - గ మ | పా దా || ద ని సా | స ని దా పా ||
- - సం - | గ తే || నీ - కు | నా - - పై ||

- - ద ని | స రి ని స ద ని ప ద || మ ప ద పా మ | గ రి స రి || గ మ
- - సా - | టి - - - కి - - - || పె - - న - | గ - ను - || - -

||అంగన||

2. - - ప | పా మా || ద ని సా రి స ని స | ద ని ప ద మ ప గ మ || గ రి స
- - అం | గ న || యె - ట్టుం - - - | డి - - - న - - -

చ. - - రి గ | మ గ గా || గ మ ప మ గ రి | ప మ గ రి సా ||
- - త న | కు - బో || దై - - - న - | చో - - - ట ||

- - ని స | ధ ని సా || స రి గ రి | ప మ గ రి సా ||
- - త గి | లి - మా || టా - - డ | కు - - - న్న ||

- - స రి | గ రి గా || - - గ మ | ప ద మ గ రి ||
- - మ ను | జు - డా || - - వా - | డు - పె - - ||

స స్ స రి గ | పా గ మ ప ద || ప మ గ రి గ మ || పా పా ||
ద్ద - మా - కు | - గా - - - || - - - - - - || కా - ||

- - గ మ | ప ద స ని దా || ప ద ని ద ప మ | ప గ మా పా ||
- - చ న | వు - - - న || పె - - న - - | గ - - గా ||

దా గ మ | పా - ద స ని దా || ప ద ని ద ప మ | ద సా - ని స ||
- స - | మ్మ - - తిం - - || చ - - కుం - - | డి తే - - ను ||

- - స రి | గ మ ప మ గ మ గ రి || స స స ని | స రి గ రి స ని ధా ||
- - ఘ న | త - - - యే - - - || ది చు ల - | క - - - ద - - ||

ప ద ని సా - | స రి ని ద ప || రి స రి ని స ద | ని ప ద మ ప గ మ ప || దా
న - - - - | మే - - - - || గా - - - - - - | క - - - - - - - || -

||అంగన||

**అవతారిక :**

"అనేక జన్మముల నెత్తిన నేను యెందరు సతులను, సుతులను బంధువులను పొందితినో, ఎందరికి నేను సతీసుత బాంధవులలో నొకడినైతినో ఎట్లు తెలియును ? ఐనను వాసనలు మాత్రము నన్ను వదలకున్నవి. ఎప్పటికప్పుడు మరపున పడెడి యీ అనుబంధములను త్రెంచుకొనుటకై శ్రీ వేంకటేశ్వరుని శరణువేడి ఆతని యందు మనసును లగ్నము చేసితిని' అయ్యవారు చెప్పుచున్నారు.

**రామక్రియ — ఆది**

ఎందరు సతులో యెందరు సుతులో
యిందు నందు నెల్లెరిగే నేను ! ॥పల్లవి॥

మలయుచు నాయభిమానములని నే
కెలన నిపుడు వెదకే నంటే
పలుయోనులలో పలుమా (మ) రు బొడమిన
చెలమరి నా తొలి జన్మములను ! ॥ఎందరు॥

గరిమెల బాణి గ్రహణము సేసిన
సిరుల చెలుల గలసే నంటే
తరుణుల గురుతుల తలపున మరచితి
పరగిన బహు కల్పంబుల యందు ! ॥ఎందరు॥

శ్రీ వేంకటగిరి చెలువుని యాజ్ఞల
భావించియె కరి చైకొంటి
తావుల జూడగ తగిలిన కోర్కుల
భావరతుల భ్రెంబడి మనసందు ! ॥ఎందరు॥

ప. పా ప మ గ రి గా । మ ద ప మ । గ రి సా ॥
ఎం ద రు స తు లో । ఎం - ద రు । సు తు లో ॥

సా రి సా ని సా । స రి గ రి । గ మ పా ॥
యిం దు నం దు నె । ల్లె రి గే - । నే - ను ॥ ॥ఎందరు॥

చ. ప ప ద ద ని ద ప మ । గ మ ప మ । గ రి రి స ॥
మ ల యు చు నా - య ఖి । మా - న ము । ల ని నే - ॥

స గ రి గ ప మ ప ద । ద ని సా ని ద । పా - - ॥
కె ల న ని పు డు వె ద । కే - - నం - । చే - - ॥

ప మ ప ద ని ని సా । గ రి గా ప మ । గ రి స స ॥
ప లు యో - ను ల లో । ప లు మా రు - । బొ డ మి న ॥

ద ని స ని స రి స ని । ద ప ప మ । గ రి సా ॥
చ ల మ రి నా - తొ లి । జ - న్మం - । బు ల ను ॥ ॥ఎందరు॥

**అవతారిక :**

ఇందు దక్షిణ నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుని చేతలను దెప్పి పొడుచుచు "నీ గుణము తెరుగనా, చన విచ్చినచో నీవు అంటు బచ్చలి వలె వేళ్లు నాటు కొనుచు అలము కొందువు. అలనాడు గోపికలను పెండ్లాడ లేదా! ఇంకను అదృష్ట వంతులగు కామినులను ఎందరినో కామించి, నిన్నేమియు అన జాలని దాననగు నన్ను గలిసితివి. నేను నీ అలమేలు మంగను గానా" అని నాయిక అను చున్నది

**రామక్రియ — ఝంపె**

అవునయ్యా నీ సుద్దు లటు వంటివి
జవళితో నంటు బచ్చలి వంటి వాడవు ! ॥పల్లవి॥

చెలరేగి యెడ లేని చేతలెల్లా జేసివచ్చి
వెలయ నిప్పుడు నన్ను వేడుకొనేవు
పలుమారు నీ చేత బాసలు గొన వెరతు
కలువ కంటుల యెడ కాత రీడ వనుచు ! ॥అవునయ్యా॥

వాడ వారిపై నెల్లా వలపులు చల్లి వచ్చి
యీడ నాతో నేడలేని యిచ్చలాడేవు
కోడె కాడ నీ వోజ కొనియాడ సిచ్చితయ్యా
జాడతో నింతుల యెడ చంచలుడ వనుచు ! ॥అవునయ్యా॥

పెక్కు గోపికల నెల్లా బెండ్లాడి యిట వచ్చి
గక్కన నా కౌగిట గలసితివి
నిక్కి శ్రీ వేంకటేశుడ నే నలమేల్మంగను
కక్కసించ నోప నీవు గబ్బి వాడవనుచు ! ॥అవునయ్యా॥

రేకు : 25–20

ప. ప మ గా రి ॥ సా రి గ రి స స ని ॥ స రి గా గ రి । గా - - - ॥
అ వు న య్యా ॥ నీ - - సు - - ద్దు ॥ ల టు వం టి - । వి - - - ॥

మ గ మ ప దా । సా స ని సా ॥
జ - వ ళి తో । నం టు - బ ॥

స నిదపా ప మ । గ ద ప మ గ రి స రి గ మ ॥
చ్చ - లి వం టి - । వా - - - డ - వు - - - ॥ ॥అవునయ్యా॥

చ. ప ద పా ప మ । గ గ రి గా గ ॥ స రి గా ప మ । గ రి సా స ॥
చె ల రే గి - । యే డ - లే ని ॥ చేత లె ల్లా - । చేసి వ చ్చి ॥

- స స రి సా - ని । స రి గ రి గ ॥ ప మ ప ద ని ద । ప మ పా - ॥
- వె ల య ని - - । ప్పు డు న - న్ను ॥ వే - - డు - కొ । నే - వు - ॥

- ప ద నీ ద । నీ స రి స ॥ - స రి గ గ ప మ । గ రి స స స ॥
- ప లు మా రు । నీ చే - త ॥ - బా - స లు - - । గొ న వె ర తు ॥

- స స రి సా - ని । ద ప ద నీ ॥ - పా ద ని ద ప పా । ప మ గ రి గ మ ॥
- క లు వ క ం - - । టు ల యె డ ॥ - కా త - రీ - - । డ - వ ను చు - ॥

ప మ గా రి । సా రి గ రి స స ని ॥
అ వు న య్యా । నీ - - సు - - ద్దు ॥

**అవతారిక :**

"జీవులకు దక్కిన దైవమై వేంకటాద్రి యందు నెలకొని యున్న యాతనిని సేవించి తరించరాదా ! మానవుల నాశ్రయించి అందని వానికి అఱ్ఱులు చాచుచు, చంచలము లగు విభవముల నాశించుచు తిరుగుట బుద్ధిహీనతకాదా ! బల పరాక్రమములు, తెలివి తేటలు, అంద చందములు పొందినను శ్రీ వేంకటేశ్వరుని కటాక్షమును పొందిన సుఖసంతోషములు కలుగవు సుమా !" అని అయ్యవారు చెప్పుచున్నారు.

**రామక్రియ—రూపకం**

ఎంత లేదు చిత్తమా యాతలేల మోతలేల
వంతులకు బారనేల వగరించనేలా ! ॥పల్లవి॥

దక్కనివి గోరనేల తట్టుముట్టు పడనేల
చిక్కి నంతకే సంతసించ రాదా
ఒక్కమాటే వుప్పుదిని వుపచాప మంద నేల
చక్క జాడ దగినంతే చవి గొనరాదా ! ॥ఎంత॥

పారి పారి వేడ నేల బడలిక పడనేల
మీరి దైవ మిచ్చినంతే మెచ్చరాదా
వీరిడై పొడవెక్కి విరుగ బడగనేల
చేరి యుండినంతకే చేచాచరాదా ! ॥ఎంత॥

జీవుల గొలువనేల సిలుగుల బడనేల
శ్రీ వేంకటేశుడాత్మ జిక్కి వుండగా
దావతి పడగనేల దప్పుల బొరలనేల
కైవశమైనందుకే గతి గూడ రాదా ! ॥ఎంత॥

ఖ : 11–131

ప. పా । దపామ ॥ గా । రి గా - ॥ పా । మ గా రి ॥ సా । రి గా మ ॥
ఎం । త లేదు ॥ చి । త్తమా - ॥ యీా । త లేల ॥ మో । త లే ల ॥

పద । సదనిసా ॥ నిద । నిదాప ॥
వం - । తుల - కు ॥ జా- । ర నే ల ॥

పద । పదనిసస ॥ నిద । నిదపా ॥
వగ । రిం - - - చ ॥ నే- । - - ల ॥ ॥ఎంత॥

చ. పా । దపపమ ॥ గప । మగరిరి ॥
ద । క్కనివి - ॥ గో - । ర నే - ల ॥

సా । రిగా మ ॥ గరి । సాసా ॥
త । ట్టుముట్టు ॥ పడ । నే ల ॥

సా । రి గా మ ॥ పా । పపదప ॥ దనిస । ని దనిద ॥ పా । - - - - ॥
చి । క్కనం త ॥ కే । - సం - త ॥ సిం - - । చ రా - - ॥ దా । - - - - ॥

పా । ద పా ద ॥ దని స । సససరి ॥
ఒ । క్కమాటే ॥ వు - ప్పు । - తి ని - ॥

గరి । గగపమ ॥ గరి । రిసాస ॥
వుప । తా - ప - ॥ మం - । ద నే ల ॥

సా । రిగారి । సరి । సనిదప ॥ పప । మగరి ॥ గా । మపా - ॥
చ । క్కజాడ । దగి । నం - తే - ॥ చవి । గొన - ॥ రా । - దా - ॥
॥ఎంత॥

**అవతారిక :**

"శ్రీ వేంకటేశ్వరుడా నీవు దేవుడవు. నేను మానిసిని, సామాన్యుడను, చపల చిత్తుడను, సంసార బద్ధుడను. జీవాత్మ పరమాత్మ అనునని తల్లి బిడ్డలవలె యెడబాయక దేహ ముల యందుండునని నీవు వెలయించిన విజ్ఞానము చాటుచున్నదే! నాయందే నీ వుండి నేను తప్పులు చేయుచుండినచో ఊరకుందువా! నన్ను హెచ్చరించి ఉద్ధరింపవలదా! నూతికట్టపైకి బిడ్డడు పోవ తల్లి చూచుచు నూరకుండునా? అట్లే నన్ను పాపముల నుండి రక్షించుట నీ పని గాదా" అని తన ఆరాధ్య దైవమగు వేంకటనాథుని అయ్యవారు దండించి యడుగుచున్నారు,

ఇది తాళ్ళపాక పెద తిరుమలాచార్యులవారి రచన.

**రాగ లక్షణము :**

బౌళి రామక్రియ అనునది ప్రాచీన రాగములలో నొకటిగా తోచుచున్నది. ఇందు ఇతర వాగ్గేయకారుల రచనలు కానరాకుండుట వలన ఇది ఇప్పుడు లుప్తమై పోయినట్లే భావించ వచ్చును. కాని బౌళి రామక్రియ అను పేరునందు సూచింపబడినట్లు ఆరోహణమున బౌళి, అవరోహణమున రామక్రియ నుంచి ప్రయత్నించినచో ఇది యొక అందమైన రెండు రాగముల మేళవింపు వలె స్ఫురించుచున్నది.

**ఆరోహణ** : స రి గ ప ద స

**అవరోహణ** : స ని స ద ప మ గ రి గ రి స

ఇందు సంచారములు, ప్రయోగములు పాడి, అనుభవ పూర్వకముగా తెలుసుకొన వలసి యుండును.

**బౌళి రామక్రియ — ఆది**

అనాథుల రక్షించేది అన్నిటా బుణ్యము గాదా
నైనగి నూతి కట్టబిడ్డ బట్టవలదా! ॥పల్లవి॥

నావలె మత్తుడవా నానా భోగలోలుడవా
కావించి బుద్ధి యెఱుగని వాడవా
భావించ నే జీవుండను ప్రకృతి యుల్లైతేనేమి
దేవుడవు నాలోనుండి తెలుపగ వలదా ! ॥అనాథుల॥

చంచల చిత్తుడవా సంసార బద్ధుడవా
పొంచి నా వలెనే నీ వకించనుడవా
ముంచి తెరువెఱుగని మూఢుడ నైతినేమి
యెంచి సంగడీడవు యెచ్చరించ వలదా ! ॥అనాథుల॥

యేమఱేటి వాడవా హీన గుణము వాడవా
పామరపు సేతల బాగు వాడవా
నే మానిసి నై తేనేమి నీవు శ్రీ వేంకటేశ్వర
దోమటి చుట్టమవు పొందుగా గావ వలదా ! ॥అనాథుల॥

అ : 21-366

ప. స సా రి గా పా । ప ద ద ప మ గ । పా - - ॥
అ నా థు ల ర । క్షిం - చే - - - । ది - - ॥

పా ద పా మ గ రి । గా ప మ గ రి । సా - - ॥
అ న్ని టా - పు - । ణ్య ము - గా - । దా - - ॥

గ ప ప ద ద స స ని । స ని ద ద ని । దా పా ॥
పె న గి - నూ - తి - । క - - ట్ట - । బి డ్డ ॥

ప గ పా ద ని ద ప ప మ । గ ప గ రి । సా - - ॥
భ - ట్ట - - - - వ్ర - । ల - - - । ద్రా - - ॥ ॥అనాథుల॥

చ. ప ద పా ప మ గ రి । గ ప గ రి । సా - - ॥
ఏ - మ రే - టి - । వా - డ - । వా - - ॥

ప గ పా దా సా । స ని దా । పా - - ॥
పా - మ ర పు । సే - త । ల - - ॥

పా ద ప గ రి గా । పా - - । - - - - ॥
ఖా గు - వా - డ । వా - - । - - - - ॥

ప మ గా పా దా । స రి గ రి । గా గా ॥
నే - మా ని పి । నై - తే - । నే మి ॥

గా ప మ గా రీ । సా రి గ రి స । - స ని దా ॥
నీ వు - (శ్రీ) వేం । క - - - చే । - శ్వ - రా ॥

ప ద సా సా రి గ రి స । సా స ని వ । ద ప దా ॥
దో - మ టి - - - - । చు ట్ట - - । మ - వు ॥

ప గ ప ద స ని ద ప । ప మ గ రి । సా - - ॥
పొం - దు - గా - కా - । న - వ ల । దా - - ॥

॥అనాథుల॥

**అవతారిక :**

ఇందు స్వాధీన పతిక యగు నాయికను చెలులు "ఈమె పెనగులాడు చున్నది ప్రియునితో వాదులాడుచున్నది. ఇట్లు చేయవచ్చునా! నాయకుడగు శ్రీ వేంకటేశ్వరుడు తన వద్దికి రాగా మొక్కవలదా! ప్రియములు పలుక వలదా! అతని మనసు రంజింప చేయవలదా? ఈమెకు బుద్ధులు చెప్పవలెను రం"డని తమలో తాము హెచ్చరించు కొనుచున్నారు.

**బౌళి రామక్రియ—చతురశ్ర ఏక**

ఇద్దరు నొక్కటే యెప్పుడును
బుద్ధులు చెప్పరే పొలతుకలూ! ॥పల్లవి॥

చలమున నూరకే సాదించీ జెలి
తలపు దెలియకే తన పతిని
కలి ముదిసి మేడిదె గాక తొలుతనె
కలక దేరుచరే కామిమలు! ॥ఇద్దరు॥

విచ్చన విడిగా వెంగెము లాడీ
గచ్చుల యలుకల కాంతునిని
హెచ్చి గోరి రేక యేరుగా నెపుడె
మచ్చిక సేయరే మానినులు! ॥ఇద్దరు॥

పనివడి కూడుచు బంతము లాడీ
ఘనుడగు శ్రీ వేంకట విభుని
ననలే విరులై నాటకమును పనె
పెనగి మొక్కించరే ప్రియ సఖులు! ॥ఇద్దరు॥

శ్రృం : 18—530

ప. సా స రి | గా ప మ | గ మ గ రి | సా - - ||
ఇ ద్ద గు | నొ క్క చే | ఎ - ప్పు డు | ను - - ||

ప గ ప ద | స ని ద ద | ప ద ప మ | గ మ గ రి ||
బు - ద్ధు లు | చె - ప్పా రె | పొ ల తు క | లు - - - || ||ఇద్దరు||

చ. గ మ ప ద | ద ప ప ప | గ ప ప ద | ద ప పా ||
ప ని వ డి | కూ - డు చు | బం - తే ము | లా - డి ||

స రి గ గ | ప మ గ రి | గ గ ప ద | పా - - ||
ఘ ను డ గు | శ్రీ - వేం - | క ట వి భు | ని - - ||

స రి గా - ప | గ రి సా | స రి గ ప | గ గ స స ||
న న తే - - | వి రు లై | నా - ట క | ము ను ప సె ||

ప ద సా | ని దా | ప ద ప మ | గ రి సా ||
పె న గి | మొ క్కిం | చ రే ప్రి య | స ఖు లు || ||ఇద్దరు||

**అవతారిక :**

ఇందలి నాయిక స్వాధీన పతిక. "ఇంక నీతో ఆనలు బెట్టనేల! అలుకలు పోవనేల, నీకు లోనైన దానను గనుక నన్ను జూచి నీవు ఏమైనను చేయుదువు. నవ్వెదవు, హేళన చేసెదవు నాపై బీరములు పలికెదవు, నీ గుణములను విమర్శింపక నీకులోనై తిని గదా! నీ సరసములకును చనవులకును కరగి నేను మునిగితిని, ఇంకేమున్నది?" అని ఈమె నాయకునితో చెప్పుకొని ఆతని కొంటె తనములకు వాపోవుచున్నది.

**బౌళి రామక్రియ — తిశ్రఏక**

అన నింకే మున్నది అలుగ నేమున్నది
కనుగొనలనే చూచి కరగుట గాక! ॥అన॥

నవ్వు నవ్వా జెల్లును నాలి సేయు జెల్లు నీకు
రవ్వగా నే మోహించి రాపైన యందుకు
యెవ్వరితో దగవూ లిక నాడే నేను
జవ్వనాన నొంటి నేను జడియుట గాక! ॥అన॥

బిగియా నమరునూ బీరాలు నమరునూ
తగవు లెంచక నిన్ను దగ్గరిన యందుకు
జగడమూ జెల్లదూ సాదించ జెల్లదూ
మొగమోటమున నేనే మొలుగుట గాక! ॥అన॥

సరసము దక్కెనూ చనవెల్లా నెక్కెనూ
మరగి నీ కౌగిట నేను మఱచిన యందుకు
తెరయెత్త బనిలేదు దిష్టము (శ్రీ) వేంకటేశ
సరుగ నీ రతిజిక్కి సత మౌట గాక! ॥అన॥

శృం : 26–148

ప. స రి గా ప మ | గ మ గా రి స || స స రి ని స ధ ని | ధ ధ నీ సా ||
అ న నిం క - | నే - ము న్న ది || అ లు గ నే - ము - | స్న - - ది ||

ప మ గ ప దా | స ని ద రి సా || ని స ద ని ప ద | మ ప గ మ గ రి ||
క ను గొ న ల | నే - చూ - చి || క ర గు - ట - | గా - - - క - || అన||

చ. ప మ ప ద నీ దా | ప ద ద ప ప మ పా ||
న వ్వు న - - వ్వా | జె - ల్లు - - - ను ||

గ ప పా ద ప గా | గ ప మ గ రి సా ||
నా లి సే - - య | జె ల్లు - నీ - కు ||

స రి గ ప ద ప గ రి | స రి గా గ రి రీ సా ||
ర వ్వ గా - - - నే - | మో - - హిం - - చి ||

స రి గా పా | ప మ దా పా ||
రా - పై న | యం - దు కు ||

గ ప ప ద సా సా | స రి గా గా ప మ గ రి ||
యె వ్వ రి - - తో | త గ వు లి - - క - ||

స రి స ని ద ని | ప ద సా సా ||
నా - డే - నే - | - - ను - ||

స స ని ప ద స ని ద ప | పా ప ను ప ద ప మ గా ||
జ వ్వ - - నా - - న - | నొం టి - నే - - - ను ||

గ ప ద సా ని | ద ని ప ద మ ప గ మ గ రి సా ||
జ డి యు ట - | గా - - - - - క - - - - ||

||అన||

**అవతారిక :**

ఈ రచన యందు "దానవాంతకుడై, దుష్టశిక్షణ చేయువాడై, శిష్టులను రక్షించుటకు స్థిరమైన సంకల్పము కలవాడై తిరు వేంకటగిరి యందు వేంచేసి యున్న శ్రీపతిని పురుషోత్తముని, నరహరిని - అమరులు, శుక, శౌనకాది మునులు కొలిచి తరించిరి. ఇందుకు ప్రమాణము వేదములే. తరించెడి తలపు గల జీవులకు దిక్కు అతడే'' అని అయ్యవారు పదే పదే ఆ స్వామి గుణములను గానము చేయు చున్నారు

**బౌళి రామక్రియ — త్రిపుట**

పలికెటి వేదమె ప్రమాణము
తలచిన వారికి తత్వము సుండీ !

నరహరి యజాండ నాయకుడు
సురలితనినె సంస్తుతించిరి
పురుషోత్తముడిదె భూమికి యీ
హరి గొలువని వారసురులు సుండీ ! ॥పలికెటి॥

కమలా రమణుడె ఘనుడు
అమరులె మ్రొక్కుదు రాతనికి
విమతుల దునిమె విష్ణుడు
తమి బూజించక తగు గతి లేదు ! ॥పలికెటి॥

భావజ జనకుడు బ్రహ్మము
సోవగ గొలిచిరి శుకాదులు
శ్రీ వేంకటపతి చెలువుడు
దైవ శిఖామణి దలచరో బుధులు ! ॥పలికెటి॥

అ : 10–210

ప. ప దా | స ని దా || ప మ ద | ప మ గ రి ||
ప లి | కె - టి || వే - - | ద - మె - ||

సా రి | గా గా || ప మ ద | పా ద గ ||
ప్ర - | మా ణ || ము - - | - - - ||

గ పా | ద ని ద ప || ప మ గ ద | ప మ గ రి ||
త ల | చి - న - || వా - - - | రి - కి - ||

ప రీ | గా పా ద ప || ప మ గ రి | సా - - ||
త - | త్వ ము - - || సుం - - - | డి - - || ||పలికెటి||

చ. ప దా | దా దా || ప ద ని ద | ద ప పా ||
న ర | హ రి || య - - - | జాం - డ ||

ప మ గా | దా దా || పా - | - - - - ||
నా - - | య కు || డు - | - - - - ||

స రీ | గా పా ద ప || గ రీ | సా సా ||
సు ర | లి త - - || ని - | నె సం ||

ప దా | స రి గ రి || గా - | - - - - ||
స్తు తిం | - - - చి || రి - | - - - - ||

గ ప మ | ద ప దా || సా ని | రీ రీ ||
పు రు - | షో - త్త || ము - | డి దె ||

స రీ | గ ప మ గ రి || గా - | - - - - ||
భూ - | మి - - కి - || యా - | - - - - ||

౩.౬

స రీ | రీ రీ || స సా | స ని ద ప ||
హా రి | కా లు || వ ని | వా - - - ||

గ ప ద స ని | దా పా || ప మ గ ప గ రి | సా - - ||
ర సు - - - | రు లు || సు ం - - - - - - | డి - - || || . లి కెటి ||

**అవతారిక :**

ఈపదము నందలి నాయిక స్వాధీనపతిక రూపగర్విత, ముగ్ధ. ఈమె చేష్టలను గమనించిన చెలి "ఏమమ్మా! కొంగువట్టి వెనుక వెనుక తిరుగు నాధునితో నిట్లు పెనగులాడుదురా? చెంతకు వచ్చిన యాతనికి నీ చేతులతో పిడెమియ్యరాదా? ఉయ్యాల మంచముపై నీ సరసన కూర్చుండ నీయరాదా? అతడు చేజాచి నిన్నందుకొనగా అనుమతిచ్చి అలముకొనరాదా? ఓయమ్మా! నీ యందు ఎంత భక్తిగల వాడే నీ నాధుడు. శ్రీ వేంకటరమణుడు అతనితో నేలనమ్మా యీ బిగువులు?" అని అలమేలు మంగాదేవికి హితవులు చెప్పుచున్నది.

**రాగలక్షణం :**

మోహన అతి ప్రాచీనమగు రాగము. ఇది యిప్పటి 65వ మేళమగు కళ్యాణి జన్యము.

**ఆరోహణ :** స రి గ ప ద స

**అవరోహణము :** స ద ప గ రి స ।

వెంకట మఖి సంప్రదాయమున దీనిని భాషాంగమని చెప్పియున్నారు. నవీనులు 'స దా' అనునప్పుడు కించి త్కాకలి నిషాదమును, 'పా గా' అనునప్పుడు కించిత్ప్రతి మధ్యమమును 'గ ప దా' అను నప్పుడు దైవతమును కంపింప జేయుచు కైశికి నిషాద చ్ఛాయలు పలుకు నట్లును, 'స రి గా' అనునప్పుడు గాంధారము నందలి కంపనములలో శుద్ధ మధ్యమపు ఛాయలు వినబడుచుండునట్లును పాడుచున్నారు. ఇది సంప్రదాయము కాదు.

**మోహన (అమరసింధు)— రూపకం**

ఎంత బత్తో నీ మీద నీ రమణుడు
చెంత నుండి ఇయ్యగదే చేతికి భాగాలు! ॥పల్లవి॥

పయ్యెద కొంగు వట్టి పతి నీతో బెనగిని
ఇయ్యకొని రాగదవే ఇంటికి నేడు
చెయ్యార నప్పటి నీ చెక్కు నొక్కి వేడుకొనీ
వుయ్యాల మంచముపై గూచుండ గద్దె సరుస! ॥ఎంత॥

నెట్టుకొన గాగిలించి నిన్ను నొడ బరిచీని
అట్టెకానిమ్మన గదె అతని తోను
వొట్టుకొని పాదము నీ వొడి మీద జాచీని
గుట్టుతో నానతిచ్చి నూకొన గదె మాట !       ॥ఎంత॥

చెలరేగి మంతనాన శ్రీ వేంకటేశు డెనసె
అలమేలు మంగవు నీ వలమ గదె
పలు మారు నవ్వుతాను బాసికము గట్టీని
చలమెల్లా నీడేరె చల్లగదె నేస !

శృం : 25–115

ప.  స రి గ స రి ॥ గా ద ప ద ప గ రి స ॥
ఎం త బ - త్తో ॥ నీ - - - - మీ - ద ॥

1.  గ ప ద సా - ద ప గ ॥ ద ప గ రి సా - - ॥
నీ - - - - ర మ ణు ॥ డు - - - - - - ॥

2.  గ ప ద స రి గ గ రి సా స ద ॥ రి స ద ప ద ప గ రి గ రి సా ॥
నీ - - - - - ర - మ ణు - ॥ డు - - - - - - - - - - ॥

3.  ప ద స రి గ ప గ రి సా స ద ॥ స రీ స ద ప ద ప గ రి సా ॥
నీ - - - - - ర - మ ణు - ॥ డు - - - - - - - - ॥

4.  ప గ ద ప దా స ద రి స రీ ॥ సా రి గ రి స ద ప పా ద స ద ప గ రి ॥
నీ - - - - ర - మ - ణు ॥ డు - - - - - - - - - - - - - ॥

1.  స రి గ ప గ రి గ రి సా ॥ స ధ ఫా ధ ధ సా ॥
చెం - త - న్నుం - - - డి ॥ ఇ - య్యి గ ద పే ॥

స రి గా రి గ పా గ ప దా || ప ద సా ద ప ద ప గ రి ||
చే - - తి - కి ఖా - - || గా - - లు - - - - - - || ||ఎంత||

2\. స రి గ ప గ రి గ రి సా || గ ప ద స ద ప ద పా ||
చెం - త - నుం - - - - డి || ఇ - య్యా - గ - ద వే ||

స రి గ ప గ రి గ రి సా || ద స ద ప ద ప రి గ రి స రి స ||
చే - - - తి - కి - ఖా || గా - - - - - - లు - - - - - || ||ఎంత||

చ. గ ప పా పా ద ప ప గ || ప ద సా ద ప గ రి రి స ||
ప య్యో ద కొం - - - || గు - - వ - - - టి - ||

గ గ ద ప ద ప గ రి || స రి గ ప గ రి గ రి సా ||
ప తి నీ - - - తో - || జె - న - గీ - - - ని ||

ధ స సా రి స ధ ధ దా || స రి గా రి గ ప ద పా ||
ఇ య్య కొ - - - - ని || రా - - గ - ద - వే ||

గ రి గా ప ద సా దా || పా - - - - ||
ఇం - టి కి - - నే || డు - - - - ||

సా సా రి స ద ప దా || స రి గ ప గ రి గ రి సా ||
చె య్యా - - - - ర || న - - - ప్ప - టి - నీ ||

దా స రి గ రి గ రి సా || ద స రి స ద ప దా ||
చె క్కు - నొ - - - కి || వే - డు - కొ - నీ ||

స రి గా స రి సా || ప ద నా ప ద పా ||
వు - - య్యా - ల || మం - - చ ము పై ||

ప గ ద ప దా స ద రి స రి || సా రి గ రి స ద ప పా ద స ద ప గ రి ||
ఖూ - ర్భుం - - ధ - గ - ద || వే - - - - స - దు - - - - స - ||
||ఎంత||

**అవతారిక :**

ఈ పదము నందలి నాయిక విరహోత్కంఠిత, ముగ్ధ, స్వీయ. ఈమె తన నాథునికై ఎదురు చూచుచు, తాను అతని చెంత నుండిన వేళలలో తనకు గలిగిన అనుభవములు, ఆనందములు తలచుకొని వగచుచు, "చెలి నంపితిని, వలనగు నామె మాటలను విని వచ్చినో రాదో! నా యందు ప్రేమగల నా స్వామి తన వెనుకటి యనుభవములను తలచునో లేదో! కాని నాకు మాత్రము నా చెక్కులను నెపములతో నంటినచొప్పు, నా హారములను సవరించెడి చందము, మొలనూళ్లు దిద్దిన విధము, కౌగిళుల నలమిన రీతులు తలచుకొనినచో నా మనసు నిలువ కున్నది" అని తన కడకున్న ప్రియ సఖులకు చెప్పుకొనుచున్నది.

మోహన (అమరసింధు)—రూపకం

తలచిన దేహము నిలువదు తా నను దలచునో తలచడో
వలనుగ జెలి మాటలు విని వచ్చినో రాడో ! ॥పల్లవి॥

శిరసున నంటిన పునుగిటు చెక్కుల జారెడి ననుచును
ఉరవడి దివియుచు గొన గోరూదిన చందములు
మురిపెపు మొలనూళ్ళపై (ళులపై) మొగపుల సొబగులు చూచుచు
నరుదుగ గరమున నక్కడ నంటెడి యాసలును ! ॥తలచిన॥

చెనకుల వీడెపు రసమిదె సెలవుల జెదరెడి ననుచును
నునుపగు గోళ్ళ (ళుల) వాతెర నొక్కిన చందములు
పెనగొను ముత్యపు సరముల పెక్కువ దీర్చెద ననుచును
చనవున జనుగవపై జే చాచిన చందములు ! ॥తలచిన॥

వుద్దపు నడపుల లోపల నొయ్యన పాదము జారిన
నొద్దికతో నును గౌగిట నొరసిన చందములు
నిద్దపు దిరువేంకటగిరి నిలయుడు నను దనకౌగిట
నద్దిన కస్తురి చెమటల నలమిన చందములు ! ॥తలచిన॥

శ్రృం : 12—8ర్కళి

ప. - గ పా ద సా ద ద || ప ప ప గ ద ప గ రి సా ||
- త ల చి న దే - || హా ము ని - లు - వ - దు ||

- స రీ గ సా రి రి || రి రి గా ద ప గ రి సా ||
- తా - న ను ద ల || చు నో ద ల - చ - డో ||

2. - గ పా ద సా స రి గా || రి స ద ప గ రి ||
- త ల చి న దే - - || హా ము ని లు వ దు ||

- స రీ గ సా రి రి || రి రి గా ద ప గ రి సా ||
- తా - న ను ద ల || చు నో ద ల - చ - డో ||

- స దా స రీ గ రి || స రి గా రి గ పా గ ప ధా ||
- వ ల ను గ చె లి || మా - - ట - లు వి - - ని ||

పా ద ప ప గ ప ద సా || - - ద ప ద ప గ రి గ రి || స రి
వ - - - - చ్చి - నో || - - రా - - - డో - - - || - -

||తలచిన||

చ. - స రి గ రీ సా రి స స ధ || స స ధ ఫ ధ ధ ||
- శి ర సు న నం - - - - || టి న పు ను గి టు ||

సా ప స ఫ ధ నా || ధ స రీ స రి గా రి గ పా ||
చె క్కు ల జా - - || రె - డి న - ను చు - - ||

- గ దా ప దా గ ప || రి గ స రి గ రి ||
- ఉ ర వి డి ది వి || యు చు కొ న గో - ||

- గ పా ద సా ద ప || ద గ పా - - ||
- రూ - ది న చం - || ద ము లు - - ||

- గ పా ద దా ప ద రి స || దా ప ద గా పా ||
- ము రి పె పు మొ - ల - || నూ - - ళ్లపై ||

- ప దా స సా స రి గా || రి స రి ద స స ||
- మొ గ పు ల సొ - గ || సు లు చూ - చు చు ||

- స రి గ పా గ రి || స స రి ధ స స ||
- అ రు దు గ గ ర || ము న న - క్క డ ||

- ప గా ప దా సా || - - ద ప ద ప గ రి గ రి || స రి
- నం - బె డి యా || - - న - లు - ను - - - || - -

||తలచిన||



# రాగముల పట్టిక

## అనుబంధము

| సంఖ్య | రాగము | మేళకర్త | ఆరోహణ | అవరోహణ |
|---|---|---|---|---|
| 1. | సామరావళి | 3 | స రి మ ప ద ని స | స ని ద ప మ గ రి స |
| 2. | భూపాళం | 8 | స రి గ ప ద స | స ద ప గ రి స |
| 3. | ధన్యాసి | 8 | స గ మ ప ని స | స ని ద ప మ గ రి స |
| 4. | ఆహిరి | 8 | స రి స గ మ ప ద ని స | స ని దా ప మ గ రి స . |
| 5. | నాగవరాళి | 8 | స రి గ మ ప మ ద ని స | స ని ద మ ప గ మ గ రి స |
| 6. | హెజ్జజ్జ | 13 | స రి గ మ ప ద స | స ని ద ప మ గ రి స |
| 7. | మాయామాళవ గౌళ | 15 | స రి గ మ ప ద ని స | స ని ద ప మ గ రి స |
| 8. | మంగళకైశిక | 15 | స రి గ మ ప మ ద ని స | స ని ద ప మ గ రి స |
| 9. | మలహరి | 15 | స రి మ ప ద స | స ద ప మ గ రి స |
| 10. | పాడి | 15 | స రి మ ప ద ప ని స | స ని ప ద ప మ రి స |
| 11. | బౌళి | 15 | స రి గ ప ద స | స ని ద ప గ రి స |
| 12. | మేచబౌళి | 15 | స రి గ ప ద స | స ని ద ప గ రి స |
| 13. | గుండక్రియ | 15 | స రి గ మ ప ద ని స | స ద ని ప ద మ ప మ గ రి స |
| 14. | సావేరి | 15 | స రి మ ప ద స | స ని ద ప మ గ రి స |
| 15. | గౌళ | 15 | స రి గ మ రి మ ప ని స | స ని ప మ రి గ మ రి స |
| 16. | సాళంగనాట | 15 | స రి మ ప ద స | స ని ప ద ప మ గ రి స |
| 17. | లలిత | 17 | స గ మ ద ని స | స ని ద మ గ రి స |
| 18. | భైరవి | 20 | స గ రి గ మ ప ద ని స | స ని ద ప మ గ రి స |
| 19. | నాగగాంధారి | 20 | స రి మ గ మ ప ద ని స | స ని ద ప మ గ రి స |
| 20. | శ్రీ | 22 | స రి మ ప ని స | స ని ప ద ని ప మ రి గ రి స |
| 21. | కన్నడగౌళ | 22 | స రి గ మ ప ని స | స ని ద ప మ గ స |
| 22. | మనోహరి | 22 | స గ రి గ మ ప ద స | స ద ప మ గ రి స |
| 23. | సైంధవి | 22 | ని స రి గ మ ప ద ని | ని ద ప మ గ రి స ని ధ |
| 24. | హిందోళ | 22 | స గ మ ద ని స | స ని ద మ గ స |
| 25. | రీతిగౌళ | 22 | స గ రి గ మ ని ని స | స ని ద ప ద ని మ గ రి స |
| 26. | మాళవశ్రీ | 22 | స గ గ మ ప ని ని స | స ని ద ప మ ప ని మ మ గ స |
| 27. | పళవంజరం (పలమంజరి) | 22 | స గ మ ద స | స ని ద ప మ గ మ రి స |

| | | | | |
|---|---|---|---|---|
| 28. | శుద్ధదేశి | 22 | స గ రి గ స రి గ మ<br>ప మ ని ద ప ని స̇ | స̇ ని ద ప మ రి మ గ రి స |
| 29. | మధ్యమావతి | 22 | స రి మ ప ని స̇ | స̇ ని ప మ రి స |
| 30. | ముఖారి | 22 | స రి మ ప ద ని ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 31. | వేళావళి | 23 | స రి గ మ ప ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 32. | నట్టనారాయణి | 28 | స రి గ మ ద ని ద స̇ | స̇ ని ద ప మ గ మ రి స |
| 33. | నారాయణి | 28 | స రి మ ప ద స̇ | స̇ ని ద మ రి స |
| 34. | మాళవి | 28 | స రి గ మ ప మ ద ని స̇ | స̇ ని ద ని ప మ గ మ రి స |
| 35. | కాంభోజి | 28 | స రి గ మ ప ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 36. | బలహంస | 28 | స రి మ ప ద స̇ | స̇ ని ద ప మ రి మ గ స |
| 37. | యదుకులకాంభోజి | 28 | స రి మ ప ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 38. | కుంతలవరాళి | 28 | స మ ప ద ని ద స̇ | స̇ ని ద ప మ స |
| 39. | ఆందోళి | 28 | స గ మ ద ని ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 40. | కేదారగౌళ | 28 | స రి మ ప ని స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 41. | శంకరాభరణం | 29 | స రి గ మ ప ద ని స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 42. | కురంజి | 29 | ని̣ స రి గ మ ప | ద ప మ గ రి స ని̣ |
| 43. | దేవక్రియ | 29 | స రి మ ప ద స̇ | స̇ ద ప మ రి స |
| 44. | బంగాళ | 29 | స రి గ మ ప ద ప స̇ | స̇ ని ప మ గ మ రి స |
| 45. | శుద్ధవసంతం | 29 | స̇ రి గ మ ప ద ని స̇ | స̇ ని ద మ ప మ గ రి స |
| 46. | ఆరభి | 29 | స రి మ ప ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 47. | నీలాంబరి | 29 | స రి గ మ ప ద ప ని స̇ | స̇ ని ద ని ప మ గ రి గ స |
| 48. | సామ | 29 | స రి మ ప ద స̇ | స̇ ద ప మ గ రి స |
| 49. | బిలహరి | 29 | స రి గ ప ద స̇ | స̇ ని ద ని ద ప మ గ రి స |
| 50. | దేశాక్షి | 29 | స రి గ ప ద స̇ | స̇ ని ద ప మ గ రి స |
| 51. | దేవగాంధారి | 29 | స రి గ రి మ ప ద ని స̇ | స̇ ని ద ని ద ప మ గ రి స |
| 52. | ఆహిరినాట | 29 | స గ మ ప ని ద ని స̇ | స̇ ని ప ద ని ప మ గ స |
| 53. | సామంతం | 30 | స రి గ మ ప ని స̇ | స̇ ని ద ని ప మ గ రి స |
| 54. | ఛాయానట | 34 | స రి గ మ ప మ ప స̇ | స̇ ని ద ని ప మ రి స |
| 55. | నాట | 36 | స రి గ మ ప ద ని స̇ | స̇ ని ప మ రి స |
| 56 | వరాళి | 39 | స గ రి గ మ ప ద ని స̇ | స̇ ని ద ప మ గా రి స |
| 57. | రామక్రియ | 51 | స గ రి గ మ ప ద ని స̇ | స̇ ని ద ని ద ప మ గ రి గ రి స |
| 58. | గౌళరామక్రియ | 51 | స రి గ ప ద స̇ | స̇ ని స̇ ద ప మ గ రి స రి గ |
| 59. | మోహన | 65 | స రి గ ప ద స̇ | స̇ ద ప గ రి స |